# చతుర

ఫిబ్రవరి 2003 ✻ రూ.7/-



## సుజలాం... సుఫలాం!

పారుపల్లి వెంకటేశ్వర రావు

# చతుర కతలు

## కాపీ కథ

ఇప్పుడొస్తున్న టీవీ సీరియల్స్ సంగతి మనకు తెలిసిందే. కథలో బలం లేకపోయినా సాగదీస్తున్నారన్న విషయం విదితమే. ఆ సంగతిని గ్రహించిన ఓ ప్రొడ్యూసర్ కమ్ డైరెక్టర్ మంచి సీరియల్స్‌ని తీయాలని ఉద్దేశంతో ఫేమస్ రైటర్ని పిలిచి ఓ మంచి కథను తయారుచేయమని చెప్పాడు.

ఒక్కటి మాత్రం విమర్శ ఉంది. ఆ లేఖ సారాంశం ఏమిటంటే 'ఈ కథ ఇంతకు ముందు ఓ హిందీ సీరియల్‌గా ప్రసారమయింది. దాని అనుసరణే ఇది. ఉత్త కాపీకథ కావాలంటే అతన్నే కనుక్కోండి' అంటూ రచయిత పేరు, అడ్రస్ తెలియపరిచాడు.

ఉత్తరం చూసి బిత్తరపోయాడు డైరెక్టర్ కమ్ ప్రొడ్యూసర్.

రచయితను పిలిపించి "ఏమయ్యా! నువ్వు



వారం రోజులు తిరక్కుండానే కథరాసి తీసుకొచ్చి ఇచ్చాడు. "మీకోసం. ఇది మీరు చెప్తేనే రాత్రీ పగలూ కూర్చుని స్క్రిప్టు తయారు చేశాను" అన్నాడు రచయిత.

కథనంతా చదివాక "వెరీగుడ్! మంచి కథ రాశావు. కొత్తదనం ఉంది ఇందులో" ప్రశంసించాడు. చెప్పినదానికంటే ఎక్కువ పారితోషికం ఇస్తానని ప్రకటించాడు. సంతోషంతో పొంగిపోయాడు రచయిత.

టీవీ ఛానెల్‌లో సీరియల్ ప్రారంభమైంది. సీరియల్ చాలా ఇంట్రెస్టింగ్‌గా సాగిపోతోంది. పది ఎపిసోడ్‌లవరకూ మంచి రెస్పాన్స్ వచ్చింది. చాలామంది ప్రేక్షకులు ప్రశంసించి లేఖలు రాస్తున్నారు. అందులో

రాసి ఇచ్చిన స్క్రిప్టు హిందీ కథ అనుసరణ అని తెలిసింది. అలా రాయటానికి నీకు సిగ్గు లేదూ? నాకు ఎంత అగౌరవం? నలుగురిలో తల దించుకునేలా చేశావ్ కదయ్యా. నీకేం పొయ్యేకాలం వచ్చింది? " అని చీవాట్లు పెట్టాడు.

"అది కాదండీ. అదీ..."

రచయిత మాటలు ఏవీ వినిపించుకోకుండా "ఏదికాదండీ? వెళ్లిపోండి. ఇక మీ ముఖం చూపించద్దు" చిరాకుపడి పంపించేశాడు.

అంతలో పిలిపించిన హిందీ రచయిత

చతుర... 3

వచ్చాడు.

"ఏమయ్యా! నువ్వైనా చెప్పచ్చుకదా! అది నా కథను పోలి ఉన్నదని. కథను కాపీ చేశాడని అతనిమీద కేసు పెట్టచ్చుకదా! కాపీ కొట్టడం ఎంతనేరం అనుకొంటున్నావ్?" అని అడిగాడు గట్టిగా.

మౌనం అతని సమాధానం.

"మంచి కథ. బాగా రాశావ్. ఎలా రాశావ్? స్ఫూర్తి ఏమిటీ?" కుతూహలంగా అడిగాడు.

వెంటనే సమాధానంగా "ఎలా రాశానా ఏంటీ? తెలుగు పాత కథ చూసి రాశా" అనేసి నోరుజారానని నాలుక కొరుక్కున్నాడు.

విస్తుపోయాడు డైరెక్టర కమ్ ప్రొడ్యూసర్.

– ఎం.కృష్ణ

---

# అద్దె ఇల్లు

కుక్కుటేశ్వరరావు ఆ ఇంట్లో అద్దెకు దిగి పదిహేనేళ్లయింది. ఉద్యోగంలో చేరిన కొత్తల్లో గావును ఆ ఇంట్లో చేరాడు. ఆనాటినుంచీ ఆ యింటివాళ్లకే కాదు ఆ వీధిలో వాళ్లకి కూడా తలలో నాలికలా మెలుగుతూ మంచివాడిగా పేరు తెచ్చుకున్నాడు. ఎవరికేం అక్కర వచ్చినా నేనున్నానంటూ ముందుండేవాడు. ఎవరినీ 'సారీ' అని నిరాశపరచిన రోజే లేదు. అందుకే అందరి దృష్టిలోనూ మంచివాడుగా, ఆప్తుడిగా గుర్తించబడ్డాడు. ఆ ఇంట్లోనే ఇల్లు ఇరుకవుతుందేమోనని కూడా ఆలోచించకుండా పెళ్లి చేసుకుని సుబ్బలక్ష్మితో కాపురం పెట్టాడు. పెళ్లి జరిగిన రెండేళ్లకి పెద్దాడు, ఆపై రెండేళ్లకి చిన్నాడు పుట్టుకొచ్చి ఇద్దర్ని నలుగుర్ని చేశారు. "మేమిద్దరం..మాకిద్దరు" అనుకుంటూ కుటుంబ విస్తరణ కార్యక్రమానికి ఫుల్‌స్టాప్ పెట్టేశారు. "చిన్న కుటుంబం, చింతల్లేని కుటుంబం" అన్నట్టు అనుకూలమైన భార్య, ముత్యాల్లాంటి పిల్లలతో సంతోషంగా సాగిపోతోంది కుక్కుటేశ్వరరావు సంసారం.

ఎప్పుడూ హేపీగా నడిపిస్తే తన ఉనికిని మర్చిపోతార్నుకుంటాడో ఏమిటో ఆ దేవుడు.. మధ్యమధ్యలో చిన్న జర్కులు ఇస్తుంటాడు. అలాంటి బాపతు జర్కే ఇచ్చాడు కుక్కుటేశ్వరరావుకి. మహా నగరంలో అద్దె ఇల్లు పట్టుకోవాలంటే ఇహలోకంలో ఇంతకు మించిన బాధ మరొకటి ఉండదు.

ఓరోజు ఉదయాన్నే ఆఫీసుకి వెళ్తుంటే ఇంటి ఓనరు పిలిచి కూర్చోబెట్టి కాఫీ ఇచ్చి మరీ చెప్పాడు.

"కుక్కుటేశం..ఇలా చెప్పాల్సి వచ్చినందుకు నాకూ ఎంతో బాధగా వుందోయ్.." అంటూ ఏ ఉపోద్ఘాతమూ లేకుండా మొదలుపెట్టేసరికి ఒక్కసారి గుండె గుభేలుమంది.

"కొంపతీసి ఇంటి దగ్గర్నుంచి ఏ కబురూ రాలేదు కదా.. అసలే అమ్మకి అనారోగ్యం కూడాను.." అనుకుంటూ గుండె చిక్కబట్టుకుని చెప్పండి బాబాయిగారూ ఏమిటి విషయం" అన్నాడు ఏం వినవల్సివస్తుందోనని భయపడుతూ కుక్కుటేశ్వరావు.

"ఏంలేదోయ్. ఇన్నాళ్లూ ఇంట్లో బిడ్డల్లా కలిసిపోయారు నువ్వూ, కోడలూను. పిల్లలు సరేసరి. రేపు నెలాఖరికి మా అబ్బాయికి ఈ ఊరు ట్రాన్స్‌ఫర్ అవుతుందిట. వేరే ఎక్కడో ఎందుకు మనింట్లోనే అందరం కల్సివుందాం' అంటూ ఉత్తరం రాశాడు. అందుకని ఈలోపు మీరు మరో ఇల్లు చూసుకోవాలోయ్" అన్నాడాయన. ఊహించని బాంబు పేలడంతో "బాబాయిగారూ" అంటూ చేతిలో వున్న ఖాళీ కాఫీ గ్లాసుని నేలమీదికి వదిలేశాడు.

"అవును కుక్కుటేశం. నేనూ నీకన్నా ఎక్కువే బాధపడుతున్నాను. మీ పిన్నిగారయితే కళ్లనీళ్లే పెట్టుకుంటోంది. ఒకటా రెండా పదిహేనేళ్ల అనుబంధం మరి. అద్దె పెంచమంటే ఏ ఏడూ బాధపడలేదు నువ్వు. అలాంటి మిమ్మల్ని ఖాళీ చెయ్యమనడం ఇష్టంలేక మావాణ్ణి "మరో ఇల్లు చూసుకోరా" అని చెప్పేద్దామనుకున్నాను. కానీ ఇది లోకం కుక్కుటేశం. లోకానికి భయపడి ఆ మాట

వాడితో అన్లేకపోయాను" అన్నాడు రాని కన్నీళ్లు తుడుచుకుంటూ.

"అలాగే బాబాయిగారూ! ఏంచేస్తాం. ఎంత వరకూ రుణమో.." విరాగిలా అన్నాడు కుక్కుటేశ్వర్రావు.

"అవునవును. అంతే. అంతే. రుణానుబంధ రూపేణా అన్నాడు గీతలో భగవానుడు. ఆఫీసుకి టైమవుతున్నట్టుంది./ వెళ్లిరా కుక్కుటేశం" అంటూ సాగనంపాడు ఇంటి ఓనరు.

★ ★ ★

ఇళ్లవేటలో నెల్లాళ్లు గడిచిపోయినా అనువైనది ఒక్కటీ దొరకలేదు కుక్కుటేశ్వర్రావుకి.



"మీవల్ల కాకపోతే ఏ ఇళ్ల బ్రోకర్నో పట్టుకో రాదూ" అన్న సుబ్బలక్ష్మి సలహానే పాటించాలని నిర్ణయించుకుని ఆ పని చేశాడు ఓరోజు. అడిగీ అడగ్గానే టకటకా ఓ పాతిక చిరునామాల్ని చదివేశాడు. ఆపైన "ఎంతలో కావాలి, ఎలా వుండాలి?" అంటూ ప్రశ్నించాడు. చెప్పాడు కుక్కుటేశ్వర్రావు. "సరే నాతో రండి" అంటూ ఓ ఇంటికి తీసుకెళ్లాడు ఇళ్ల బ్రోకరు. ఇల్లు చూడ్డానికి ఎంతో బాగుంది. కిచెన్, హాలు, బెడ్‌రూమ్స్ రెండు, ఎటాచ్డ్ టాయ్‌లెట్స్. ఎవరితోనూ ఇబ్బందిలేని సెపరేట్ హౌస్. "మరి అద్దె" అన్నాడు కుక్కుటేశ్వర్రావు. చెప్పాడు బ్రోకరు. అదిరిపోయాడు కుక్కుటేశ్వర్రావు. "ఏమిటీ నిజంగానే?" ఆశ్చర్యంగా అడిగాడు. "అవునండీ. నేను చెప్పిందీ మీరు విన్నదీ నిఝంగా నిజమే" అన్నాడు బ్రోకరు.

"అవునూ మనలో మనమాట. ఇంతకీ ఎందుకంత అద్దె తక్కువకిస్తున్నారంటారూ?" రహస్యంగా అడిగినట్టు లోగొంతుకతో అడిగాడు కుక్కుటేశ్వర్రావు.

"అదా, అదీ. ఈ ఇంటికి వెనక వున్న మేడ "మహిళా మండలి" బిల్డింగ్. అందులోంచి విన్పించే రణగొణ కోలాహల ధ్వనులకి భయపడి ఈ చుట్టుపక్కల ఇళ్లల్లోకి అద్దెకి ఎవరూ రారు.. మరీ తక్కువలో కావాలనుకున్నవాళ్లు తప్ప. అదిగో ఆ బిల్డింగ్‌లో చెవిటి మిషన్ల షాపు. ఆ పక్క బిల్డింగ్‌లో చెవిటి డాక్టరు హాస్పిటలూ ఎంతో లాభసాటిగా నడుస్తున్నాయి." అంటూ అసలు విషయం చెప్పాడు ఆ బ్రోకరు.

"ఇంతకీ అడ్వాన్సు ఇస్తున్నట్టేనా?" అడిగాడు బ్రోకరు.

అంతే.. మరు క్షణంలో మాయమయ్యాడు ఆ చోటునుండి కుక్కుటేశ్వర్రావు "అమ్మో" అంటూ.

- సూరిపండు

# చతుర

సంపుటి: 26
సంచిక: 1
ఫిబ్రవరి: 2003
301వ సంచిక

ఆ పల్లెకు కొత్తగా వచ్చాడో వ్యక్తి. తానెవరో చెప్పకుండా అక్కడి విషయాలన్నీ ఆసక్తిగా పరిశీలించసాగాడు. అంతలో మరో కొత్త వ్యక్తి డొంక బాటలో తగిలాడతనికి. ఇద్దరూ మాట్లాడుకున్నారు. తన విషయం కూడా కొన్నాళ్ళు అజ్ఞాతంగా వుంచమని అర్థించాడా వ్యక్తి. ఇద్దరూ కలిసి ఊళ్లో విషయాలన్నిటినీ పరిశీలించడం ప్రారంభించారు. పచ్చని పంటలకీ, స్వచ్ఛమైన పైరగాలికీ ఆలవాలమయిన ఆ గ్రామంలో విషపూరిత వాతావరణం కూడా వుందని గ్రహించిన ఆ ఇద్దరూ వాటిని వెలికితీసి గ్రామాన్ని ఓ కొలిక్కి తెచ్చిన కథాకమామీషు ఏమిటి? ఆ ఇద్దరి ఉద్యోగాలూ ఎలాంటివి? వారి రాక వెనక ఆంతర్యం ఏమైవుంటుంది? యంత్రాలమధ్య కృత్రిమంగా బతుకుతూ కాలం గడుపుతున్న ఆధునిక మానవుడికి పల్లెసీమల్నీ, వాటిలో వ్యవసాయాభివృద్ధి అవసరాన్నీ అక్షరరూపంలో తెలియజేసిన

**పారుపల్లి వెంకటేశ్వరరావు** రచన

## 'సుజలాం... సుఫలాం!'

ఈ నెల చతుర సమగ్ర నవల.



వేకువ జామున ఆదమరచి నిద్రించే గ్రామీణుల్ని కోడిపుంజులు వైతాళికులై గొంతెత్తి కూసి మేల్కొలిపాయి.

బ్రహ్మానాయుడుగారి పాలేరు సదానందం కోడికూత విని లేచాడు.

ఇంతలోనే బ్రహ్మానాయుడుగారి సతీమణి భారతీదేవి "సదానందం! కోడికూసింది రా! మేలుకున్నావా? " అని పిలిచింది.

"ఆ లేచానమ్మా! బండికి సవారి కడతాను" అన్నాడు.

గ్రామానికి తొమ్మిది కిలోమీటర్ల దూరంలో వున్న అరుణాలయం రైల్వేస్టేషనుకి యెడ్లబండి తోలుకుపోవాల్సి వుంది. సదానందం అందుకు సన్నాహాలు చేస్తున్నాడు.

"అమ్మా! బండికి సవారి కట్టాను" అన్నాడు.

భారతీదేవి ఒక బుట్టలో పాత్రలు సర్ది సదానందానికి అందించి "అమ్మాయి రైలు దిగగానే బుట్టని అమ్మాయికి ఇవ్వు" అంది.

సదానందం ఆ బుట్టని బండిలో పెట్టాడు.

పాలవన్నె తెలుపుతో పరువంలో వున్న జోడు గిత్తల్ని బండికి కట్టి వూరిలోనుండి తూర్పుగా వెళ్లే డొంక బాటన తోలుకుపోతున్నాడు.

అది 1955-60 మధ్యకాలం. ఆ రోజుల్లో అన్ని గ్రామాలకి రోడ్లు, బస్సు సర్వీసులు లేవు. గ్రామీణ కర్షక కుటుంబాలలోని స్త్రీలు, పిల్లలు, వృద్ధులు ప్రయాణాలు చెయ్యాలంటే సవారి బండ్లే ప్రయాణ సాధనాలుగా వుండేవి.

చెయ్యి మీద వేస్తే చెంగు చెంగుమని పరుగులు తీసే గిత్తల మెడలలోని గంటలు, మువ్వలు ఘల్లుఘల్లున మోగుతుండగా సదానందం బండి వడివడిగా సాగిపోతోంది.

సవారిబండిని వేగంగా తోలటంలో ఆ వూళ్లో సదానందానికెవరూ సాటిరారు. ఊరి రైతులు ఆ బండికి విజయరథం అని పేరు పెట్టారు.

ఊరి వెలుపల డొంకబాటలో సదానందానికి దేవేంద్ర అనే మిత్రుడు కలిశాడు. అతడు తన యెడ్లతో నాగలి కోటేరు వేసుకొని పొలానికి వెళ్తున్నాడు.

"సదానందన్నయ్యా! పొద్దున్నే బండితోలుకు పోతున్నావెక్కడికి? "

"అరుణాలయం రైల్వే స్టేషనుకి రా దేవేంద్రా! మా బ్రహ్మానాగయుడుగారు హైద్రాబాదునుండి కూతురుతో కలిసి వస్తున్నారు."

"అరుణాలయం వెళ్లే డొంకబాట అక్కడక్కడా బడుగులు తేలి బళ్లు దిగబడతన్నయ్యంట. జాగర్తగా వెళ్లు"

"మన బండికేం భయంరా తమ్ముడూ! మనది విజయరథం అని నీకు తెలుసుగా. కుండలదాకా చక్రాలు కూరుకుపోయినా ఒక్క వూపులో లేవేసేసత్తా మన గిత్తలకుంది" అంటూ సదానందం ముందుకు సాగిపోయాడు.

స్టేషనుకి డొంకబాట మాత్రమేవుంది. స్టేషనునుండి ఎడ్లబండిలోగాని, నడిచిగాని రావాల్సిందే!

పెళ్లిళ్ల సందర్భాలలోను, యాత్రా స్థలాల సందర్శనాలకి దూరపు ప్రయాణాలు చేయాల్సి వస్తే రైతు కుటుంబాలవారు సామూహికంగా సవారిబళ్లు కట్టుకొని ప్రయాణించేవారు. ఒకరితో ఒకరు పోటీలు పడి బళ్లని పరుగెత్తించేవాళ్లు. అట్టి సందర్భాల్లో సదానందం బండి వేగాన్ని ఎవరూ అందుకోలేకపోయేవాళ్లు. అందుకే ఆ బండికి విజయరథం అన్న పేరు వచ్చింది.

గంటలు, మువ్వల గణగణ మోతలతో హై హై అంటూ కేరింతలు కొడుతూ ఆ రోజుల్లో సవారిబళ్లను కర్షక యువకులు సంరంభంతో పరుగెత్తించేవాళ్లు. బళ్లలో

ప్రయాణించే స్త్రీలు, పిల్లలు, ఆ సందడికి పరమానందం పొందేవాళ్లు.

★ ★ ★

సికింద్రాబాదు రైల్వే స్టేషన్‌లో బ్రహ్మానాయుడు, ఆయన కుమార్తె అనూరాధ విజయవాడవైపు వెళ్లే రైలు కోసం ఎదురు చూస్తూ వెయిటింగు రూంలో కూర్చున్నారు.

అనూరాధ భారతీయ తత్వశాస్త్రం పుస్తకం చదువుతూ వుంది.

సుమారు ఇరవై అయిదేళ్ల వయసున్న యువకుడొకడు సూట్‌కేసుతో వచ్చి బ్రహ్మానాయుడికి దగ్గరలో వున్న సోఫాలో కూర్చున్నాడు.

ఆ యువకుడి శరీరం మేలిమి బంగారు రంగులో వుంది. చక్కని కనుముక్కుతీరు, నల్లని జుట్టు, సరిపడిన ఎత్తు కలిగి ఆకర్షణీయంగా వున్న ఆ యువకునితో బ్రహ్మానాయుడికి మాట్లాడాలనిపించింది.

ఏదో ఆలోచిస్తూ కూర్చున్న ఆ యువకునితో

"ఎక్కడికి బాబూ నీ ప్రయాణం?" అనడిగాడు.

"విజయవాడవైపు వెళ్లే రైలుకండీ"

"విజయవాడలో ఉద్యోగం చేస్తున్నావా?"

"లేదండీ! నేను వెళ్లేది విజయవాడకాదు" అన్నాడా యువకుడు.

పుస్తకం చదువుతూనే ఓరగంట ఆ యువకుణ్ణి గమనిస్తూ వారి సంభాషణ వింటున్న అనూరాధ ఆ యువకుడి వైపు చూసి,

"ఇంతకు ముందు మీరు విజయవాడ వెళ్లాలన్నారుగా!" అంది.

"నేను విజయవాడవైపు వెళ్లాలన్నాను. విజయవాడ వెళ్లాలనలేదు" అని చిరునవ్వుతో ప్రశాంతంగా సమాధానం చెప్పాడు.

"అవునమ్మా! విజయవాడవైపు వెళ్లాలనే అన్నాడు. మనం సరిగా వినిపించుకోలేదు" అన్నాడు బ్రహ్మానాయుడు.

"విజయవాడవైపు ఏ స్టేషన్‌లో దిగుతావు బాబూ? మా ప్రయాణం కూడా ఆ వైపే! మేము అరుణాలయం స్టేషన్‌లో దిగుతాం"

"నేను కూడా అరుణాలయం స్టేషన్‌లోనే దిగుతానండీ! అక్కడ దిగి వీరవరం అనే వూరు వెళ్లాలి"

"వీరవరం వెళ్లాలా! వీరవరంలో ఎవరింటికి?"

"ఎవరింటికి అనేది ఇప్పుడే తెలియదు. ఇంతకుముందు నాకు ఆ వూరు తెలియదు. ఇంతవరకు ఆ వూళ్లో ఎవరితోను పరిచయంలేదు"

అనూరాధ పుస్తకం చదవటం ఆపి ఆ సంభాషణ వింటున్నది.

"ఎవరూ తెలియని, ఎవరితోనూ పరిచయం లేని వీరవరం ఎందుకు వెడుతున్నావు" బ్రహ్మానాయుడు ఆసక్తిగా అడిగాడు.

"హైద్రాబాదులో మా బంధువుల ఇంట్లో మొన్న నారాయణరావుగారు కలిశారు. వారిదీ వీరవరమే. మా మేనమామ నన్ను వారికి పరిచయం చేశాడు. అక్కడ మాకు వ్యవసాయం గురించి చర్చ వచ్చింది.

"వీరవరం కర్షకుల వ్యవసాయ నైపుణ్యం గురించి, ఆ గ్రామ నైసర్గిక పరిస్థితి గురించి, ఆ గ్రామ ప్రజల ఉత్తమ సంస్కృతి గురించి నారాయణరావుగారు మాకు వివరంగా చెప్పారు.

"వీరవరం ఏటిపక్కన తువ్వ నేలల్లో ఏపుగా పెరిగిన మామిడి, నారింజ, సపోటా, జామ, నిమ్మ తోటల్లో మనోహర ప్రకృతి దృశ్యాలమధ్య తిరుగుతుంటే కలిగే ఆహ్లాదం ఆయన చెబుతుంటే విన్నాను.

"చిగురు కొమ్మల చేవలుగల ఆ వీరవరం తోటల్ని, వీరవరం కర్షకుల విశిష్ట వ్యవసాయ నైపుణ్యాన్ని, ఉత్తమ సంస్కృతిగల ఆ గ్రామాన్ని చూడాలని అనుకున్నాను.

"నాకు వ్యవసాయం అన్నా, తోటలు పెంచటం అన్నా చాలా ఇష్టం. నారాయణరావుగారి దగ్గర వీరవరం అడ్రసు తీసుకు

న్నాను. ఆయన నన్ను ముందుగా వీరవరంలో రాఘవేంద్రస్వామిగారిని కలుసుకోమని చెప్పారు. రాఘవేంద్రస్వామిగారు ధార్మికుడు, విశిష్టవ్యక్తి అన్నారు. ఆయన అన్ని విధాలా నీకు సహకారం అందిస్తారని చెప్పారు.

"వీరవరంలో బ్రహ్మానాయుడుగారు అనే ఆదర్శ కర్షకుడు వున్నాడని నారాయణరావుగారు చెప్పారు. ఆయన కర్షకబ్రహ్మ అనదగ్గ వ్యవసాయ నిపుణుడట. ఆయన ఇల్లు ఒక వ్యవసాయ గురుకులం వంటిదట. రాఘవేంద్రస్వామిగారిద్వారా బ్రహ్మానాయుడుగారిని పరిచయం చేసుకోమని నాకు నారాయణరావుగారు చెప్పారు.

"మీరూ అరుణాలయం స్టేషన్‌లో దిగుతామన్నారుగా. మీదేవూరు? మీకు వీరవరం తెలుసా? బ్రహ్మానాయుడుగారి పేరు విన్నారా? "

బ్రహ్మానాయుడికి ఆ యువకుడి సంభాషణ ఆసక్తికరంగా వుంది. మనిషి ఆకర్షణీయంగా వున్నాడు. మాట తీరు స్వచ్ఛంగా వుంది.

'చిగురు కొమ్మల చేవలుగల తోటలు' అని వీరవరం తోటల్ని కావ్య భాషలో వర్ణించాడు. సాహిత్య పరిజ్ఞానం వున్న యువకుడే! అనుకోకుండా ఆ యువకుడు తనకు తటస్థపడటం, తనని గూర్చి తననే అడగటంతో బ్రహ్మానాయుడు కూతురువైపు చూసి నవ్వాడు.

అనూరాధ కూడా తండ్రివైపు చూసి నవ్వింది.

"ఏంటండీ! నవ్వుకుంటున్నారు. నా మాటలు మీరు నమ్మలేదేమో"

"అదేంలేదండీ! మీరు వీరవరంలో పరిచయం చేసుకోవాలనుకుంటున్న ఆ బ్రహ్మానాయుడుగారు వీరే! యాదృచ్ఛికంగా ఇక్కడే కలిసినందుకు మాకు నవ్వు వచ్చింది" అంది అనూరాధ.

"నమస్కారం బ్రహ్మానాయుడుగారూ! నన్ను మన్నించండి. అనుకోకుండా మీరు కలిసినందుకు ఆనందంగా వుంది"

"మా అమ్మాయి అనూరాధ" అని కూతురుని పరిచయం చేశాడు. అనూరాధ ఆ యువకుడికి నమస్కారం చేసింది.

"నారాయణరావుగారు నా గురించి మరీ ఎక్కువ చెప్పినట్లున్నారు బాబూ! నేను ఆ కర్షకబ్రహ్మ బిరుదుకు తగినంత గొప్పవాణ్ణి కాదు. నాకున్న పొలానికి సమగ్రంగా నీటి వనరులు సమకూర్చుకున్నాను. ఆ వనరుల్ని సక్రమంగా వినియోగించుకొంటున్నాను. అనావృష్టి పరిస్థితులకు గురికాకుండా పంటల్ని కాపాడుకోవటానికి పొలాలలో బావులు తవ్వించుకొన్నాను. తగిన దిగుబడి సాధించుకుంటున్నాను. అంతే!"

"మీలాటి ఉత్తమ వ్యక్తులు తమను తాము గొప్పగా చెప్పుకోరులెండి! నిరాడంబరంగా వుంటారు"

"నీ పేరేంటి బాబూ"

"నా పేరు సారథి. మాది గుంటూరు జిల్లాలో ఒక చిన్న పల్లెటూరు. నేను ఎక్కువగా హైద్రాబాదులో వుంటాను. ఇక్కడ మా మేనమామ వుంటాడు"

"సారథిబాబూ! నారాయణరావుగారు నాకు బాబాయి అవుతారు. ఆయన పంట పొలాలన్నా, తోటలు పెంచటం అన్నా, పశుపోషణ అన్నా ఎంతో ఆసక్తి చూపుతారు. ఆయనంటే మాకెంతో గౌరవం. ఆయన నిన్ను వీరవరం వెళ్లమన్నారంటే నీలో ఏదో విశేషం వుండే వుంటుంది"

ఇలా మాట్లాడుకుంటూ వుండగానే విజయవాడవైపు వెళ్లే రైలు ప్లాటుఫారం మీదకి వచ్చింది. సమయం రాత్రి పది గంటలయింది.

"సారథిబాబూ! మేము ఇక వెళ్లి మా సీట్ల నెంబర్లు చూసుకుంటాం. అరుణాలయం రైల్వే స్టేషన్‌లో కలుద్దాం. అక్కడికి మా ఎడ్ల బండి వస్తుంది. అందరం కలిసి వెళ్దాం"

"సరేనండీ! అలాగే కలుస్తాను" అంటూ సారథి కూడా తన సీటు చూసుకోవడం కోసం వెళ్లాడు.

★ ★ ★

రైలు కదలబోయే ముందు సారథి కూర్చున్న కంపార్టుమెంటులోకి హడావుడిగా సుమారు యాభై ఏళ్ల వయసున్న వ్యక్తి వచ్చి ఎక్కాడు.

"హమ్మయ్య! బండి అందదనుకున్నాను. ఎలాగో అందుకోగలిగాను" అని తనలో తాను అనుకున్నాడు. ఆయాసం తీర్చుకొని సర్దుకొని కూర్చొని ఎదురుగా వున్న సారథిని చూశాడు.

"ఎక్కడిదాక బాబూ నీ ప్రయాణం? "

"అరుణాలయం స్టేషన్‌లో దిగుతానండీ"

"అలాగా! సంతోషం బాబూ! ఒక్కణ్ణే బిక్కుబిక్కుమంటూ కూర్చోకుండా నాకు తోడు దొరికింది. నేనూ అక్కడే దిగుతాను"

వచ్చీ రావటంతోటే చొరవగా పలకరించిన ఆ వ్యక్తితో సారథి కూడా "మీ బోటివారు తోడుగా వుండటం నాకూ సంతోషంగానే వుంటుందండీ" అన్నాడు.

"అరుణాలయం స్టేషన్లో దిగి ఏ వూరన్నా వెళ్లాలా? లేక అరుణాలయంలోనే వుంటావా? "

"అరుణాలయం స్టేషన్‌లో దిగి వీరవరం వెళ్లాలి"

"ఆహా! మరీ సంతోషం! నేనూ వీరవరమే వెళ్లాలి బాబూ! మనం ఒకే చోటుకి, ఒకే రైలులో, ఒకే కంపార్టుమెంటులో కలుసుకున్నాం. ఒక్కొక్కసారి యాదృచ్ఛికంగా సమయం ఇలా కలిసి వస్తుంది బాబూ! నీ పేరేంటి? "

"నా పేరు సారథి. మాది గుంటూరు జిల్లా. నేను హైద్రాబాదులో మా మేనమామగారింట్లో వుంటాను"

"ఎవరింటికి వెళ్తున్నావు? మాదీ వీరవరమే"

"ఇంతవరకు నాకు వీరవరంలో ఎవరితోనూ పరిచయంలేదండీ! ఇంతకుముందే నాకు ఇక్కడ వెయిటింగు రూములో బ్రహ్మనాయుడుగారు పరిచయమయ్యారు. ఆయన వారి కుమార్తెతో కలిసి ఈ రైలులోనే వీరవరం వస్తున్నారు. వారు వేరే కంపార్టుమెంటులో వున్నారు. అరుణాలయం స్టేషన్లో కలుసుకుందామన్నారు. నేను మీ వీరవరం చూడాలని వస్తున్నాను"

అంటూ తనకు, బ్రహ్మనాయుడికి జరిగిన సంభాషణ, నారాయణరావుగారితో పరిచయం అంతా చెప్పాడు.

"ఓహో! చాలా బావుంది. గ్రామీణ వాతావరణాన్ని, పాడిపంటల్ని, సంస్కృతిని అభిమానించే నీలాంటి యువకులంటే నాకెంతో ఇష్టం బాబూ" అని మళ్లీ

"నేను నీకు బడబడా ప్రశ్నలు వేస్తూ నా గురించి చెప్పనేలేదు. నా పేరు మురళీకృష్ణ. నేను వీరవరం హైస్కూల్లో తెలుగు టీచర్ని"

"మీదీ వీరవరమే గనుక ఆ వూరి విషయాలు, బ్రహ్మనాయుడు, రాఘవేంద్రస్వామిగార్లని గురించి చెబితే సంతోషిస్తా"

"బ్రహ్మనాయుడు స్కూలు నుండి కాలేజీ దాకా నా క్లాసుమేటు. బంధువు, మిత్రుడు కూడా. అన్ని విషయాలు నీకు వివరిస్తాన్లే! ప్రయాణంలో కావాల్సినంత సమయం వుంది కూడానూ.

"మూడు వేల జనాభా వున్న వీరవరం వూరి ప్రజల ముఖ్యవృత్తి వ్యవసాయం. సుమతీ శతకకర్త చెప్పినట్లు 'ఎప్పుడు ఎడతెగక పారు ఏరు' వూరికి పశ్చిమ వాయవ్య దిశలో వుంది. ఏటి పక్కన సారవంతమైన ఒండ్రు నేలలు వున్నాయి.

"మా రైతులకు దూరదృష్టి ఎక్కువ. ఒండ్రునేలల్లో తోటలు బాగా పెరుగుతాయి. ఆ నేలల్లో మామిడి, నార్రింజ, నిమ్మ, సపోటా, జామ తోటలు వేశారు. ఏపుగా పెరిగిన ఆ తోటలు నిరంతరం పూత, పిందె, కాయలు, పండ్లతో నేత్రానందంగా

వుంటాయి.

"సారవంతమైన పంట భూములు వూరికి నలువైపులా కలిగిన వీరవరం నందనవనాలవంటి సుందరమైన తోటలతో, పచ్చని పంట పొలాలతో, ఆహ్లాదకరమైన వాతావరణంతో, సుఖశాంతులతో జీవితం సాగించే శ్రామికజనావళితో కళకళలాడుతూ వుంటుంది బాబూ"

"బాపూజీ! వీరవరం గ్రామ జనాభా మూడు వేలేనంటే తక్కువేనే"

"రాశికన్నా వాసి ముఖ్యం సారధి బాబూ! నూరుగురు సంఖ్యాబలం వున్న కౌరవుల కన్నా అయిదుగురు పాండవులు క్రియాశీలురు, కార్యసాధకులు అని మనకు భారత కథ తెలియజేస్తున్నదికదా!

"వీరవరం రైతన్నలు బల సంపన్నులు. తిండిపుష్టి, కండపుష్టి వున్న వాళ్లు. పౌరుషం, పట్టుదల కలవాళ్లు. సామాజిక చైతన్యం, సంస్కారం కలవాళ్లు. చదువులో, వ్యవసాయంలో, సాహిత్యంలో, సంఘసేవలో, దేశభక్తిలో అగ్రగాములు. ఇతర గ్రామాలవారికి ఆదర్శప్రాయులు.

"భారత స్వాతంత్ర్య పోరాటం ప్రారంభంలోనే దేశభక్తులైన వీరవరం ప్రజలు స్త్రీలు, పురుషులు, తెల్లదొరల పాలనకు వ్యతిరేకంగా పోరాటంలో పాల్గొని జైళ్లకు వెళ్లారు. గాంధీజీ పిలుపు అందుకొని అస్పృశ్యతా నివారణకు పూనుకొని పశ్చిమకృష్ణాజిల్లాలో ప్రథమంగా అంటరానితనాన్ని నిర్మూలించిన ఘనత మా వీరవరం గ్రామానిదే.

"దేశానికి స్వతంత్రం వచ్చిన తరువాత వితరణ శీలురైన కొందరు వీరవరం పెద్దల ఆర్థిక సహాయంతో హైస్కూలు, ప్రాథమిక ఆరోగ్యకేంద్రం, పశువైద్యశాల, గ్రంథాలయం ప్రభుత్వం నెలకొల్పింది.

"వీరవరంలో జాతీయ బ్యాంకు వుంది. సహకార పరపతి సంఘం వుంది. అతివాద, మితవాద, మతవాద, ఉగ్రవాద రాజకీయ పార్టీలకు నిలయంగా వున్న వీరవరం గ్రామానికి శాంతిభద్రతల అవసరాన్ని గుర్తించి ప్రభుత్వం పోలీస్‌స్టేషన్‌ని ఏర్పాటు చేసింది."

"జనాభా తక్కువే అయినా ఏర్పాట్లు ఎక్కువే చేసినట్లున్నారు"

"అటువంటి వీరవరానికి ఆదర్శకర్షకుడు బ్రహ్మానాయుడు. అతడు సాముగరిడీలు నేర్చిన వీరుడు. బలసంపన్నుడు. నిజాయితీ గల వ్యక్తిగా నిర్మల హృదయుడుగా వీరవరం ప్రజల అభిమానం పొందాడు.

"సదానందం అనే పాలేరు బ్రహ్మానాయుడికి నమ్మినబంటు. సదానందం హరిజన మాల యువకుడు. బ్రహ్మానాయుడికి ప్రేమ పాత్రుడు.

"తల్లి, తండ్రి అకాలమరణానికి గురికాగా ఎనిమిదేండ్ల వయసులో అనాథగా వున్న సదానందాన్ని బ్రహ్మానాయుడు పాలేరుగా చేరదీశాడు. ఆ ఇంట్లో పెరిగి పెద్దవాడయ్యాడు. చురుకైనవాడు.

"పాలేరుగా చేరదీసినా కాలక్రమంలో అతనిపట్ల వాత్సల్యం ఏర్పడింది. రాత్రి బడిలో చేర్పించి తెలుగు బాగా చదివించాడు.

"వర్ణధర్మాలన్న ఉక్కు చట్రం పగిలి
మాల కన్నమదాసు మనసైన సుతుడుగా
వీరవైష్ణవమొచ్చెరా! పలనాట బ్రహ్మన్న
కలిగీతలో."

అని ఒక కవి పలనాటి బ్రహ్మనాయుణ్ణి ప్రశంసించాడు. మన వీరవరం బ్రహ్మానాయుడు కూడా మాల సదానందాన్ని మనసైన సుతుడుగా సంభావిస్తూ, అపర బ్రహ్మానాయుడుగా ప్రశంసలు అందుకున్నాడు. ఆయన సతీమణి భారతీదేవి కూడా సదానందాన్ని కుమారుడిలాగే ప్రేమగా చూస్తుంది.

"బ్రహ్మానాయుడి శిక్షణలో సదానందం వ్యవసాయపు పనుల్లో నిపుణుడయ్యాడు. కర్రసాము కూడా బాగా నేర్చుకున్నాడు. బ్రహ్మానాయుణ్ణి నాన్నగారూ అని పిలుస్తాడు. భారతీదేవిని అమ్మా అనిపిలుస్తాడు.

ఆ దంపతుల ఔదార్యం ఎటువంటిదో దాన్నిబట్టి తెలుసుకోవచ్చు.

"ఆ ఆదర్శదంపతుల ఏకైక పుత్రిక అనూరాధ. ఆ అందాలరాశినే బ్రహ్మానాయుడు నీకు పరిచయం చేశాడనుకుంటాను? "

"అందాలరాశి అని మీరన్నది నిజం. అనూరాధ ఎం.ఏ. తత్వశాస్త్రంతో ఫస్టు క్లాసులో ఫస్టురాంకుతో పాసయింది. ఉత్తమ విద్యార్థినిగా యూనివర్శిటీలో గురువుల మన్ననలందుకుంది.

'భారతీయ తత్వవేత్తలపై ఉపనిషత్తుల ప్రభావం' అనే విషయం తీసుకొని పిహెచ్.డి చేసే ప్రయత్నంలో వుంది.

బ్రహ్మానాయుడుగారు మీ బంధువు అన్నారుగదా! ఆయన మీకేమవుతారు? "

"బ్రహ్మానాయుడి తల్లి మాకు మేనత్త. బ్రహ్మానాయుడు చిన్ననాటి నుండి నాకు మంచి మిత్రుడు"

"అయితే మీకు బ్రహ్మానాయుడుగారు బాగా సన్నిహితులేగదా! వారిని గురించి, రాఘవేంద్రస్వామిగారిని గురించి పూర్తి వివరాలు తెలియజేయండి"

"అలా అడిగావు బాగుంది. పుట్టుపూర్వోత్తరాలతో సహా వారి కుటుంబాల కథ పూసగుచ్చినట్లు చెబుతాను. సావధానంగా విను.

"బ్రహ్మానాయుడి తండ్రి దశరథ నాయుడుగారు. ఆయన భార్య శాంతమ్మ నామమాత్రంగా చదువుకున్నారు.

"దశరథ నాయుడుగారు, రాఘవేంద్రస్వామిగారు అన్నదమ్ములు.

రాఘవేంద్రస్వామిగారి భార్య వైదేహిగారు. ఆ దంపతులిద్దరూ తెలుగు బాగా చదువుకున్నారు.

"అన్నదమ్ములిద్దరూ తండ్రి ఆస్తి యాభై ఎకరాలు చెరి ఇరవై అయిదు ఎకరాలు పంచుకొని విడిపోయారు.

"దశరథ నాయుడుగారు ఆజానుబాహుడు. శ్రమశీలి. వ్యవసాయంలో దిట్ట. ఓర్పు, నేర్పు గల ఇల్లాలు శాంతమ్మగారి సహకారంతో బాగా శ్రమ పడి పంటలు పండించి తనకు వాటాగా వచ్చిన ఇరవై అయిదు ఎకరాల పొలానికి తోడుగా మరొక పదిహేను ఎకరాల పొలం కొని నలభై ఎకరాల రైతు అయ్యాడు.

"దశరథనాయుడుగారికి ఇద్దరు మగ పిల్లలు కలిగారు. పెద్దవాడు బ్రహ్మానాయుడు, చిన్నవాడు శేషాద్రినాయుడు. ఇద్దరూ హైస్కూలు చదువు పూర్తి చేసి కాలేజీలో చేరారు. బ్రహ్మానాయుడు బి.ఎ ఫస్టు క్లాసులో పాసై తండ్రికి తోడుగా వ్యవసాయం పనులు చేస్తున్నాడు. అరక దున్నటంతో సహా అన్ని వ్యవసాయం పనులు నేర్చుకున్నాడు.

"శేషాద్రినాయుడు బి.ఎ చదువుతున్నాడు. ఇంతలో అనూహ్యంగా దశరథనాయుడుగారు గుండెపోటుతో మరణించాడు.

ఇక కుటుంబ బాధ్యత పూర్తిగా బ్రహ్మానాయుడిపై పడింది. తండ్రి ఉండగానే వ్యవసాయం పనుల్లో ఆరితేరిన బ్రహ్మానాయుడు తండ్రి మరణానంతరం కుటుంబ బాధ్యత పూర్తిగా తీసుకుని, పినతండ్రి రాఘవేంద్రస్వామి సహకారం, సలహాలతో తమ్ముడి చదువు పూర్తి చేయించాడు.

భర్త అకాలమరణంతో కుంగిపోతున్న తల్లి శాంతమ్మని కంటికి రెప్పలాగా కాపాడుతూ దిగులు పోగొట్టాడు.

రాఘవేంద్రస్వామికి సంతానంలేదు. అన్న మరణానంతరం ఆ కుటుంబానికి అండగా నిలిచి సహాయ సహకారాలు అందించాడు. ఆయన సతీమణి వైదేహి, శాంతమ్మని సొంత అక్కలాగా భావిస్తుంది. వారి అన్యోన్యత ఆదర్శవంతమైంది. బ్రహ్మానాయుడు, శేషాద్రినాయుడు ఇద్దరూ రామలక్ష్మణుల్లాగా కలసిమెలసి వుంటారు.

"సారథిబాబూ! నేనూ, బ్రహ్మానాయుడు గుంటూరు హిందూ కాలేజీలో ఒకేసారి బి.ఏ. స్పెషల్ తెలుగుతో పాసయ్యాం.

తరువాత నేను బి.యి.డి. చేసి తెలుగు పంతులుగా ఉద్యోగంలో చేరాను. బ్రహ్మానాయుడు వ్యవసాయరంగంలో ప్రవేశించి 'కర్షకబ్రహ్మ'గా ప్రసిద్ధి పొందాడు. అతడికి వ్యవసాయమే ఇష్టం. నేను ఉద్యోగంలో చేరుతుంటే బ్రహ్మానాయుడు నాతో 'ఏరా మురళీ! బడిపంతులు ఉద్యోగం చెయ్యకపోతే బతకలేవా? ఇరవై ఎకరాల పొలం నీకుందిగా. అది పండించుకుంటే నీకు గడవదా?' అన్నాడు. అయినా నేను ఉద్యోగంలోనే చేరాను. పొలం కౌలుకిచ్చాను."

"మీరిద్దరూ మంచి మార్గాలే ఎంచుకున్నారు. ఈ రంగం మీకిష్టం. ఆ రంగం ఆయనకిష్టం. మీరు జ్ఞానదాత. ఆయన అన్నదాత"

"ఇక బ్రహ్మానాయుడి పెళ్లి కథ చెబుతా విను సారథిబాబూ"అంటూ చెప్పసాగాడు మురళీకృష్ణ.

"చదువు, చక్కదనం, సత్ప్రవర్తన వున్న బ్రహ్మానాయుడికి పెళ్లి చేయాలని శాంతమ్మ, రాఘవేంద్రస్వామి ఆలోచిస్తున్నారు. మా పినతండ్రికి నాగరాణి అని కూతురుంది. బ్రహ్మానాయుడికి మేనమామ కూతురే అవుతుందిగా. నేను ఆమెని చెల్లెల్లా భావిస్తాను. నాకు సొంత చెల్లెళ్లు, అక్కలు లేరు.

బ్రహ్మానాయుడు నాగరాణిని చేసుకోవడం నాకు చాలా ఇష్టం. శాంతమ్మగారిక్కూడా తన మేనకోడలు నాగరాణిని కొడుక్కి చేసుకోవాలని బాగా వుంది. రాఘవేంద్ర, వైదేహి గార్లకీ ఇష్టమే.

నాగరాణి గుంటూరు ఉమెన్స్ కాలేజీలో స్పెషల్ తెలుగుతో బి.ఏ. పాసైంది. మాకందరికీ తెలుగే ఇష్టం సారథిబాబూ!

"తల్లిదండ్రులకు నాగరాణి ఒక్కతే కూతురు. మగపిల్లలు లేరు. తల్లి తరఫు నుండి వచ్చిన ఆస్తితో కలిపి వారికి ఏభై ఎకరాల పొలం వుంది. అందమైన డాబావుంది. ఆస్తికంతటికి నాగరాణి వారసురాలు.

"సౌందర్యం, సంపద, చదువు వున్న నాగరాణికి బ్రహ్మానాయుణ్ణి చేసుకోవాలని బాగా వుంది. కాలేజీలో తన క్లాస్‌మేట్ అమ్మాయిలకి బ్రహ్మానాయుణ్ణి చూపించి, తనకు మేనత్త కొడుకని, కాబోయే భర్తనీ చెప్పిందట. అది బ్రహ్మానాయుడికి తెలియదు.

"అలా అందరికీ ఇష్టమైన ఈ సంబంధాన్ని అనూహ్యంగా బ్రహ్మానాయుడు కాదన్నాడు. ఉండూరు సంబంధం, అందునా మేనరికం, తనకిష్టంలేదని ఖండితంగా చెప్పాడు. అది విని అందరం తెల్లబోయాం.

"అందం, ఆస్తి, చదువు, సంస్కారం అన్నీ వున్న తనని కాదన్నందుకు నాగరాణి ఆగ్రహించింది. బ్రహ్మానాయుడుపట్ల ద్వేషం పెంచుకుంది. అప్పటినుండీ బ్రహ్మానాయుడికి బద్ధ శత్రువుగా మారింది"

"మీ చెల్లెలి సంబంధం కాదన్నందుకు బ్రహ్మానాయుడిగారి మీద మీకు కోపం రాలేదా?"

"నాకు కోపం రాలేదు. మా మైత్రి విచ్చిన్నమూ కాలేదు. ఇద్దరికీ ఇష్టమున్నప్పుడే వివాహం జరగడం సమంజసం. మేనరికం ఇష్టంలేదనడం బ్రహ్మానాయుడి తప్పు కాదు. కొందరికి ఇష్టం వుండదు"

"మీరన్నది నిజం. నా అభిప్రాయం కూడా అదే. తరువాతేమైందో చెప్పండి బాపూజీ"

"మేం గుంటూరులో బి.ఏ. చదివేటప్పుడు బ్రహ్మానాయుడికి కాలేజీలో ముగ్గురు ముఖ్య మిత్రులుండేవారు. వివేకానంద, దయాసాగర్, ధర్మపాల అనేవాళ్లు బ్రహ్మానాయుడికి ప్రాణమిత్రులు. నలుగురిదీ ఒకే మాట, ఒకేబాట.

"నలుగురిలో దయాసాగర్ ధనవంతుడు. తెనాలిలో రైసుమిల్లు వుంది. బట్టలషాపు వుంది. అందమైన మేడ వుంది. నలభై ఎకరాల మాగాణి వుంది. వివేకానంద తెనాలిలో ఐతానగర్ నివాసి. ధర్మపాల గుంటూరు వాస్తవ్యుడు. మిత్రులు నలు

గురూ దయాసాగర్ కార్లో గుంటూరునుండి తెనాలికి వస్తూపోతూ వుండేవాళ్లు. నేనూ అప్పుడప్పుడూ వారితో కలిసి వెళ్లేవాణ్ణి.

"భారతీదేవి వివేకానందకి పినతండ్రి కూతురు. తల్లి అనసూయ, తండ్రి వాసుదేవరావు. వారికి భారతీదేవి ఒక్కతే కూతురు. మగపిల్లలు లేరు. అయిదెకరాల మాగాణి వుంది. వివేకానంద ఇంటిపక్కనే వాళ్ల ఇల్లు. వివేకానంద ద్వారా బ్రహ్మనాయుడికి ఆ కుటుంబంతో పరిచయం అయింది. భారతీదేవి ఇంటర్‌మీడియట్ వరకు చదివింది.

సంపన్న కుటుంబం కాకపోయినా, సౌందర్యం, సంస్కారం, వినయం, వివేకం వున్న భారతీదేవి బ్రహ్మనాయుడికి నచ్చింది.

వివేకానంద ద్వారా ఆ సంబంధం బ్రహ్మనాయుడికి కుదిరింది. ఉభయుల పెద్దల ఆమోదంతో భారతీదేవికి, బ్రహ్మనాయుడికీ వివాహం జరిగింది. ఈడూజోడూ కుదిరిన ఆ అందాలజంటని బంధుమిత్రులందరూ అభినందించారు.

వివాహానంతరం బ్రహ్మనాయుడు అత్తవారింట్లో నెలరోజులు వున్నాడు. ఆ సమయంలో మిత్రుడు దయాసాగర్ తన కారుని, డ్రైవర్ని ఇచ్చి ఆ నవదంపతుల్ని విహారయాత్రకు ప్రోత్సహించి పంపాడు.

దంపతులిద్దరూ కారులో అమరావతి, నాగార్జునుడి కొండ, పలనాటిసీమ తిరిగి చూసివచ్చారు.

తర్వాత భారతీదేవితో కలిసి వీరవరం వచ్చాడు. అది తెలిసి నేనే వారింటికి వెళ్లాను. భారతీదేవికి నేను పెళ్లికిముందే తెలుసుగనుక నన్ను స్వంత అన్నలాగే 'అన్నయ్యా, రండి' అని ఆహ్వానించింది. బ్రహ్మనాయుడు యాత్రా విశేషాలు చెప్పాడు.

ఆ నవదంపతులు ముందుగా అనుకున్నట్లే కారులో అమరావతి చేరారు. అక్కడొక వసతిగృహం అద్దెకు తీసుకున్నారు.

మునేరు అనే ఉపనది కృష్ణానదిలో సంగమించిన ప్రదేశానికి ఎదురుగా, దక్షిణపు ఒడ్డున అమరలింగేశ్వరాలయం వుంది. అందువల్ల ఆ శైవక్షేత్రానికి 'అమరావతి' అనే పేరొచ్చిందని నీకూ తెలుసుగా సారధి బాబూ!

సహ్యా పర్వతాలలో పుట్టి, ఆంధ్రావనిని మెట్టి ప్రాగ్దిశాముఖంగా ప్రవహించే పవిత్ర జీవనదిగా కృష్ణానది ప్రసిద్ధి పొందింది. ఆ నదిలో స్నానం చేద్దామని భారతీదేవి భర్తని కోరింది.

కారులో కృష్ణానది స్నానాలరేవు దగ్గరికి వచ్చారు. అక్కడ కొందరు స్త్రీలు వున్నారు. అమరావతి పక్కనేవున్న ధరణికోటలో పడవలు నడిపే రాజుల కుటుంబాలు కొన్ని వున్నాయి. మహాభారత కథలోని దాశరాజు మా కులం వాడేనని వాళ్లు చెప్పుకుంటారు. ఆ రాజుల కుటుంబాల స్త్రీలే స్నానాల రేవు దగ్గర వున్నారు.

కార్లో స్నానాల రేవుదగ్గరకు వచ్చింది నవదంపతులని వాళ్లు గ్రహించారు. భారతీదేవి నదిలో దిగటానికి భయపడటం వాళ్లు గమనించారు.

"అమ్మా! మేం నీ చుట్టూ వుంటాం. మాకందరికీ ఈదటం వచ్చు నువ్వేం భయపడొద్దు..." అని ఆ మహిళలు భారతీదేవిని నీళ్లలో దింపారు. ఆవిడ ఆనందంగా స్నానం చేసింది.

స్నానం చేస్తున్నంతసేపూ ఆ మహిళల సరస సల్లాపాలు భారతీదేవికి వినోదం కల్గించాయి.

బ్రహ్మనాయుడు గజయీతగాడు. స్నానం సరదాగా చేశాడు.

భారతీదేవి తనకు సహాయంగా నిలిచి స్నానం చేయించిన మహిళలకు కృతజ్ఞత చెప్పింది. బ్రహ్మనాయుడు వాళ్లకి డబ్బులివ్వబోయాడు.

"సరిసరి. మాకెందుకండీ డబ్బులు?

సాటి స్త్రీకి సహాయం అందించి సరదాగా స్నానం చేయించాం. అందులో మాకూ ఆనందం వుంది" అన్నారు మహిళలు.

వాళ్ల సహృదయతని ఆ కొత్త దంపతులు మెచ్చుకున్నారు.

అక్కడినుండి భారతీదేవి, బ్రహ్మానాయుడు ఆలయానికి వచ్చారు. అప్పుడక్కడ షామియానాకింద ఒక పెళ్లి జరుగుతోంది. ఆ వధూవరులిద్దరూ మేలిమిబంగారు మేని ఛాయతో మెరిసిపోతూ సాటిలేని సౌంద ర్యంతో వున్నారు. పెళ్లి పూర్తికావచ్చింది.

లేత పసుపురంగు పట్టుచీరెతో పెళ్లికూతురు ధివినుండి భువికి దిగివచ్చిన దేవకన్యలా వుంది. పెళ్లికొడుకు కూడా వధువుకు దీటైన అందగాడే. పెళ్లి చూట్టానికి వచ్చిన అమరావతి యాత్రీకులు ఆ జంటను చూసి ఆహా, ఎంత అందంగా వున్నారు అనుకున్నారు.

భారతీదేవి బ్రహ్మానాయుడు కూడా ఆ జంటని మెచ్చుకున్నారు.

"ఆ పెళ్లికూతుర్ని చూడండి. కుందనపు బొమ్మలా ఎంత అందంగా వుందో" అంది భారతీదేవి బ్రహ్మానాయుడితో

"పెళ్లికొడుకు మాత్రం అందంగాలేడూ? సుభద్ర సరసన అర్జునుడిలాగున్నాడు. నువ్వు అమ్మాయినే మెచ్చుకున్నావు" అన్నాడు చిరునవ్వుతో.

"ఆయనా చక్కనివాడే. అయితే అమ్మాయి పసుపుపచ్చరంగు తలంబ్రాల చీరె కట్టుకునివుంది కనుక ఆ రంగుతో శరీర రంగు జతకలిసి కుందనపుబొమ్మలా వుంది. ఇంత అందమైన జంటని నేనెక్కడా చూడలేదండీ"

"అవును భారతీ. మనం ఈ పెళ్లి చూడడానికేనేమో ఈరోజు ఇక్కడికొచ్చాం. మనం ఈ అందాల జంటని ఊరికే మెచ్చుకోవడం కాదు భారతీ. ఏదైనా బహుమతి ఇస్తే బాగుంటుంది"

"ఎంత మంచిగా ఆలోచించారు మీరు. అలాగే, నా సూట్ కేసులో కొత్తచీరుంది. పసుపు కుంకుమతో అది ఇద్దాం."

"భారతీ! దానికితోడు ఈ నూర్రూపాయలు కూడా కలిపి ఇవ్వు" అని నోటు అందించాడు.

"చాలా సంతోషం" అని నోటు అందుకొని కారులో వున్న సూట్ కేసులో నుండి కొత్తచీరె తీసింది. పసుపు కుంకుమలతో వచ్చింది. మీరూ నాతో రండి" అంది. ఇద్దరూ వధూవరుల దగ్గరికొచ్చారు.

నవయౌవనంలో వున్న ఈ దంపతులు వధూవరుల దగ్గరికి వస్తుంటే చుట్టూ వున్న బంధువులు వింతగా చూస్తున్నారు. పురోహితుడి అనుమతి తీసుకుని భారతీదేవి పెళ్లికూతురికి బొట్టు పెట్టి చీరె, నూరు రూపాయల నోటు ఒడిలో పెట్టింది. వధూవరుల శిరస్సుల్లపై అక్షతలు వేసింది. బ్రహ్మానాయుడు కూడా వధూవరుల శిరస్సులపై అక్షతలు వేశాడు.

పెళ్లికూతురు తలెత్తి ఆ నవదంపతుల వైపు ఆశ్చర్యంగా చూసింది. పెళ్లికొడుకూ అలాగే చూశాడు. ఆ ఇద్దరికీ ఈ ఇద్దరెవరో తెలియడంలేదు. అక్షతలు వేసి ఇవతలికి వస్తుంటే పురోహితుడు "అయ్యా, తమరు ఈ వధూవరులకు ఏమవుతారు? తమరి పేర్లు చెప్పండి" అన్నాడు.

"పేర్లెందుకులెండి. యాత్రకు వచ్చిన శ్రేయోభిలాషులు అనండి. వధూవరుల ఈడూజోడూ, అందచందాలూ చూసి మెచ్చి ఇచ్చిన బహుమతి అది" అన్నాడు బ్రహ్మానాయుడు.

"ముక్కూమొహం తెలియని కొత్తవాళ్లయినా చక్కగా పెళ్లి చూసి సంతోషించి బహుమతి ఇచ్చి అక్షతలు వేశారు. పెళ్లికూతురు తల్లి విచారించగా 'అభిమానంతో వచ్చి, బహుమతి ఇచ్చి, అక్షతలు వేసిన వాళ్లే పెళ్లికూతురికి పెద్దన్న, పెద్ద వదిన అనుకో. రానివాడితో మనకెందుకు?' అన్నాడు పెళ్లికూతురి తండ్రి.

ఆ మాటలు వింటూ భారతీదేవి, బ్రహ్మ నాయుడు కారు దగ్గరికి వచ్చి కారులో కూర్చొని వసతి గృహంవైపు బయలుదే రారు.

ఇంతలో పెళ్లికూతురి పెద్దన్న ఒక లారీలో, బాణాకర్రలతో వున్న ఒక ముఠాతో అక్కడికొచ్చి లారీ ఆపి దిగాడు.

అప్పటికే పెళ్లి పూర్తయింది. పెళ్లివారు, వధూవరులు, ప్రయాణ సన్నాహాలతో సవా రిబళ్ల దగ్గరికి వచ్చారు. పెళ్లివారందరూ అమరావతికి సవారిబళ్లలోనే వచ్చారు.

ఆలశ్యంగా వచ్చి లారీదిగిన పెళ్లికూతురు పెద్దన్న పెళ్లి పూర్తయి పెళ్లి బట్టలతో తిరుగు ప్రయాణానికి సిద్ధంగావున్న వధూ వరుల్ని చూసి తెల్లబోయాడు. కోపంతో కనుబొమలు ముడివడినాయి. బాణాకర్ర లతో వున్న ముఠా లారీనుండి దిగి అతని వెనుక నిలిచి వుంది. పరిసరాలు కలయ జూశాడు.

వసతిగృహంవైపు బయలుదేరిన బ్రహ్మనా యుడు, భారతీదేవి లారీని, ముఠాని చూసి, కారు ఆపి దిగారు. పెళ్లి ఆపటానికే పెద్దన్న వచ్చాడని వారికి అర్థమైంది. ఏం జరుగు తుందోనని కారుపక్కనే నిలిచి ఆసక్తిగా చూస్తున్నారు.

పెద్దన్న పెళ్లిని అడ్డుకుంటాడని ముందే తెలుసేమో. పెళ్లికొడుకు తరపున, పెళ్లికూ తురు తరపున సాముగరిడీలలో కాకలు తీరిన యువ కర్షకబృందం సవారిబళ్లలో బాణాకర్రలు పట్టి నిలిచారు. వారు పెద్ద న్నకి తెలుసు. వారిలో పెళ్ళికూతురు చిన్నన్న కూడా వున్నాడు. పెద్దన్నతో యుద్ధానికి సిద్ధంగా వున్నాడు. ప్రత్యర్థుల శక్తి పెద్దన్నకి తెలుసు.

"రా తమ్ముడూ! వధూవరుల్ని ఆశీర్వదిం చరా! సమయానికి వచ్చావుగా" అని అన్న వరసయిన ఒక బంధువు పిలిచాడు.

"ఉన్న వూళ్లో యింటిముందు పెళ్లి చేయించే ధైర్యంలేక గుట్టుగా అమరావతి వచ్చి గుడిలో పెళ్లి చేయించి రా తమ్ముడూ అని ఎగతాళి చేస్తున్నావా? " ఆగ్రహం దిగ మింగుతూ అన్నాడు.

"అందుకు కారణం నువ్వేరా తమ్ముడూ. ఇంట్లో రభసకావడం మీ నాన్నకి ఇష్టం లేదు. ఆ పెద్దమనిషి బాధపడతాడని, ఇంటి కంటె గుడి ప్రశాంతం అని ఇక్కడికి వచ్చాం. ధైర్యం, శక్తి లేక కాదు. అది నీకూ తెలుసు"

"అమ్మాయీ! నిన్ను లక్షల ఆస్తికి రాణిని చేద్దామనుకున్నానే. సిరిసంపదలతో తుల తూగాల్సిన దానివి నేను తెచ్చిన సంబం ధాన్ని చేజేతులా జారవిడుచుకున్నావుగదే వీళ్ల మాయలోపడి. పెద్దన్ననన్న గౌరవం లేకుండా నన్ను కాదని నీకోసం శ్రమపడిన నన్ను ధిక్కరించి పెళ్లి చేసుకున్నావు"

అప్పటి వరకు మౌనంగావున్న పెళ్లికూ తురు అప్పుడు గొంతువిప్పి "ఆ అనాకారి ధనవంతుడికి నన్ను అంటగట్టి వాళ్ల వ్యాపా రాల్లో వాటాదారుడివై లక్షలు సంపాదించా లని చూశావు. ఆ అవకాశం చేజారిందని దిగులుపడుతున్నావు. నువ్వా ఒక అన్న వేనా? సిగ్గులేకుండా చెల్లెలి మంచి కోరానని చెప్పుకుంటున్నావా? పెళ్లి గురించి నాతో చెప్పావా? చెల్లెలి మనసు తెలుసుకు న్నావా? ఒక అనాకారికి నా అందాన్ని అమ్ముకుందామని అనుకున్నావు" అంది ఆవేశంతో.

పెళ్లికొడుకు చిరునవ్వుతో ఆ మాటలు వింటున్నాడు.

"విన్నావుగా తమ్ముడూ, ఇంటిముందు పెళ్లిచేసే ధైర్యం మాకు లేదన్నావే. చెల్లెలికి జవాబు చెప్పే అర్హత నీకుందా? "

"మన వంశానికి అఖండకీర్తిని ఆర్జించిపె ట్టిన వెంకటాద్రినాయుడు పాలించిన నేలరా ఇది. అలాంటి వంశంలో పుట్టి ఇంటి ఆడ పడుచును ఒక అనాకారికి అంటగట్టి, అత నికి అమ్ముడుపోతావా తమ్ముడూ?

చెల్లెలితో ఆ మాట అనిపించుకున్నావే

## సచిత్ర విచిత్రం



# ఏడుపుల పోటీ

జపాన్‌లో తల్లిదండ్రులు తమ చిన్నారులు ఏడవడం విని ఎంతో సంతోషిస్తారు. గుక్కపట్టి పిల్లలు ఏడవడం అనేది వారు ఆరోగ్యవంతంగా ఉన్నారనేదానికి సూచనగా వారు భావిస్తారు. జపాన్‌లో ప్రతిసంవత్సరం పిల్లల ఏడ్పుల పోటీలు జరుగుతాయి. అతి బిగ్గరగా గొంతెత్తి ఏడ్చిన పిల్లలకు బహుమతులు ఇవ్వడం జరుగుతుంది. 6 నెలలు, 3 సంవత్సరాలు మధ్య వయసుగల పిల్లలు ఈ పోటీకి అర్హులు.

బౌద్ధారామానికి చెందిన ఇరువురు పూజారులు చెరొక శిశువును ఎత్తి పట్టుకుని, వారు గుక్కపట్టి ఏడ్చేలా చేస్తారు. పిల్లల తల్లిదండ్రులకు తమ పిల్లలు ఆరోగ్యంగా పెరుగుతున్నారనే విశ్వాసం అందించడం కోసం సాధ్యమైనంతవరకూ ఎక్కువ మంది పిల్లలకు బహుమతులు ఇస్తూ ఉంటారు నిర్వాహకులు,

సిగ్గులేదూ? పైగా బాణాకర్రలతో ఒక గూండా ముఠాని వెంటబెట్టుకొస్తావా?

నిన్ను, నీ ముఠాని నిమిషాలలో నేలకూల్చగల సత్తా మన వాళ్లకుంది. అది గమనించే వుంటావు. కాలికి బుద్ధిచెప్పి ఒళ్లు కాపాడుకోరా" అన్నాడు ఆ పెళ్లిపెద్ద.

"ఏం పెదబావా! కాలికి బుద్ధిచెప్తావా, మా కర్రలకు పని కల్పిస్తావా? " అన్నాడు మరొక బంధువు.

ఇంకా వాదనకి దిగితే ప్రమాదమని పెద్దన్న గ్రహించాడు. మళ్లీ నోరు విప్పకుండా తన ముఠాతో లారీ ఎక్కి తిరిగి చూడకుండా వెళ్లిపోయాడు. భారతీదేవి, బ్రహ్మనాయుడు కారు దగ్గర నిలబడి ఆ వాదోపవాదాలన్నీ విన్నారు. పెళ్లికూతురు పెద్దన్న నోరు మూసుకుని జారుకోవటం చూసి నవ్వుకున్నారు.

పెళ్లికూతురు సవారిబండి ఎక్కబోతూ, కారు దగ్గరున్న భారతీదేవిని, బ్రహ్మనాయుణ్ణి చూసింది. వారి దగ్గరకు వచ్చి చేతులు జోడించి నమస్కారాలు చేసి సెలవు తీసుకుంది. పెళ్లికొడుక్కూడా అలాగే వారికి నమస్కారాలు చేసి సెలవు తీసుకున్నాడు. భారతీదేవి అనునయంగా పెళ్లికూతురి చేయి పట్టుకుని నాలుగడుగులు వెంట నడిచి వీడ్కోలు చెప్పింది. వధూవరులు బండి ఎక్కారు.

విజయోత్సాహంతో పెళ్లి బళ్లు వెళ్లిపోయాయి.

భారతీదేవి, బ్రహ్మనాయుడు అక్కడినుండి వసతి గృహానికి వచ్చారు. "పెళ్లికూతురు తెలివైందేనండీ. అన్నని బాగా చివాట్లు పెట్టి నోరెత్తకుండా చేసింది." అందావిడ.

"అవును భారతీ! వాళ్ల సంభాషణల్నిబట్టి నేనూ అదే అనుకున్నాను. ఆ అమ్మాయి నీకు అమరావతి ఆడపడుచు." అన్నాడు నవ్వుతూ.

"ముందు మీకు అమరావతి చెల్లెలు. తరువాత నాకు అమరావతి ఆడపడుచు. బండి ఎక్కబోతూ మనని గుర్తుపెట్టుకుని మన దగ్గరకొచ్చి వందనాలు చేసి సెలవు తీసుకుంది. పెళ్లికొడుకూ అంతే చేశాడు. ఈ పెళ్లి దృశ్యం మనకు కలకాలం గుర్తుంటుందండీ"

"అవును భారతీ, ఇది మనకు మరపురాని అనుభూతి. వాళ్ల ఊరూపేర్లూ తెలియకపోయినా నువ్వన్నట్లు మనుషులు మాత్రం కలకాలం గుర్తుంటారు"

"వాళ్ల వివరాలు తెలుసుకుంటే బాగుండేదేమోనండీ"

"ఆ అవసరం లేదులే భారతీ. మన వివరాలు కూడా వాళ్లకు తెలియవుకదా. పురోహితుడు అడిగినా మనం చెప్పలేదుకదా. మనం మన సంతోషంకొద్దీ ఏదో చేశాం, అంతే"

"మీరన్నదీ నిజమే. మనం ఇక్కడినుండి నాగార్జునసాగర్ వెళ్లి చూసి తర్వాత పలనాటిసీమకు వెళ్దాం. ఆ సీమలో చూడదగినవి చూద్దాం"

ఆ రాత్రి అక్కడుండి మర్నాడు పల్నాడు సీమకు వచ్చారు.

కారెమపూడి రణక్షేత్రం, గురజాల, మాచెర్ల సందర్శించారు.

'బాలచంద్రుని కదన కౌశలము కథలల్లి
శ్రీనాథ కవిరాజు చంద్రవంకకు చెప్ప
ఎదకరిగి ప్రవహించెరా! పలనాట-ఎత్తిపోతల దూకెరా'

అని ఒక కవి వర్ణించిన ఎత్తిపోతల జలపాతాన్ని చూశారు. పల్నాటి బ్రహ్మనాయుడి సర్వమానవ సమానతని చాటి చెప్తూ ఏర్పాటు చేసిన చాపకూడు పద్ధతి, మాలకన్నమదాసును ప్రథమ పుత్రుడిగా స్వీకరించిన సంగతి, బ్రహ్మనాయుడి సంస్కార భావాల కథలు పల్నాటి సామాన్య ప్రజల నోట ఆ దంపతులు విన్నారు.

పల్నాటి బ్రహ్మనాయుడి సమతా దృష్టి వీరవరం బ్రహ్మనాయుణ్ణి అమితంగా ఆక

ర్శించింది. అదే సదానందాన్ని చేరదీసి ఆదరించడానికి కారణమైంది. అలా బ్రహ్మానాయుడు, భారతీదేవి విహారయాత్ర చేసి వీరవరం తిరిగి వచ్చారు.

"ఆ కొత్త దంపతుల్ని పరామర్శించడానికి నేను వారింటికి వెళ్లాను. ఇష్టాగోష్టిలో బ్రహ్మానాయుడు ఈ అమరావతి పెళ్లికథ చెప్పాడు. ఇది ఇరవై ఐదేళ్లనాడు జరిగింది"

"బాపూజీ, మీరు చెప్పిన ఈ అమరావతి పెళ్లికథ మా తాతయ్య నాకు చెప్పాడు. కాని తాతయ్య చెప్పిన కథలో బ్రహ్మానాయుడిగారి సంగతి లేదు. పెళ్లివారి ఊరు, పేర్లు అన్నీ మా తాతయ్యకి తెలుసు. ముఖ్య బంధువుగా ఆ పెళ్లి దగ్గర మా తాతయ్య వున్నాడు"

"అయితే వారి ఊరూ పేరూ వివరాలు నువ్వు చెప్పు సారధి బాబూ"

"సరే. మీరు చెప్పింది ఉత్తరభాగం. నేను పూర్వభాగం చెప్తాను, వినండి...

పెళ్లికూతురి పేరు రత్నప్రభ. పెళ్లికొడుకు ప్రభాకరరావు. రత్నప్రభ తండ్రి అమరయ్య. తల్లి గంగాభవాని. వారిది అంధకపురం అనే ఊరు. ఆ దంపతుల పెద్దకొడుకు రాజారావు. పెళ్లికి అడ్డు తగలాలని వచ్చిన పెద్దన్న ఆ రాజారావే. చిన్నకొడుకు రమణారావు. ఆ ఇద్దరికి చెల్లెలు రత్నప్రభ.

రాజారావుకు ధనరాజు అనే స్నేహితుడున్నాడు. అతడు రాజారావుకు క్లాస్‌మేట్. బి.ఏ. చదివాడు. ధనరాజుది సత్తెనపల్లి పట్టణం. శేషయ్య అనే కోటీశ్వరుడికి ధనరాజు ఒక్కడే కొడుకు. అనాకారి. సంపద వున్నా ధనరాజుకి రూపసంపద లేదు. శేషయ్యకు . అదే దిగులు. ఆయనకు సత్తెనపల్లిలో రైసుమిల్లుంది బంగారునగల షాపుంది. మేడుంది. ఏభై ఎకరాల పొలముంది. కారుంది. అన్నీ వున్న శేషయ్య కొడుకు అందవిహీనుడిగా జన్మించాడు.

"డబ్బుకు లోకం దాసోహం" అన్నట్లుగా రాజారావు ధనరాజుతో కలిసి తిరుగుతూ వుండేవాడు. ధనరాజు రాజారావుతో కలిసి అంధకపురం కూడా వస్తూపోతూ వుండేవాడు. రాజారావుకు అందమైన చెల్లెలు వుందని ధనరాజు తండ్రితో చెప్పాడు.

మాటల్లో, తెలివితేటల్లో శేషయ్య అఖండుడు. తనకు సంపద తరగనంత వుంది. ఈ ఇంటికి రత్నంలాంటి రత్నప్రభని కోడలుగా తెచ్చుకుంటే రూపసంపదలేని తన కొడుక్కి రూపసంపద వున్న సంతానం కలగవచ్చు. అప్పుడు ఈ ఇంటికి లక్ష్మీకళ వస్తుందని ఆలోచించాడు.

ఆశాపరుడైన రాజారావుకు రైసుమిల్లులో వాటా ఇస్తానని ఎర వేశాడు. ఎలాగైనా రత్నప్రభని తన ఇంటికోడల్ని చెయ్యమన్నాడు. అందుకు ఎటువంటి సాయం కావాలన్నా అందిస్తాను అన్నాడు.

శేషయ్యకి రాజారావు తన చెల్లెల్ని మీ ఇంటికోడల్ని చేస్తానని వాగ్దానం చేశాడు.

అప్పటికే రత్నప్రభకి మరో సంబంధం కుదురుతూవుంది. పక్కవూరి ప్రభాకరరావుకి అంధకపురంలో బంధువులున్నారు. వారి ద్వారా చర్చలు జరిగాయి. ఆ వూరికి పరిచితుడైన ప్రభాకరరావు రత్నప్రభకి కూడా తెలిసినవాడే. అంధకపురం కర్షక యువకులు ప్రభాకరరావుకు మిత్రులు.

మంచిగుణం, పనితనం, చక్కదనం వున్న ప్రభాకరరావు రత్నప్రభ తల్లిదండ్రులకి, చిన్నన్న రమణారావుకి బాగా నచ్చాడు. ఉభయుల పెద్దల ద్వారా ఆ సంబంధం కుదిరింది.

అది తెలిసిన రాజారావు ఆ సంబంధానికి గట్టిగా అడ్డు తగిలాడు. తండ్రి అమరయ్యకి పెద్ద కొడుకంటే అమితమైన ప్రేమ... అది ఆసరాగా తీసుకొని రాజారావు రత్నప్రభని ధనరాజుకే ఇవ్వాలని పట్టుబట్టాడు. ప్రభాకరరావుతో పెండ్లి జరగనివ్వనని శపథం చేశాడు.

అమరయ్య పరిస్థితి అయోమయం అయింది. పెద్ద కొడుకును కాదనలేడు.

ప్రభాకరరావు సంబంధం వదులుకోలేదు.

ఆ దశలో చిన్నన్న రమణారావు, అంధకపురం కర్షకయువకులు రత్నప్రభకి ప్రభాకరరావుతో పెండ్లి జరిపించడానికి కంకణం కట్టుకున్నారు.

రాజారావు కన్నుగప్పి, అమరావతిలో పెండ్లి జరిపించటానికి ఏర్పాట్లు చేశారు. తండ్రి అమరయ్యకి నచ్చజెప్పి ఒప్పించారు. అమరావతికి తీసుకువచ్చారు. అందరూ రక్షణగా నిలిచి పెండ్లి జరిపించారు. ఆపైన కథ మీరు చెప్పిండే బాపూజీ!"

"సారధి బాబూ! మీ తాతయ్య నీకు చెప్పిన అమరావతి పెండ్లి కథ పూర్వభాగం కూడా చాలా బాగుంది. రత్నప్రభ తల్లిదండ్రులు, చిన్నన్న సంపదకి ఆశపడకుండా చక్కదనానికీ, గుణానికీ, ఈడూ, జోడుకే ప్రాధాన్యం ఇచ్చారు. అది మెచ్చుకోదగ్గ విషయం.

మన బ్రహ్మానాయుడు కూడా నాగరాణికి వున్న సంపదకి ఆశపడలేదు. ఉండూరు సంబంధం, మేనరికం వద్దనుకున్నాడు. ఆదర్శంగా భారతీదేవిని చేసుకున్నాడు. ఆ తరవాత జరిగింది కూడా చెబుతాను విను!

భారతీదేవి అత్తవారింటికి వచ్చి బాధ్యతగా విధులు నిర్వహిస్తూ, అత్త శాంతమ్మగారిని వినయవిధేయతలతో గౌరవిస్తూ, అచిరకాలంలోనే అందరి మన్నన పొందింది.

అన్యోన్యంగా, ఆనందంగా, భారతీదేవి, బ్రహ్మానాయుడు జీవితయాత్ర సాగించారు. వారికి అందాలరాశి అనూరాధ జన్మించింది.

శేషాద్రినాయుడికి కూడా పెండ్లి చేయాలని తలపెట్టారు.

భారతీదేవి పినతండ్రి కేశవరావు. ఆయన భార్య కమలాంబ. వారికి రమాదేవి అనే కూతురు వుంది. రమాదేవి పుట్టిన తరువాత పదిహేను సంవత్సరాలకు ఆ దంపతులకు ఒక కొడుకు పుట్టాడు. అతడి పేరు భూపాలరావు.

రమాదేవి రూపవతి, గుణవతి. భారతీదేవి కోరికపై రమాదేవిని శేషాద్రినాయుడికి చేసుకున్నారు.

అన్న, తమ్ముల కుమార్తెలిద్దరూ ఒకే వూళ్లో ఒకరికొకరు తోడుగా వుంటారని ఉభయుల పెద్దలూ ఆలోచించి పెళ్లి జరిపించారు.

వెయ్యేండ్లున్నా వేరు దప్పదు అన్నారు పెద్దలు.

అన్నదమ్ములిద్దరూ వేరుబడి కాపురాలు పెట్టటం మంచిదని పినతండ్రి రాఘవేంద్ర స్వామిగారు, ఆయన సతీమణి వైదేహిగారు సలహా చెప్పారు. కాపురాలు వేరుగా వుంటేనే అన్నదమ్ముల మధ్య ఐక్యత బలంగా వుంటుందని శాంతమ్మగారికి వారు నచ్చజెప్పారు.

అన్నదమ్ములిద్దరూ చెరి ఇరవై ఎకరాలు పంచుకొని విడిపోయారు.

తరువాత శేషాద్రినాయుడికి ఇద్దరు మగపిల్లలు పుట్టారు.

పెద్దవాడి పేరు గణపతి, చిన్నవాడి పేరు కుమార్.

కాలక్రమంలో బ్రహ్మానాయుడికి బాగా కలిసి వచ్చింది. వ్యవసాయం బాగా చేశాడు. ఉన్న పొలానికి ముందుచూపుతో నీటివనరులు సమకూర్చుకున్నాడు. బావులు తవ్వించుకున్నాడు. అతివృష్టి, అనావృష్టి పరిస్థితుల్ని అధిగమించి, పంటలలో అధిక దిగుబడులు సాధించాడు. బావులలోని నీటి వనరులతో ప్రకృతిని తనకు అనుకూలంగా మలచుకున్న కర్షకమేధావి బ్రహ్మానాయుడు. తన వాటాగా వచ్చిన ఇరవై ఎకరాలకు తోడుగా మరొక ఇరవై ఎకరాలు పొలంకొని నలభై ఎకరాల రైతు అయ్యాడు.

తన వాటాగా పంచుకున్న ఇల్లు పూర్తిగా తమ్ముడికే వదిలివేశాడు.

వేరుగా మరొకచోట విశాలమైన స్థలం కొని, ఆ స్థలంలో అన్ని వసతులతో తమ నివాసంకోసం అందమైన డాబా నిర్మించుకు

న్నాడు.

దానికి కొంచెం ఎడంగా విశాలమైన ఆవరణలో ఒక పరిశ్రమ లాంటి తన వ్యవసాయానికి అనువుగా పశువులకోసం, పంటలు నిల్వజేయటంకోసం, పాలేరులుగా వుండే వాళ్ల నివాసంకోసం వేర్వేరుగా షెడ్లు నిర్మించుకున్నాడు.

అలా కాలక్రమంలో అన్ని వసరులూ సమకూర్చుకొన్నాడు. అసాధారణ వ్యవసాయ కౌశల్యంతో పంటలు పండించి ఆర్థిక స్థోమతు పెంచుకున్నాడు. వీరవరంలో ఇతర రైతులకు ఆదర్శంగా నిలిచాడు.

బ్రహ్మానాయుడు 'కర్షకబ్రహ్మ' అని ప్రశంసలు అందుకున్నాడు.

శాంతమ్మగారు పాత ఇంట్లోనే చిన్నకొడుకు దగ్గరే వుంటున్నది. భర్తతో కలిసి జీవితం గడిపిన పాత ఇంట్లోనే శేషజీవితం గడపాలని శాంతమ్మగారి కోరిక. ఆమె ఎక్కడున్నా ఇద్దరు కోడళ్లూ ఆమెను దేవతలాగా పూజిస్తూ సేవలు చేస్తున్నారు.

శేషాద్రినాయుడి కొడుకుల్లో పెద్దవాడు గణపతి విజయవాడలో బి.ఏ. మొదటి సంవత్సరం చదువుతున్నాడు. చిన్నవాడు కుమార్ కూడా విజయవాడలో ఇంటర్‌మీడియట్ మొదటి సంవత్సరం చదువుతున్నాడు. ఇద్దరూ హాస్టల్‌లో వుండి చదువుతున్నారు.

సారథిబాబూ! ఇవీ బ్రహ్మానాయుడి కుటుంబ వివరాలు"

"బాపూజీ! బ్రహ్మానాయుడుగారికి బద్ధశత్రువుగామారిన నాగరాణి వివరాలు కూడా చెప్పండి! అవి తెలుసుకోవాలని ఆసక్తిగా వుంది"

"అవును సారథిబాబూ! అవి తెలుసుకోదగినవే చెబుతా విను

నాగరాణి బి.ఏ. పాసయింది. తరువాత బ్రహ్మానాయుడి వారసుల కుటుంబంలోవాడే అయిన అర్జునరావుతో వివాహం జరిగింది. అర్జునరావు అందగాడే! అతడు కూడా బి.ఏ. చదివాడు. అతనికి పది ఎకరాల పొలం వుంది. ఆ పొలంతో నాగరాణి ఇంటికి ఇల్లరికం వచ్చాడు.

అర్జునరావు సౌమ్యుడే. బ్రహ్మానాయుడంటే అభిమానం వున్నవాడే. కాని ఇల్లరికపుటల్లుడు గనుక నాగరాణిని అనుసరించక తప్పలేదు.

అయితే నాగరాణి, అర్జునరావు ఎంతో అన్యోన్యంగా వుండేవాళ్లు.

తమకు లేకలేక కలిగిన ఏకైక పుత్రిక కావటాన నాగరాణి తల్లి, తండ్రి కూడా కూతురు ఇష్టానికి ఎదురు చెప్పేవాళ్లు కాదు.

నాగరాణికి ఒక కూతురు పుట్టింది. పేరు ఉషాబాల. రూపంలో అందాలబాల. చురుకుగా వుంటుంది.

కొన్నాళ్లకి నాగరాణి తండ్రి, మరికొన్నాళ్లకి తల్లి ఏడాదిలోపే ఇద్దరూ మరణించారు. అప్పుడు కూడా బ్రహ్మానాయుడి కుటుంబంతో సంబంధాలు పునరుద్ధరింపబడలేదు. వాళ్లు వచ్చి పలకరించినా నాగరాణి వైముఖ్యాన్నే ప్రదర్శించింది. మేమెవరం చెప్పినా వినలేదు.

నాగరాణి కూతురు ఉషాబాల అనూరాధ కన్న మూడేండ్లు చిన్నది. హైస్కూల్లో చదివేటప్పుడు ఉషాబాల తల్లికి తెలియకుండా అనూరాధతో మాట్లాడేది. అర్జునరావుకు అది యిష్టమే!

అయితే దురదృష్టవశాత్తు అర్జునరావు అనూహ్యంగా గుండెపోటుతో అకాలమరణం పాలయ్యాడు. భర్త మరణం నాగరాణిని కృంగదీసింది.

అప్పుడు కూడా బ్రహ్మానాయుడి కుటుంబంతో సంబంధాలు నాగరాణి పెట్టుకోలేదు. వారి సహకారాన్ని, సానుభూతిని తిరస్కరించింది. అన్నగా, సన్నిహిత బంధువుగా ఎన్నోసార్లు నేను నాగరాణికి హితవు చెప్పాను. వినలేదు. పెడచెవిని పెట్టింది.

ఇప్పుడు నాగరాణి కూతురు ఉషాబాల గుంటూరులో బి.ఏ. ఫైనల్ చదువుతున్నది. వినయం, వివేకం గల అమ్మాయి."

"బాపూజీ! అలా తల్లిదండ్రులు, భర్త, మరణంతో నాగరాణిగారు ఏకాకి అయ్యారు గదా! ఆ కుటుంబ నిర్వహణ ఎలా సాగు తుంది? "

"సారథిబాబూ! అర్జునరావు బతికివుండ గానే కొండయ్య అనేవాడు ఆ యింట్లో పాలే రుగా చేరాడు. వాడు సదానందంలాగే ఉత్సాహవంతుడైన యువకుడు. నిజాయితీ పరుడు. వ్యవసాయపు పనుల్లో నిపుణుడు.

అర్జునరావుపట్ల, నాగరాణిపట్ల అపార మైన భక్తి, గౌరవం కలవాడు. ఆ దంప తులు కూడా కొండయ్యని ఆదరాభిమానా లతో తమ కుటుంబంలో ఒకడిగా చూశారు. కొండా! అని ప్రేమగా పిలు స్తారు.

కొండయ్యకి వాడి సన్నిహిత బంధువు ల్లోనే ఈడూ జోడుగా వున్న మణి అనే అమ్మాయిని కుదిర్చి అర్జునరావు, నాగరాణి, తమ స్వంత ఖర్చులతో పెండ్లిచేశారు.

కొండయ్య భార్యామణి కూడా ఆ ఇంట్లోనే నాగరాణి ఇంటిపనులు చేసి పెడుతూ కొండయ్యలాగే ఆత్మీయురాలైంది.

అర్జునరావు మరణానంతరం కూడా కొండయ్య ఆ యింటిని విడిచిపెట్టలేదు. నాగరాణికి అండగా నిలిచాడు. మగ సంతా నంలేని నాగరాణిని వాడు తల్లిలాగా సంభా విస్తాడు. అమ్మా అని సంబోధిస్తాడు.

కొండయ్య, మణి దంపతులే ఇప్పుడు నాగరాణి కొండంత అండ.

సారథిబాబూ! విచిత్రమేమిటంటే బ్రహ్మా నాయుడుగారి పాలేరు సదానందం కొండ య్యకి మంచి మిత్రుడు. సదానందం దగ్గర కర్రసాము నేర్చుకున్నాడు. సదానందాన్ని అన్నయ్యా! అని సంబోధిస్తాడు. అలా సదా నందానికి కొండయ్య మంచి మిత్రుడుగా వున్నా, బ్రహ్మానాయుడి కుటుంబం వాళ్లతో మాట్లాడుతున్నా నాగరాణి పట్టించుకోదు. బ్రహ్మానాయుడి పొడగిట్టని నాగరాణి అలా వుండటం విశేషమే"

"బాపూజీ! వీరవరంలో నేను తెలుసుకోద గిన విషయాలెన్నో నాకు మీరు వివరంగా చెప్పారు. మీ పరిచయం నాకెంతో సంతోష దాయకంగా, ప్రయోజనకరంగానూ వుంది. మీకు నా కృతజ్ఞతలు"

"వినేవాళ్లుంటే నాకు తెలిసిన విషయాలు చెప్పటంలో నాకూ ఆనందం వుంది సారథి బాబూ! నేనసలే తెలుగుపంతుల్నిగదా! వస పోసిన పిట్టలాగా వాగటం నాకలవాటే! నా వాగుడు నీకు ప్రయోజనకరంగా వుందంటే అది నాకూ సంతోషమే!"



అరుణాలయం రైల్వేస్టేషను వెలుపల సదానందం ఎడ్ల బండిని విప్పి, ఎడ్లని బండిచక్రాలకు కట్టివేసి రైలు రాకకోసం ఎదురుచూస్తున్నాడు.

ఇంతలో శేషాద్రినాయుడి బావమరిది భూపాలరావు వీరవరం నుండి రైల్వేస్టేష నుకు నడిచి వచ్చాడు. బండి దగ్గరికి వచ్చిన భూపాలరావుని సదానందం పలకరించాడు.

"తెనాలి వెళ్తున్నారా భూపాలరావు గారూ? "

"లేదు సదానందం! హైద్రాబాదునుండి బ్రహ్మానాయుడు బావగారు, అనూరాధ వస్తున్నారుగదా! ఊరికే సరదాగా ఇక్కడి

దాకా ఎదురువచ్చాను"

"మీరు వస్తారని తెలిస్తే నేను మిమ్మల్ని పిలిచే వాణ్ణి గదండీ! బండిమీద వచ్చేవారుగా! ముందుగా నాతో చెప్పకపోయారా!"

"నడవటం మంచిదని నడిచివచ్చాలే! ఆరోగ్యానికి మంచిది"

రమాదేవి తండ్రి కేశవరావు, తల్లి కమలాంబలకు రమాదేవి పుట్టిన తరువాత పదిహేనుయేండ్లకు అరుదైన ఎడపు కాన్పులో పుట్టాడు భూపాలరావు. భారతీదేవి తండ్రి వాసుదేవరావుకిలాగే వారికి కూడా ఐదు ఎకరాల మాగాణి వుంది.

లేకలేక పుట్టిన భూపాలరావును అతి గారాబంగా పెంచారు. ఎం.ఏ.దాకా చదువు చెప్పించారు.

తండ్రి కేశవరావు ఉత్తముడు. తల్లి కమలాంబ గడసరి.

ఎం.ఏ. చదివిన తన కుమారుడికి బ్రహ్మానాయుడి ఏకైక పుత్రిక అనూరాధని చేసుకోవాలని ఆశపెట్టుకుంది.

కమలాంబ ధ్యాస అంతా అనూరాధ అందచందాలమీద, వాళ్లకున్న ఆస్తిమీదే వుంది. ఒక్కతే కూతురు. చదువు, చక్కదనం, సంపద, సౌజన్యం అన్నీ వున్న సంబంధం. అది కుదిరితే గొప్ప అదృష్టం. భారతీదేవితో వున్న బంధుత్వం ఆధారంగా ఎలాగైనా సాధించాలని కమలాంబ పట్టుదలతో భర్తతో, కొడుకుతో వీరవరం వచ్చింది.

అనూరాధ చదువు అయిపోయింది. బ్రహ్మానాయుడు ఇక కూతురు పెండ్లి తలపెడతాడు. ఈ సమయంలో ఎలాగైనా తన కూతురు రమాదేవిని, అల్లుడు శేషాద్రినాయుణ్ణి ఒత్తిడిచేసి, అనూరాధని భూపాలరావుకు ఇవ్వమని అడిగించాలని కమలాంబ గట్టి ప్రయత్నంలో వుంది.

చెవిలో యిల్లు కట్టుకొని పోరి అయినా శేషాద్రినాయుడి ద్వారా, రమాదేవి ద్వారా, బ్రహ్మానాయుడిని ఒప్పించాలి. తమ్ముడు; మరదలు చెబితే బ్రహ్మానాయుడు వినకపోతాడా! తనకొడుకు ఎం.ఏ. చదివాడు కదా. ఆడబిడ్డ వున్నా అది అనూరాధకి పినతల్లేనాయె! అయిన సంబంధం, బాదరబందీలేని సంబంధం. బ్రహ్మానాయుడు, భారతీదేవి ఒప్పుకుంటారని రమాదేవి గంపెడాశతో వీరవరం వచ్చింది. విజయదశమి పండుగకి అనూరాధ హైద్రాబాదు నుండి వీరవరం వస్తుందని తెలుసు. అందుకే ముందుగానే భర్తతో, కొడుకుతో కలిసి వీరవరం వచ్చింది. సమయం చూసి కూతురు రమాదేవితో తన మనసులో మాట చెప్పింది.

"అమ్మా! బావని మేము దైవ సమానుడుగా భావిస్తాం! నా తమ్ముడికి మీ కూతురుని ఇవ్వమని అడిగే సాహసం మాకు లేదు. మా వారు కూడా అన్నని అడగలేరు. అనూరాధకి ఈడైన తమ్ముడు నాకున్నాడని బావకి తెలియదా? ఇచ్చే ఆలోచనవుంటే ఆయనే అడుగుతారు. మేము అడగలేం" అని రమాదేవి స్పష్టంగా చెప్పింది.

అయినా కమలాంబ ప్రయత్నం మానలేదు. కూతురు మాట పట్టించుకోలేదు. అనూరాధ హైద్రాబాదునుండి వస్తున్న సంగతి తెలుసుకుంది.

కొడుకు భూపాలరావుకు సూటుబూటుతో నీటుగా అలంకరణ చేసింది. అరుణాలయం రైల్వేస్టేషనుకు వెళ్ళమని చెప్పింది. అనూరాధ రైలు దిగగానే చనువుగా పలకరించమనీ, బ్రహ్మానాయుడుగారితో భక్తి, వినయం, ప్రదర్శిస్తూ మెలగాలనీ కొడుకుకి నూరిపోసి పంపింది.

సదానందం బండి అప్పటికే వెళ్ళిపోయింది. అరుణాలయం స్టేషనుకు నడుచుకుంటూ వెళ్ళాడు.

సదానందం, భూపాలరావు, రైల్వేస్టేషను వెలుపల రైలుకోసం ఎదురుచూస్తూ కూర్చున్నారు.

కొంతసేపటికి రైలు స్టేషనుకు వచ్చింది. బ్రహ్మానాయుడు కూతురుతో కలిసి రైలు దిగాడు. సదానందం ఎదురువెళ్ళి సూట్

కేసు అందుకున్నాడు.

"సదానందం అన్నయ్యా! బాగున్నావా" అనూరాధ పలకరించింది.

"ఆ! బాగానే వున్నాను అనూరాధా!"

అనూరాధ సదానందాన్ని అన్నయ్యా అని పిలవటం, అతడేమో అనూరాధా అనటం విని భూపాలరావు మొగం చిట్లించాడు. ఈ పాలేరు సదానందాన్ని అనూరాధ అన్నయ్యా అనాలా? అతడు అమ్మాయి గారూ అనకుండా అనూరాధా అంటాడా? అనుకున్నాడు. అతనికంతా వింతగా వుంది.

"భూపాల్ మామయ్యా! బాగున్నావా? " అనూరాధ పలకరించింది.

"ఆ! బాగానే వున్నాను" అన్నాడు ఆలోచ ననుండి తేరుకొని.

"ఇంతకుముందు అదోలా వున్నావు? " అంది నవ్వుతూ.

"అదోలా ఎందుకున్నాను? అదేం లేదు"

బ్రహ్మనాయుడు నవ్వాడు. "మామయ్యని ఆటపట్టిస్తున్నావా? " అన్నాడు తరువాత భూపాలరావుతో

"ఊరు నుంచి ఎప్పుడొచ్చావురా భూపాల్? అమ్మా, నాన్నా బాగున్నారా? "

"మొన్న వచ్చాం బావా! అమ్మా, నాన్నా కూడా వచ్చారు. బాగున్నారు"

ఇంతలో సారథి, మురళీకృష్ణ వేరొక బోగీ నుండి దిగి అక్కడికి వచ్చారు.

"రా! సారధిబాబూ! నీకోసమే చూస్తు న్నాను. మురళీ! నువ్వెక్కణ్ణుంచిరా! ఈ సారధిబాబు నీకెక్కడ కలిశాడు? "

"హైద్రాబాదునుండే వస్తున్నానురా! ఆల స్యంగా స్టేషనుకి చేరాను. హడావుడిగా రైలు కదలబోయేముందే ఎక్కాను. ఆ కంపార్టుమెంటులోనే సారధిబాబు కలి శాడు. పరస్పరం పరిచయం చేసుకున్నాం"

"ఈ బాపూజీ కలవటంతో నాకు కాల క్షేపం బాగా అయిందండీ! నేను తెలుసుకో దగిన విషయాలెన్నో తెలియజేశారు"

"మా మురళి కలవటం, నీకు కాలక్షేపం కాకుండా వుండటమా! మహామహోపధ్యా యుడు గదా సారధి బాబూ! మా వీరవరం చరిత్రని, చిత్రపటాన్ని నీ ముందు ఆవిష్క రించి వుంటాడు"

అక్కడ నిలబడివున్న భూపాలరావును చూసి మురళీకృష్ణ.

"బ్రహ్మనాయుడూ! ఈ అబ్బాయి నీ తమ్ముడి బావమరిదికదూ? "

"అవునురా! రమాదేవి తమ్ముడు భూపా లరావు"

"ఎప్పుడొచ్చావురా భూపాల్? అమ్మా నాన్న బాగున్నారా? "

"మొన్న వచ్చానండీ! అమ్మ, నాన్న కూడా వచ్చారు. బాగున్నారు"

"పెద్దవాడివయ్యావుగదా! వెంటనే గుర్తు బట్టలేకపోయానోయ్! నువ్వు ఎం.ఏ. చది వావుగదూ? ఇప్పుడేం చేస్తున్నావు? "

"ఇంకా ఏమీ చెయ్యటంలేదండీ! ఇక ఏదైనా ఉద్యోగం చూసుకోవాలి"

ఇంతలో అరుణాలయం గ్రామ హైస్కూ లులో పనిచేసే టీచరు ఒకాయన అక్కడికి వచ్చాడు. ఆయన మురళీకృష్ణకు మిత్రుడు.

"నమస్కారం మురళీకృష్ణగారూ! మీరు హైదరాబాదు నుండి ఈ పూట వస్తారని తెలుసుకొని మీ కోసం వచ్చాను. మీతో ముఖ్యమైన పనివుంది. మీరు మా ఇంటికి రావాలి"

"రాక తప్పదా శంకరరావ్! మా వూరికీ రోజు కొత్త అతిథి వస్తున్నాడు. మార్గమ ధ్యంలో ఆపేశావ్! కలిసి వెళ్దామనుకు న్నాను" అంటూ సారధిని, బ్రహ్మనాయుడి కుటుంబాన్ని పరిచయం చేశాడు.

సారథిని చూసిన శంకర్రావు ఆహా! సుందరాకారుడు అనుకున్నాడు.

మురళీకృష్ణ శంకరరావుతో కలిసి వెళ్ళిపో యాడు.

"సారధిబాబూ మా బండి దగ్గరకు వెళ్దాం పద" అన్నాడు బ్రహ్మనాయుడు. అందరూ బండి దగ్గరకు వచ్చారు.

"సారథిబాబూ! ఈ బండి, గిత్తలు మావి. ఈ సదానందం వ్యవసాయ రథసారథి. పాలేరు అయినా మాకు దత్తపుత్రుని లాంటి వాడు" అని పరిచయం చేశాడు.

సదానందం సారథికి సగౌరవంగా నమస్కారం చేశాడు.

సారథికి భూపాలరావుని కూడా పరిచయం చేశాడు. సారథి అతనితో కరచాలనం చేశాడు.

"సదానందం! ఈ సారథిబాబు మన వూరు చూడటానికి వస్తున్నాడురా! మన వూరి వ్యవసాయ విధానాలు తెలుసుకోవాలని వస్తున్నాడు. వ్యవసాయమంటే బాగా ఇష్టం" అన్నాడు బ్రహ్మానాయుడు.

భారతీదేవి ఆరోజు కోడికూయగానే లేచి, పులిహోరచేసి, తోడు పెట్టిన పెరుగు, వాటర్‌బాటిల్, ప్లేట్లు, గ్లాసులు, కాఫీ ఫ్లాస్క్ అన్నీ ఒక బుట్టకు సర్ది సదానందానికి అందించింది. సదానందం ఆ బుట్టని అనూరాధకి అందించాడు. తల్లి అలా పంపుతుందని అనూరాధకి తెలుసు.

ఆ పులిహోర, పెరుగు, ప్లేట్లలో పెట్టి, అనూరాధ అందరికీ అందించింది. అందరూ ఆరగించారు.

"మా వీరవరం వంట ఎలా వుందండీ? " అనూధాధ సారథిని అడిగింది.

"ఈ వంటచేసిన వారిది అమృత హస్తం అంటాను. కమ్మని పులిహోర, గడ్డపెరుగు అనుపానం! రుచి అద్భుతం"

"జిడ్డుదేరిన వెన్నెల గడ్డ పెరుగు" అని మన "అభినవ తిక్కన" తుమ్మల సీతారామమూర్తిగారు కర్షక కుటుంబంలో పుట్టినవారు గనుక స్వానుభవంతో వర్ణించారు" అన్నాడు సారథి.

"సారథిగారూ! మా అమ్మది నిజంగా అమృతహస్తమే. మా అమ్మ హృదయం కూడా అమృత హృదయమే" అన్నాడు సదానందం.

అనూరాధ ఫ్లాస్క్‌తీసి కాఫీని కప్పుల్లో పోసి, అందరికీ అందించింది.

అనూరాధకి సున్నితమైన సహజ హాస్య ధోరణి వుంది. అందరూ కాఫీ తాగిన తరువాత సారథితో.

"కర్షక కవిగారు ఈ కాఫీని గురించి కూడా వర్ణించారా? " అంది.

"ఆయన కర్షక కవి గనుక కాఫీ, టీ గురించి వర్ణనలు చెయ్యరు.

'గరగరిక జాటు ముంగారు చెరకు రసం'

అని మధురమైన చెరకు రసాన్ని గురించి వర్ణించారు. మనం ఈ కాఫీనే ఆ చెరకు రసం అనుకుందాం" అన్నాడు సారథి నవ్వుతూ.

ఈ సంభాషణల్ని సరిగా ఆలకించకుండా ఏదో పరధ్యానంలో వున్న భూపాలరావుతో అనూరాధ.

"భూపాల్ మామయ్యా! చెరకు రసాన్ని వర్ణించిన కవి ఎవరు? " అన్నది.

"జంధ్యాల పాపయ్యశాస్త్రి" అన్నాడు భూపాలరావు అనాలోచితంగా.

"కాదండీ! తుమ్మల సీతారామమూర్తిగారే! సారథిగారు ఆయన కర్షక కుటుంబంలో పుట్టారని ముందే చెప్పారుగదా" అన్నాడు సదానందం.

"సదానందం ఇక బయలుదేరదాం! బండికి ఎడ్లని కట్టు" అన్నాడు బ్రహ్మానాయుడు. అనూరాధ బండిలో కూర్చుంది.

సదానందం బండి కట్టబోతుంటే సారథి రెండవవైపు కాడికోపు ఎత్తి సాయంపట్టాడు. 'ఎందుకండీ! బండి నేను ఒక్కణ్ణే కట్టగలను' నాకు అలవాటే అన్నా, సారథి సహకార భావంతో సాయంపట్టాడు.

సదానందం "ఛోయ్ దా!" అని పిలవగానే గిత్తలు రెండూ వచ్చి కాడి మెడలమీద వేసుకున్నాయి. సదానందం వాటికి అలా నేర్పాడు.

అందరూ బండి ఎక్కారు. సదానందం బండితోలుతున్నాడు.

"సారథిబాబూ! మా వీరవరం వ్యవ

సాయం గురించి తెలుసుకోవటానికి వస్తున్నావుగదా! మా బండిని అందరూ 'విజయ రథం' అంటారు. ముందుగా నువ్వు మా విజయరథాన్ని నడిపి చూడు" అన్నాడు బ్రహ్మానాయుడు.

"మీరు బండి తోలమంటున్నారు గనుక తోలతాను" అని సారథి సదానందం చేతిలో నుండి పగ్గాలు తీసుకున్నాడు. బండి తోలుతున్నాడు.

"బండి తోలటం ఆయనకి సరిగా వచ్చునో రాదో బావా! మీరు తోలమంటున్నారు గనుక తోలతాను అన్నాడు. బండిలో అందరం వున్నాం" అన్నాడు భూపాలరావు.

"భయపడకు మామయ్యా! ఆయన పేరే సారథి. ఆయనకి బండి తోలటం రాదని నీకేం తెలుసు? నీకు తోలటం రాదని మాత్రమే నీకు తెలుసు! ఆయన చేతగాని పని ఎందుకు చేస్తారు? " అన్నది అనూరాధ చిరునవ్వుతో.

బ్రహ్మానాయుడు చిరునవ్వుతో కూతురు వైపు చూశాడు.

సారథి బండి తోలటాన్ని సదానందం, బ్రహ్మానాయుడు శ్రద్ధగా గమనిస్తున్నారు. బండితోలటంలో సారథి మంచి నేర్పు చూపుతున్నాడు. మలుపు తిప్పవలసినచోట జాగ్రత్తగా పగ్గాలు చేతిలో వుంచుకొని మలుపు తిప్పుతున్నాడు. బండి పల్లానికి దిగవలసివస్తే ఎడ్లపగ్గాలు లాగిపట్టి వేగం తగ్గించి మెల్లగా దించి అదిరిపడకుండా తోలుతున్నాడు. మెరక ఎక్కవలసివస్తే ఎడ్లని గట్టిగా అదిలించి, వేగం పెంచి, మెరక ఎక్కిస్తున్నాడు.

పగ్గాలు చేతబట్టి బండితోలటం ప్రారంభించినప్పుడే గిత్తలు సారథి సామర్థ్యం పసిగట్టాయి. సదానందానికిలాగే సారథికీ చెప్పినట్లు నడిచాయి. బండి వీరవరం పొలిమేరదాకా వచ్చింది.

"మా అనూరాధ అన్నట్లు సారథి అన్న పేరుకు తగినట్లే బండితోలావు సారథి బాబూ" అని బ్రహ్మానాయుడు మెచ్చుకున్నాడు.

"నాన్నగారూ, మన గిత్తలక్కూడా సారథి గారి సంగతి తెలిసిపోయింది" అన్నాడు సదానందం.

సదానందం బ్రహ్మానాయుణ్ణి 'నాన్నగారూ' అన్నప్పుడు భూపాలరావు మొహం ఇబ్బందిగా పెట్టి చిట్లించాడు. అసలే జీతగాడు. అందునా నాన్నగారూ అని పిలుస్తున్నాడు. బావగారు అంత చనువివ్వడం బాగాలేదు అనుకున్నాడు.

అనూరాధ చిరునవ్వుతో అతని తీరు గమనిస్తూనే వుంది.

ఇంతలో రాఘవేంద్రస్వామి బండికి ఎదురొస్తూ కన్పించాడు.

"సారథిగారూ! బండి ఆపండి. తాతయ్యగారు వస్తున్నారు. బండి దించి తాతయ్యగారిని ఎక్కించాలి" అన్నాడు సదానందం.

సదానందం, సారథి బండి దిగి ఎడ్లని విప్పి, బండి దించారు.

"బాగున్నావా తాతయ్యా? " అనూరాధ రాఘవేంద్రస్వామిని పలకరించింది. ఎవరినైనా ముందుగా పలకరించటం అనూరాధకు అలవాటు.

"బాగానే వున్నానమ్మా. ఉదయమే కాఫీ తాగి మన పొలాలవైపు వచ్చాను. నువ్వు వచ్చే సంగతి తెలుసుగా. బండి ఇటే వస్తుందని ఇటే వస్తున్నాను"

"సారథిబాబూ! వీరు నాకు పినతండ్రి, రాఘవేంద్రస్వామిగారు. నువ్వు ముందుగా వీరవరంలో కలవాలనుకున్నది వీరినే. వీరు కూడా నాలాగే నీకు అనుకోకుండా దారిలోనే కలిశారు" అన్నాడు బ్రహ్మానాయుడు.

సారథి రాఘవేంద్రగారికి చేతులు జోడించి నమస్కారం చేశాడు.

"ఈ అబ్బాయి ఎవరు? " రాఘవేంద్ర బ్రహ్మానాయుణ్ణి అడిగాడు.

బ్రహ్మానాయుడు సారథిని గురించిన వివ

రాలన్నీ చెప్పాడు.

"అలాగా, సంతోషం. మన నారాయణ రావు పంపాడంటే ఈ సారథిబాబు ఏదో విశేషమైన వ్యక్తి అయివుండాలి. ఆయనకి అందరూ నచ్చరు. అందరినీ మెచ్చడు. ముందుగా నన్నే కలుసుకోమన్నాడంటే అది నాకూ సంతోషమే. సారథిబాబు వీరవ రంలో వున్నన్నాళ్లూ మా ఇంట్లోనే వుంటాడు" అన్నారు రాఘవేంద్ర.

రాఘవేంద్ర బండిలో కూర్చున్నారు. సారథి, సదానందం బండికి ఎడ్లని కట్టారు. సారథి బండి తోలుతున్నాడు. బండి బ్రహ్మా నాయుడి పొలాల దరిగా వచ్చింది.

"ఇవిగో సారథిబాబూ మా పొలాలు. ఈ డొంకకి దక్షిణంగా వున్న చేను పదిహేను ఎకరాలు. డొంకకి ఉత్తరంగా వున్న చేను పదిహేను ఎకరాలు. రెండు చేలూ మావే చూడు" అన్నాడు బ్రహ్మానాయుడు.

రెండు చేలూ డొంకకి ఉత్తరంగా, దక్షి ణంగా ఒకదానికొకటి ఎదురుగా వున్నాయి. సారథి బండి ఆపి, రెండు చేలూ పరిశీల నగా చూశాడు.

"రెండు చేలకూ బావులు, కరెంటు మోటార్లు వున్నాయిగదా" అన్నాడు సారథి.

"ఉన్నాయి సారథిబాబూ! రెండు చేల లోనూ పెద్ద బావులే తవ్వించాను. రెంటికీ కరెంటు మోటర్లు పెట్టించాను. ఖర్చుకు వెనకాడకుండా పడేదాకా పట్టుదలగా తవ్విం చాను. రెండుబావుల్లోనూ నీరు సమృ ద్ధిగావుంది"

"చాలా మంచి వనరు ఏర్పాటు చేసుకు న్నారు. పైరుకు నీరేగదా ముఖ్యం. ఇక మీకు అనావృష్టి భయంలేదు. అందుకే మిమ్మల్ని 'కర్షకబ్రహ్మ' అన్నారు" అంటూ సారథి బండి తోలటం ప్రారంభించాడు. బండి వీరవరం ఊరి దగ్గరికి వచ్చింది.

"సదానందం, ఇక బండి నువ్వే తోలు. ఊరులో నాకు దారి తెలియదుగదా" అని బండి ఆపి సదానందం చేతికి పగ్గాలు ఇచ్చాడు.

ఇంతలో భూపాలరావు బండి దిగి, "బావా! నేవెళ్తాను" అన్నాడు.

"అదేంటిరా భూపాల్, బండి దిగావెం దుకు? మా ఇంటికి రారా, భోజనం చేసి వెళ్లొచ్చు" అన్నాడు బ్రహ్మానాయుడు.

"మధ్యలో బండి దిగిపోతానంటావేంటి మామయ్యా? ఇరటికిరా. సదానందం అన్నయ్య, సారథిగారు, మనం అందరం సరదాగా కబుర్లు చెప్పుకుంటూ భోజనాలు చేద్దాం. అక్కడ వడ్డించేది కూడా మీ అక్క య్యేగదా. బండెక్కు" అంది అనూరాధ.

"అక్కయ్య వంట చేసి వుంచుతుంది. అమ్మ ఎదురు చూస్తూ వుంటుంది. వెళ్తాను" అంటూ భూపాలరావు వెళ్లిపో యాడు.

బ్రహ్మానాయుడి ఇంటికి శేషాద్రినాయుడి ఇల్లు దూరంగానే వుంది. అది పాత ఇల్లు. బ్రహ్మానాయుడిది కొత్త ఇల్లు.

బండి బ్రహ్మానాయుడి ఇంటిముందుకు వచ్చింది. భారతీదేవి ఆనందంగా బండి దగ్గరకు వచ్చింది. రాఘవేంద్రస్వామిగారి సతీమణి వైదేహి కూడా అక్కడికే వచ్చి వుంది. ఆమె కూడా బండి దగ్గరికి వచ్చింది.

సారథి, సదానందం బండి దిగి ఎడ్లని విప్పి బండి దించారు.

సదానందం పక్కన నిలిచి వున్న సార థిని చూసి, ఎవరీ కొత్త అబ్బాయి? ఎంత అందంగా వున్నాడు? అని వైదేహి ఆశ్చ ర్యంగా చూస్తూ లోలోపల అనుకున్నది. భారతీదేవి కూడా అంతే అనుకున్నది.

బండి దిగుతూనే అనూరాధ "బాగు న్నావా నాయనమ్మా? " అని వైదేహిని పల కరించింది.

"బాగానే వున్నానమ్మా. నువ్వీరోజు వస్తా వనే ఇక్కడికి వచ్చాను" అని తర్వాత బ్రహ్మా నాయుడితో,

"బ్రహ్మానాయుడూ! ఈ అబ్బాయి

ఎవరు? " అని అడిగింది.

సారథి తమకి ఎలా కలిసిందీ వివరంగా చెప్పి బ్రహ్మానాయుడు సారథిని వారికి పరిచయం చేశాడు. వైదేహికి, భారతీదేవికి సారథి నమస్కారాలు చేశాడు. తర్వాత బండిలో వున్న తన సూట్ కేస్ తీసుకుని నిలబడ్డాడు.

"సారథిబాబూ! సూట్ కేస్ చేతబట్టావేంటి? ఎక్కడికి? "

"ఎక్కడికి అనేది తెలియదు. ఈ ఊరులో ఎవ్వరితోనూ పరిచయంలేదు" అన్నది అనూరాధ తన సహజ హాస్య ధోరణిలో చిరునవ్వు నవ్వుతూ.

"నా మాటలు బాగా గుర్తుపెట్టుకున్నారే" అన్నాడు సారథి కూడా నవ్వుతూ.

"సారథిబాబూ! అతిథిగా మా ఇంట్లో అడుగు పెట్టావు. భోజనం చెయ్యకుండా వెళ్లనిస్తామా? " అన్నాడు బ్రహ్మానాయుడు.

"అవును సారథిబాబూ! ఈపూట ఇక్కడే భోజనం చెయ్యి. తరువాత నిన్ను మా ఇంటికి తీసుకువెళ్తాం. నువ్వు ఈ వీరవరంలో వున్నన్నాళ్లూ మా ఇంట్లోనే వుండాలి. మేము నీకు అన్నం పెట్టలేనివాళ్లం కాదు. అన్నదాతలన్న బిరుదు వున్న కర్షక కుటుంబాలు మనవి" అన్నాడు రాఘవేంద్ర.

"ఇక లోపలికి పదండి. స్నానాలు చేసి భోజనాలు చేద్దురుగాని. వేళమించిపోతూంది" అన్నది భారతీదేవి.

"అమ్మా! వేళమించిపోతేనేం? నువ్వు పంపిన కమ్మని పులిహోర, గడ్డపెరుగు ఆరగించాం. నీది అమృతహస్తమని, సారథిగారిది అమృత హృదయమని సదానందం అన్నయ్య ప్రశంసించారు కూడా" అంది అనూరాధ నవ్వుతూ.

"మామయ్యా! మీ భోజనం ఇక్కడే" అంది భారతీదేవి రాఘవేంద్రతో.

"మనవరాలు ఈ పూట వస్తుందని తాతకు తెలుసుగా. ఆయన ఎలాగూ బండికి ఎదురు వెళ్లకుండా వుండరు. కాఫీ తాగి ఆయన అటు వెళ్లగానే నేనూ కాలక్షేపానికి ఇటు వచ్చాను. ఇక నన్ను భారతీదేవి ఇంటికి వెళ్లనివ్వలేదు. వద్దన్నా వినకుండా వంట ఇక్కడే చేసింది" అంది వైదేహి.

అందరూ స్నానాలు చేశారు. భోజనాలకు కూర్చున్నారు.

సారథి, సదానందం పక్కపక్కనే కూర్చున్నారు.

భారతీదేవి, వైదేహి ఇద్దరూ సారథిబాబూ అని వాత్సల్యంతో సంబోధిస్తూ ఆదరంగా చూసి వడ్డించటం సారథిని ముగ్ధుణ్ణి చేసింది. అనూరాధ అప్పుడప్పుడు హాస్యోక్తులు విసురుతుంటే సారథి సమయోచితంగా సమాధానాలు చెబుతున్నాడు.

"నాయనమ్మా! అమ్మ, నువ్వు అమృతహస్తాలతో వంటచేసి, అడిగి మరీ వడ్డిస్తున్నారు. ఇక సారథిగారు వీరవరం విడిచివెళ్తారా? " అంది అనూరాధ.

"ఇదిగో అమ్మాయీ! హాస్యమాడుతున్నావ్. సారథిబాబు భోజనప్రియుడా? మీరే భోజనప్రియులు" అంది వైదేహి.

"అవునత్తయ్యా! మీరన్నది నిజం. వారికి వడ్డించేది మనమేగదా. వారి సంగతి మనకి బాగా తెలుసు" అంది భారతీదేవి నవ్వుతూ.

"విన్నావా సదానందం! స్వానుభవంతో చెబుతున్నారు" అన్నాడు సారథి.

"సదానందం అన్నయ్యా! నాయనమ్మ, అమ్మ, సారథిగారి పార్టీలో చేరారు"

అనూరాధకి ఇష్టమని ఆరోజు పాయసం వండారు. భారతీదేవి అందరికీ పాయసం వడ్డించింది. తర్వాత రాఘవేంద్రగారు, వైదేహిగారు సారథిని తమ ఇంటికి తీసుకువెళ్లారు. ఆ ఇల్లు విశాలమైన ఆవరణలో అన్ని వసతులతో ప్రశాంతంగా వుంది.

"సారథిబాబూ! నువ్వు ఇక్కడ వున్నన్నాళ్లూ ఇది స్వంత ఇల్లులాగా భావించు. నీకేం కావాలన్నా నిస్సంకోచంగా నన్నుగాని, తాతయ్యనిగాని అడుగు" అన్నది వైదేహి.

సారథికి ప్రత్యేకంగా ఒక గది ఇచ్చారు. ఆ గదిలో ఒక కుర్చీ, టేబుల్, మంచం, పరుపు వున్నాయి. రాత్రి అంతా ప్రయాణం చేసిన బడలికతో వున్న సారథి ఆ గదిలో మంచంమీద పడుకుని నిద్రపోయాడు.



రాఘవేంద్రస్వామికి సంతానం లేదు. ఆయన నిరాడంబరుడు. నిరంతరం పర హితం కోరేవాడు. హాస్యానికైనా అసత్యం పలకడు. గురజాడవారన్నట్లు "పరులమేల్ తన మేలనెంచే నేర్పరి" దేశ భక్తుడు. గాంధీజీ ప్రారంభించిన అస్పృశ్యతా నివార ణోద్యమానికి ఆకర్షితుడై, ముందుగా తానే ఆచరణలో పెట్టిన ఘనత ఆయనదే.

అంటరానితనాన్ని నిర్మూలించటానికి మొదట గ్రామంలోని పెద్దలు అంగీకరించ లేదు. అయినా రాఘవేంద్ర ధైర్యంగా నిలబ డ్డాడు. తన ముఖ్య మిత్రులు నలుగురైదు గురు తప్ప మిగతా ఊరివారంతా ఏకమై రాఘవేంద్రని వెలివేయాలని ప్రయత్నిం చారు. అయినా ఆయన జంకు, కొంకు లేకుండా తన కృషి కొనసాగించాడు. తన మిత్రుల సహకారంతో క్రమక్రమంగా గ్రామ ప్రజలందరినీ అంగీకరింపజేశాడు. వీరవ రంలో అంటరానితనాన్ని పూర్తిగా నిర్మూలిం చారు. రాష్ట్ర నాయకుల ప్రశంసలు అందు కున్నారు.

పశ్చిమ కృష్ణా జిల్లాలో ప్రథమంగా అంట రానితనాన్ని పూర్తిగా నిర్మూలించిన ఊరు వీరవరం. ఆ కృషికి ఆద్యుడు రాఘవేంద్రే. ఆయన్ని అందరూ రుషిలాంటివాడని ప్రశం సిస్తారు.

ఆయన సతీమణి వైదేహి ఆయనకి తగిన అర్ధాంగి. అందరితోనూ కలుపుగోలుగా వుంటుంది. నవ్వుమొగంతో పలకరిస్తూ యోగక్షేమాలు తెలుసుకుంటుంది. వీర వరం మహిళలకి గౌరవపాత్రురాలయింది. వీరవరంలో అందరూ ఆ దంపతుల్ని అరుంధతీ వశిష్ఠులు అంటారు.

సారథిని చూడగానే ఆ దంపతులకు ఏదో ఆకర్షణ, అనురాగం, కలిగాయి. ఆకా రంలో అందం, మాటల్లో స్వచ్ఛత, వినయం వారిని ఆకట్టుకుంది.

గదిలో పడుకున్న సారథికి మధ్యాహ్నం మూడు గంటలకి మెలకువ వచ్చింది.

సారథికి, రాఘవేంద్రకి వైదేహి స్వీటు హాటు పెట్టి టీ ఇచ్చింది.

"సారథిబాబూ! వీరవరంలో ఈ పూట ఏం చూస్తావ్?" రాఘవేంద్రని అడిగాడు.

"మీ ఇష్టం తాతయ్యా. మీరెక్కడికి తీసు కువెళ్తే అక్కడికి వస్తాను"

"రాత్రి ప్రయాణం చేసి వున్నావుగా సార థిబాబూ! ఈపూట గ్రంథాలయానికి వెళ్లండి. అది దగ్గరలో వుంది" అంది వైదేహి.

"అమ్మమ్మా! మీ సూచన బాగుంది. ప్రథ మంగా మీవూరి గ్రంథాలయాన్ని సందర్శిం చటమే సముచితంగా వుంటుంది"

సారథి, రాఘవేంద్ర ఇద్దరూ గ్రంథాలయా నికి వచ్చారు. కమల అనే మహిళ అక్కడ గ్రంథాలయాధికారిణిగా వుంది. ఆమె వీర వరం గ్రామస్థురాలే. రాఘవేంద్రకి బంధువు కూడా.

గ్రంథాలయం ఊరి మధ్యలో వుంది.

ముందు వరండాలో పొడవుగా వున్న టేబుల్ మీద దిన పత్రికలు, వార పత్రికలు, పక్ష పత్రికలు, మాస పత్రికలు అన్నీ ఒక క్రమంలో సర్ది వున్నాయి. గ్రంథాలయానికి వచ్చిన పాఠకులు మౌనంగా పత్రికలు చదువుకుంటున్నారు.

స్వంత వూరి గ్రంథాలయం కనుక గ్రంథాలయాధికారిణిగా వున్న కమల విశేష కృషి చేసి గ్రంథాలయాన్ని బాగా అభివృద్ధి చేసింది. అంతకుముందు దానికి స్వంత భవనం లేదు. అద్దెఇంట్లో నడుస్తున్నది. కమల ఆ గ్రంథాలయానికి ఉద్యోగరీత్యా వచ్చిన తర్వాత వితరణశీలురైన రాఘవేంద్రని, వైదేహిని గ్రంథాలయానికి భవనం సమకూర్చమని అర్థించింది. ఆ దంపతులు కమల కోరికని మన్నించి భవనం కొనిచ్చారు.

వీరవరంలో సాహిత్యాభిమానులైన కొందరు పెద్దలు బీరువాలు, విలువైన గ్రంథాలు కొని బహూకరించారు. ఆ విధంగా గ్రామ పెద్దల సహకారంతో కమల వీరవరం గ్రంథాలయాన్ని ఉత్తమ గ్రంథాలయంగా తీర్చిదిద్దింది.

సారథితో కలిసి గ్రంథాలయానికి వచ్చిన రాఘవేంద్రని సగౌరవంగా "రండి మామయ్యా!" అంటూ కమల ఆహ్వానించింది. అక్కడ గోడకున్న బోర్డుమీద గ్రంథాలయ భవన దాతలుగా వైదేహి, రాఘవేంద్రస్వామిల పేర్లు వుండటాన్ని సారథి చూశాడు.

"కమలా! ఈ అబ్బాయి పేరు సారథి. వీరవరం చూడాలని వచ్చాడు. మంచి భాషాజ్ఞానం వుంది. వ్యవసాయ పరిజ్ఞానం వుంది" అని పరిచయం చేశాడు.

సారథి సవినయంగా కమలకి నమస్కారం చేశాడు.

"ఈ సారథిబాబు గ్రంథాలయానికి వస్తే కావాల్సిన పుస్తకాలు చూసి ఇవ్వు కమలా. మా ఇంట్లోనే వుంటున్నాడు"

"అలాగే మామయ్యా! మంచి పాఠకులు గ్రంథాలయానికి వస్తే మాకెంతో సంతోషం. ఉత్తమ పాఠకులు రావాలనే మేం కోరుకుంటాం"

కమల సారథికి గ్రంథాలయంలోని అన్ని విభాగాలూ చూపించింది. కావ్యాలు, నాటకాలు, పురాణాలు, చరిత్రలు, విజ్ఞాన శాస్త్రాలు, వేదాలు, ఉపనిషత్తులు, నవలలు, భారతం, రామాయణం మొదలైన గ్రంథాలున్నాయి. ఏ విభాగానికా విభాగం చక్కగా సర్దివున్నాయి. అన్నీ పరిశీలించి సారథి ఆ గ్రంథాలయాన్ని ఎంతో మెచ్చుకున్నాడు.

"చాలా సంతోషంగా వుంది కమలగారూ! వీరవరంలో ప్రథమంగా ఎంతో విలువైన గ్రంథాలయాన్ని తాతయ్య నాకు చూపించారు. సాహిత్య సంపదున్న ఈ లైబ్రరీకి భవనం దానం చేసి తాతయ్య, అమ్మమ్మ గొప్ప సత్కార్యం చేశారు. ఇది నిజమైన విజ్ఞాన నిలయం"

కొంతసేపు పత్రికలు చూసి సారథి, రాఘవేంద్రలు కమలకి చెప్పి బయటికి వచ్చారు.

"సారథిబాబూ! మన బ్రహ్మానాయుడి తమ్ముడు శేషాద్రినాయుడి ఇంటికి వెళ్దాం. అక్కడ బ్రహ్మానాయుడి తల్లి శాంతమ్మగారు వుంది. ఆమెని పలకరించి, నిన్ను ఆ కుటుంబానికి పరిచయం చేస్తాను"

"సరే, తాతయ్యా! వెళ్దాం పదండి"

★ ★ ★

ఊరి వెలుపల నుండి బ్రహ్మానాయుడి బండి దిగి భూపాలరావు శేషాద్రినాయుడి ఇంటికి వెళ్లినపుడు తల్లి కమలాంబ ఇంట్లో లేదు. ఊళ్లో విశేషాలు తెలుసుకోవటానికి వెళ్లింది.

కమలాంబ వీరవరం ఎప్పుడు వచ్చినా ఊరు వాతావరణం తెలుసుకోవాలనే ఉబలాటం ఎక్కువ. ఊరులో తిరిగి ఎక్కడెక్కడి సంగతులూ తెలుసుకోనిదే ఆమెకు నిద్రపట్టదు. కూతురు రమాదేవికి అది గిట్టదు.

అయినా కమలాంబ మానదు. వీరవరంలో అందరితోను ఆమెకి పరిచయం వుంది.

అరుణాలయం స్టేషనుకు వెళ్లివచ్చిన కొడుకుని సాయంత్రం తీరికగా విషయాలు అడిగింది. "భూపాల్! అనూరాధ వచ్చిందా? బండి దిగగానే పలకరించావా?"

"ఆ, వచ్చిందమ్మా. అనూరాధ తనే ముందు నన్ను పలకరించింది"

"అదేంటిరా? ముందే నువ్వెందుకు పలకరించలేదు? ఊరునుండి వచ్చేవాళ్లని ముందే నువ్వు పలకరించాలిగదా. ఎం.ఏ. చదివావు. ఆపాటి వివేకం, గౌరవ వుండొద్దూ. చిలక్కి చెప్పినట్లు చెప్పి పంపానే. నువ్వు చేసిన నిర్వాకం ఇదా? నిన్ను స్టేషనుకి పంపిందెందుకు?"

"ఏం చెయ్యమంటావమ్మా? అనూరాధ రైలు దిగుతూనే ఆ మాల సదానందంగాణ్ణి అన్నయ్యా! బాగున్నావా? అని పలకరించింది. అది విని నాకు చిర్రెత్తుకొచ్చింది. ఇంతలోనే భూపాల్ మామయ్యా, బాగున్నావా? అని తనే నన్ను పలకరించింది. అమ్మా! ఆ మాల సదానందాన్ని, జీతగాణ్ణి అన్నయ్యా అని వరసపెట్టి పిలవాలా? ముందే వాణ్ణి పలకరించాలా?

అంతేకాదమ్మా. బావ ధోరణీ అంతే వుంది. హైదరాబాదునుండి సారథి అనే అతను బావతోపాటు రైలు దిగాడు. అతనికి బావ సదానందాన్ని పరిచయం చేస్తూ "ఈ సదానందం మాకు దత్తపుత్రుని లాంటి వాడు" అన్నాడు. ఆ సదానందం బావని నాన్నగారూ అంటున్నాడు. భారతి అక్కయ్యని మా అమ్మ అంటున్నాడు. ఇది వాళ్ల కుటుంబ గౌరవానికి తగినట్లుగా వుందా?" అన్నాడు భూపాలరావు చిరాకుగా.

"ఏమిటీ? బావతోపాటు సారథి అనే అతను రైలు దిగాడా? వయసు ఎంత వుంటుంది? అతను బావకెట్లా తెలుసు?"

"నా వయసు వుండొచ్చు. వాళ్లకి సికింద్రాబాదు స్టేషన్లో కలిశాడట. వీరవరం చూడాలని వస్తున్నాడట. నారాయణరావు తెలుసట. వారి సలహాతో వీరవరం వస్తున్నాడట. వచ్చేటప్పుడు ఎడ్లబండి అతడే తోలాడు. బండి బాగా తోలాడని బావ, సదానందం అతణ్ణి మెచ్చుకున్నారు. నేను ఊరి బయటే బండి దిగి వచ్చేశాను. నేను వస్తుంటే బావ, అనూరాధ ఇద్దరూ వుండమన్నారు. ఇంటిదాకా వచ్చి భోజనం చేసి వెళ్లమన్నారు. నేనే ఇష్టంలేక వుండకుండా వచ్చేశాను"

"ఓరి నీ దుంపతెగ! వాళ్లిద్దరూ ఇంటికి రమ్మని పిలిస్తే పోకుండా ఎందుకొచ్చావురా? నువ్వంటే అభిమానం వుండబట్టేగదా వాళ్లు నిన్ను రమ్మన్నది. తెలివితక్కువగా కాదని వచ్చావు. ఇంతవాడివయ్యావు. ఎం.ఏ. చదివావు. ఇంకా నీకు లోకజ్ఞానం ఎప్పుడొస్తుందిరా చదవేస్తే వున్న మతి పోయిందన్నట్లే వుందిరా నువ్వు చేసిన పని"

అనూరాధ వాళ్లకి ఒక్కతే కూతురు. ఆస్తి వుంది. అందం వుంది. చదువుకున్న పిల్ల. వినయం వుంది. అనూరాధతో నీ పెళ్లి జరిగితే మనకంతకంటే గొప్ప అదృష్టం ఇంకేముందిరా. అసలు ఆలోచన నీకే రావాలి. నేనంతగా బోధించి పంపితే ఇంతేనా చేసేది?

అనూరాధ సదానందాన్ని అన్నయ్యా అంటే నీదేం పోయిందిరా. సదానందం చదువుకున్నవాడు. సంస్కారం వున్నవాడు. చిన్నతనం నుండి వాళ్ల ఇంట్లో వున్నవాడు. వాళ్ల అభిమానం చూరగొన్నవాడు. నీలాంటి చదువుకున్నవాడిక్కూడా ఆ పట్టింపులుంటే నలుగురూ నవ్వుతారు. అసలే ఇది వీరవరం. అటువంటి పట్టింపులకు ఈ ఊరు దూరం. ఎక్కడెట్లా మసలుకోవాలో ఇకనైనా నేర్చుకో" అన్నది కమలాంబ స్వరం పెంచి.

"అమ్మా! మెల్లగా మాట్లాడు. గదిలో శాంతమ్మత్తయ్య వున్నారు, వింటారు" సమీపంలోనే వుండి సంభాషణ వింటున్న రమాదేవి అన్నది.

# రచయితలకు మనవి

★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, 'చతుర కతలు', 'చతుర ప్రపంచం' వంటి శీర్షికలు కాక కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు గనుక రచయిత(త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో 100 పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.

★ ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని, ఆ మేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు సరిపోయేలా ప్లాన్‌చేసుకుని 'చతుర'కు అనుకూలంగా వుండే సైజులో పంపడం మంచిపద్ధతి.

★ ఆవిధంగా నవలలు 'చతుర'కు సరిపడా లేకపోయినట్లయితే ఆయా నవలలు పరిశీలనార్హాలు కావని గమనించగోరుతున్నాం.

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్ట్‌లోగాని, ఇతరత్రాగాని పోయిన సందర్భాల్లో మా బాధ్యత వుండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్థంగా భావిస్తే ఆ విషయం తెలియపరచడం, లేనిపక్షంలో తిప్పిపంపడం జరుగుతుంది.

★ ప్రతి నవలకు అందజేసే రూ. 3000/- పారితోషికం ఏ నెల 'చతుర'లో ప్రచురిస్తే ఆ నెల మొదటివారంలోనే పంపబడుతుంది.

ఎడిటర్:
చతుర
'ఈనాడు' కాంపౌండ్
హైదరాబాద్, 500 082.

# చతుర సమీక్ష



ఈ శీర్షిక ద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్ హైదరాబాద్-500 082 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

★ మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రూ. 100/- ప్రథమ బహుమతి, రూ. 75/- ద్వితీయ బహుమతి, రూ. 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

ఫిబ్రవరి చతుర నవల సుజలాం... సుఫలాం!

సమీక్షకుని పేరు: ..............................

చిరునామా: ..............................

..............................

..............................



"ఏమోలే అమ్మా! మాకున్నది ఒక్కగా నొక్క కొడుకు. చదువు, చక్కదనం లేని వాడేం కాదు. వాడికి మంచిగా ఒకదారి చూద్దామని మా తపన. మీరెందుకనో పట్టించుకునేలాలేరు. అదే నా బాధ. మీర డిగితే బ్రహ్మనాయుడు కాదంటారా? భార తీదేవి పరాయిదా? తమ్ముడి మేలు కోసం నువ్వు పట్టించుకుంటే తప్పా?" అంటూ నిష్టూరాలు మొదలు పెట్టింది కమలాంబ.

"అమ్మా! నువ్వేమన్నా అనుకో. ఆ విషయం మేం అడగలేం. కావాలంటే నువ్వు, నాన్న రాఘవేంద్ర మామయ్యని అడగండి. ఆయన బావతో మాట్లాడతారు"

"మా ప్రయత్నమేదో మేం చేసుకుం టాంలే. మా అదృష్టం ఎలా వుంటే అలా జరుగుతుంది. మీరు పట్టించుకోకపోయినా మాకు తప్పదుగా"

"కమలాంబా! రాఘవేంద్ర బావగారు వస్తున్నారు. ఇక నీ వేదాంతం ఆపు" అన్నాడు అక్కడే వున్న కేశవరావు. ఆయ నకి భార్య కమలాంబ ధోరణి నచ్చదు.

రాఘవేంద్ర సారథితో కలిసి లైబ్రరీ నుండి అక్కడికి వచ్చారు.

"రండి మామయ్యా!" అంటూ రమాదేవి సవినయంగా ఆహ్వానించింది. కేశవరావు, కమలాంబ ఇద్దరూ రాఘవేంద్రగారికి నమ స్కారాలు చేశారు.

వారి యోగక్షేమాలడిగి రాఘవేంద్ర సార థిని వారికి పరిచయం చేశారు. సారథి వారికి, రమాదేవికి నమస్కారాలు చేశాడు.

"ఈ అబ్బాయి ఎంత అందంగా వున్నాడు" అనుకున్నది రమాదేవి.

"ఇతడు వీరవరం రావటంలో విశేష మేంటో. మనిషి చాలా అందంగా వున్నాడు" అనుకున్నది కమలాంబ అనుమానంగా.

అందరూ మధ్య హాల్లో కుర్చీల్లో కూర్చు న్నారు.

"అత్తయ్యా! రాఘవేంద్ర మామయ్య వచ్చారు" అని రమాదేవి శాంతమ్మని పిలి చింది. గదిలో పడుకుని వున్న శాంతమ్మ మెల్లగా హాల్లోకి వచ్చి కుర్చీలో కూర్చుంది.

"సారథిబాబూ! వీరు బ్రహ్మనాయుడి తల్లి శాంతమ్మగారు" అని రాఘవేంద్ర పరిచయం చేశాడు.

సారథి కుర్చీలోనుంచి లేచి, శాంతమ్మకి నమస్కారం చేశాడు.

నమస్కారాలు బాగా పెడ్తున్నాడే. బతక నేర్చినవాడే అనుకున్నది కమలాంబ తన కొడుక్కి ఆ తెలివి లేదాయె అని నొచ్చు కుంటూ.

"ఈ బాబు ఎవరు?" శాంతమ్మ సారథిని గురించి అడిగింది.

రాఘవేంద్ర సారథిని గురించిన వివరా లన్నీ ఆమెకు చెప్పాడు.

"అలాగా! మన ఊరు చూడాలని వచ్చాడా" అని, "అనూరాధ ఇక్కడికి రాలేదా?" అని శాంతమ్మ అంటూ వుండ గానే,

"ఇదిగో వస్తున్నా నాయనమ్మా" అంటూ శాంతమ్మ మాటని అందుకుంటూ అనూ రాధ ఆ ఇంట్లో అడుగు పెట్టింది. గబగబా వచ్చి శాంతమ్మ భుజాలు పట్టుకుని "బాగు న్నావా నాయనమ్మా" అంది.

"మా అమ్మే! మాటలోనే వచ్చింది. మా చిట్టితల్లికి నూరేండ్లాయుష్షు" అంటూ శాంతమ్మ మనవరాలి బుగ్గలు నిమిరింది.

"కమలాంబమ్మమ్మా! బాగున్నావా? నువ్వు, తాతయ్య వచ్చారని భూపాల్ మామయ్య చెప్పాడు" అని అనూరాధ కమ లాంబని పలకరించింది.

తనే ముందుగా పలకరిద్దామని కమ లాంబ అనుకుంది. కాని సారథిని గురించి అనుమానపు ఆలోచనలోపడి వెనకబడింది. అనూరాధ పలకరింపుతో తేరుకుని "బాగానే వున్నాం తల్లీ. ఈ దసరా పండక్కి నువ్వు ఇంటికొస్తావని తెలిసి బయలుదేరి వచ్చాం. నిన్ను చూడక చాలా కాలం అయిందమ్మా. చూడాలనిపించి వచ్చాం" అన్నది కమ

లాంబ ప్రేమని ఒలకబోస్తూ.

ఇంతలో పొలం నుండి శేషాద్రినాయుడు వచ్చాడు. అనూరాధని పలకరించాడు. సారథిని రాఘవేంద్ర ఆయనకి పరిచయం చేశాడు. సారథి లేచి ఆయనకి నమస్కారం చేశాడు.

"బాబాయ్! సారథిగారు మన విజయరథానికి సారథ్యం చేస్తూ వీరవరం వచ్చి సారథిగా తన పేరు సార్థకం చేసుకున్నారు" అంది అనూరాధ నవ్వుతూ.

"ఆ సారథ్యానిదేముందిలెండి. చదువుకునేటప్పుడు సెలవుల్లో మా నాన్నగారి దగ్గర బండి తోలటం, అరక దున్నటం నేర్చుకున్నాను. నాకు చదువు, వ్యవసాయం, రెండూ కలగలుపుగా వున్నాయి" అన్నాడు.

"గణపతి, కుమార్ సెలవులకి ఇంటికి రాలేదా? " రాఘవేంద్రగారడిగారు.

"రేపు వస్తారు బాబాయ్! రైల్వే స్టేషనుకు బండి పంపుతాను" అన్నాడు శేషాద్రినాయుడు.

రమాదేవి అందరికీ టీ తెచ్చి ఇచ్చింది.

టీ తాగిన తరువాత రాఘవేంద్ర, సారథి వెళ్లిపోయారు.

"ఈ సారథి ఎంత ముచ్చటగా వున్నాడు" అంది శాంతమ్మగారు.

"అవునత్తయ్యా! మాట కూడా నమ్రతగా ఉంది" అంది రమాదేవి.

అసలే ఏదో అనుమానంతో రగిలిపోతున్న కమలాంబకి తన కూతురు కూడా అతడిని మెచ్చుకోవటంతో మరింత కలవరపడింది.

"ముచ్చటగా, నమ్రతగా కనపడే వాళ్ల మంచి చెడ్డలు ముందే ఎలా తెలుస్తాయిలే వదినెగారూ! మెరిసేదంతా బంగారం కాదు" అంది.

"కంచు మోగినట్లు కనకంబు మోగునా అన్నారు కమలాంబా! సారథిబాబు కంచులా మోగేవాడు కాదని తెలుస్తూనే వుంది. రమాదేవి అన్నట్లు నమ్రతగానే వున్నాడు" అంది శాంతమ్మగారు.

"సంగతి తెలుసుకోకుండానే మనం ఇతరుల్ని గురించి చెడుగా ఊహించటం తప్పు" అన్నాడు శేషాద్రినాయుడు.

"నాయనమ్మకి లోకోక్తులు బాగానే తెలుసునే!" అంది అనూరాధ.

కమలాంబ ఇంకేం మాట్లాడలేదు.

★ ★ ★

రాఘవేంద్ర, వైదేహి, సారథి రాత్రి భోజనాలు చేసి హాల్లో కూర్చొని మాట్లాడుకుంటున్నారు.

బ్రహ్మనాయుడు, భారతీదేవి, అనూరాధ, సదానందం నలుగురూ రాత్రి భోజనాలు చేసి రాఘవేంద్రగారింటికి వచ్చారు. ప్రతిరోజు రాత్రి భోజనాల తరువాత వారింటికి వీరు, వీరింటికివారు వచ్చి ఇష్టాగోష్టి జరుపుకోవటం వారికి అలవాటే.

"సారథిబాబూ! మా వీరవరం గ్రంథాలయం చూశావుగదా! ఎలా వుంది" ముందుగా వైదేహిగారు గోష్టి ప్రారంభిస్తూ అడిగారు.

"వీరవరం గ్రంథాలయం గొప్ప విజ్ఞాన నిలయం అమ్మమ్మా"

"ఆది కావ్యమని ప్రసిద్ధి చెందిన రామాయణం, అష్టాదశ పర్వాల కవిత్రయ భారతం, అష్టదిగ్గజాల ప్రసిద్ధ కావ్యాలు, అష్టాదశపురాణాలలోని ముఖ్య పురాణాలు, అలంకార ఛందశ్శాస్త్రాలు, వేదాలు, ఉపనిషత్తులు, విజ్ఞానశాస్త్రాలు, చరిత్రలు, ఎన్నో విలువైన గ్రంథాలున్న వీరవరం గ్రంథాలయం ఉత్తమ గ్రంథాలయం! వీరవరం ప్రజల సాహిత్యాభిమానానికి ఇది నిదర్శనం. లైబ్రేరియన్ కమలగారు దాన్ని ఎంతో చక్కగా ఏ విభాగానికి ఆ విభాగం తీర్చిదిద్దారు."

"విన్నావా వైదేహీ. సారథిబాబు గ్రంథాలయాన్ని ఎంత చక్కగా పరిశీలించి చెబుతున్నాడో" అన్నాడు రాఘవేంద్రగారు.

"సారథిబాబుకి మంచి భాషాజ్ఞానం,

సాహిత్యాభిమానం వుంది. అంతేకాదు ప్రతి పనిలోనూ నైపుణ్యానికి ప్రాధాన్యం ఇస్తాడు" అన్నాడు బ్రహ్మానాయుడు.

"అయితే మన వీరవరం గ్రంథాలయానికి అత్యుత్తమ పాఠకులు లభించారన్న మాట" అంది అనూరాధ.

ఆ తరువాత ఎన్నో విషయాలు చాలా సేపు అందరూ మాట్లాడుకున్నారు.

★ ★ ★

రోజూ తెల్లవారుజామున అయిదు గంటలకే రాఘవేంద్ర నిద్ర లేచి వాకింగుకు వెళ్తారు. అప్పుడే వైదేహి లేచి ఇంటి పనులు ప్రారంభిస్తారు.

వారికి రాజమ్మ అనే పనిమనిషి వుంది. ఆమె కూడా ఆ సమయానికే వచ్చి ఆవరణ అంతా వూడ్చి పేడనీళ్లతో కళాపి చల్లి ముగ్గు పెడుతుంది.

సారథికి ప్రతిరోజూ ఉదయం అయిదు గంటలకే లేచి వ్యాయామం చేసే అలవాటుంది. అప్పుడే లేచి బయటికి వచ్చాడు. రాఘవేంద్రగారు వాకింగుకు బయలుదేరబోతున్నాడు.

"సారథిబాబూ! అప్పుడే లేచావేం? నేను రోజూ వాకింగుకు వెళ్తాలే. నువ్వు పడుకో! నేను రోజూ ఈ టైముకే లేస్తాను"

"నాకూ రోజూ ఉదయం అయిదు గంటలకే లేచి వ్యాయామం చేసే అలవాటుంది. ఇక్కడ వ్యాయామం కుదరదు. మీతో వాకింగుకు వస్తాను తాతయ్యా!"

"సరే అలాగే పోదాంరా! సారథిబాబూ"

ఇద్దరూ బయలుదేరారు. ఊరు బయటికి వచ్చారు. అది అరుణాలయం రైల్వే స్టేషనుకి వెళ్లే డొంకబాట. దాన్ని తూర్పు డొంక అంటారు. గ్రామంలో నుండి పొలాలకు అరకలు, బండ్లు, పశువులు, పోవటానికి వుండే విశాలమైన మార్గాన్నే డొంక అంటారు. ఒక వూరి నుండి మరొక వూరికి పోవటానికి కూడా డొంక బాటలుంటాయి.

వీరవరం తూర్పు డొంకకి రోడ్డు వేసి జాతీయ రహదారిలో కలపాలని ప్రభుత్వం నిర్ణయించింది. కానీ పని ప్రారంభించలేదు.

సారథి, రాఘవేంద్ర తూర్పు ముఖంగా డొంకన నడుస్తున్నారు. వారికి సదానందం దారిలో కలిశాడు. నాగేశు అనే మరొక పాలేరుతో కలిసి నాగళ్లు కోటేళ్లు వేసుకొని పొలానికి వెళ్తున్నాడు. నాగేశు బ్రహ్మానాయుడుకి రెండవ పాలేరు.

"సారథిగారూ! మీరూ తాతయ్యగారితో పాటే చీకటితో లేచారే!"

"నాకు రోజూ ఈవేళకే లేచే అలవాటుంది సదానందం"

"సాయంత్రం మీరూ, తాతయ్యా మా పొలానికి రండి! మేం దున్నే దుక్కి చూద్దురుగాని"

"అలాగే వస్తాను సదానందం! నేను వచ్చిందే మీ వూరి వ్యవసాయ విధానం తెలుసుకోవటానికిగదా" అన్నాడు సారథి.

"ఒరే నాగేశూ! నిన్న మన బండి తోలారని నీకు చెప్పానే! ఆ సారథిగారు వీరేరా! బండి చాలా బాగా తోలారు" అని చిన్న పాలేరుకు చెబుతూ సదానందం అరకలతో వెళ్లిపోయాడు.

సారథి, రాఘవేంద్ర మాట్లాడుకుంటూ కొంతదూరం వెళ్లి వెనక్కి తిరిగి ఊరి వైపు వస్తున్నారు. వారికి శేషాద్రినాయుడి పాలేరు అరుణాలయం రైల్వే స్టేషనుకి బండి తోలుకుపోతూ ఎదురయ్యాడు. బండిలో భూపాలరావు కూడా వున్నాడు.

"కాంతయ్యా! బండి రైల్వే స్టేషనుకేనా? ఈ పూట పిల్లలు వస్తారుగదా? బండి జాగ్రత్తగా తోలుకురా" అన్నాడు రాఘవేంద్ర.

"అలాగేనండీ" అంటూ కాంతయ్య బండితో వెళ్లిపోయాడు.

సారథి, రాఘవేంద్ర ఊరు ముందుకు వచ్చారు. అప్పటికి తెల్లవారింది. ఊరిలో నుండి ఒక వ్యక్తి వారికి ఎదురు వస్తున్నాడు. ఆరడుగుల ఎత్తువున్న ఆ వ్యక్తి

చేతులో ఆరడుగుల బాణాకర్ర వుంది. నవ్వు మొగంతో వున్న ఆ వ్యక్తి.

"రాఘవేంద్రన్నయ్యా! ఎవరీ అబ్బాయి?" అన్నాడు.

రాఘవేంద్ర సారథిని ఆయనకి పరిచయం చేసి వివరాలు చెప్పాడు.

సారథి ఆయనకి నమస్కారం చేశాడు.

"సారథి బాబూ! ఈయన వినుకొండ వీరభద్రయ్య. మాకు బంధువే! వీరవరంలో ఈ వీరభద్రయ్య కర్రసాములో అసాధారణ వీరుడు. ఈయన వీరకృత్యం ఒకటి వుంది అది చెబుతా విను.

ఈ వీరవరంలోకి ఒక రోజు రాత్రి ఏడుగురు దొంగలు ప్రవేశించారు. ఎక్కడా వాళ్లకి దొంగతనానికి వీలు చిక్కలేదు. అర్ధరాత్రి దాటాక ఒక ఇంటికి కన్నం వేయటం ప్రారంభించారు. ఆ ఇంటి గోడ ఎక్కువ మందంగా వుంది. రాళ్లతో, సిమెంటుతో కట్టివుంది. కన్నం వేయడం సులభంగా లేదు. సమయం చాలలేదు. తెల్లవారుజామున దొంగలు కన్నం వేయటం చాలించి వెళ్లిపోతున్నారు.

తెల్లవారుజామునే వీరభద్రయ్య నిద్రలేచి బయటికి వచ్చాడు. ఈయన చేతిలో ఎప్పుడూ బాణాకర్ర వుంటుంది. వాళ్లు దొంగలని గ్రహించి వెంటబడ్డాడు.

ఈయన ఒంటరిగా వున్నాడని వాళ్లు గ్రహించారు. ఎక్కడ కన్నం వేద్దామన్నా వీలుపడక వట్టి చేతులతో వెళుతున్న దొంగలకు ఒంటరిగా వెంటబడ్డ వీరభద్రయ్యని విరగేసి పోదామనుకున్నారు. బాణాకర్రలతో ఏడుగురూ విరుచుకు పడ్డారు. ఈయన సాముగరిడీల వీరుడని వాళ్లకేం తెలుసు.

కండబలం, గుండెబలం, కర్రసాములో వీరత్వం వున్న వీరభద్రయ్య బాణాకర్రతో వాళ్లని చెండాడాడు. వాళ్లు కొట్టే దెబ్బల్ని చాకచక్యంగా తప్పించుకొంటూ వాళ్ల కర్రల్ని ఎగరగొడుతూ వాళ్లని దెబ్బతీస్తున్నాడు. వాళ్లలో ఒకడికి తలపగిలింది. మరొకడి చెయ్యి విరిగింది. ఈయన వీరవిహారానికి వాళ్ల గుండెలదిరి బెదిరి పారిపోయారు. తెల్లవారిన తరువాత చూస్తే అక్కడ రక్తంతో నేల తడిసివుంది. వీరభద్రయ్య ధైర్యాన్ని వీరవరం ప్రజలు వేనోళ్ల ప్రశంసించారు"

"చాలా సంతోషం తాతయ్యా! వీరవరం వీరుడి కథ వినిపించారు" అని, "తాతయ్యా! నాకు కర్రసాము నేర్పుతారా" వీరభద్రయ్యని అడిగాడు నవ్వుతూ.

"ఎందుకు నేర్పనూ? నువ్వు నేర్చుకుంటానంటే నేర్పుతా! మా బ్రహ్మానాయుడికి నేర్పాను. సదానందానికి నేర్పాను. వాళ్లిద్దరూ కర్రసాములో మొనగాళ్లే! సాము నేర్చుకొనేవాళ్లుంటే నాకు నేర్పటం సరదా" అన్నాడు వీరభద్రయ్య.

"సారథిబాబూ! ఈయనకు వ్యవసాయం చెయ్యటం బాగావచ్చు తోటలు పెంచటం ఇష్టం. చీకూచింతాలేని నిత్య సంతోషి. ఎవరైనా పొగిడినా నవ్వుతాడు. తిట్టినా నవ్వుతాడు. సుఖంలోను, దుఃఖంలోను, నవ్వు చెదరని మనిషి. వీరత్వం, ధీరత్వం వున్నవాడు" అన్నాడు రాఘవేంద్ర.

వీరభద్రయ్య నవ్వుతూనే విన్నాడు.

★ ★ ★

వాకింగునుండి ఇంటికి వచ్చిన రాఘవేంద్ర, సారథి కాఫీ, టిఫిన్లు పూర్తిచేసి హైస్కూలుకు వచ్చారు. విజయదశమికి సెలవులు ఇచ్చారుగనుక విద్యార్థులు లేరు. ఏడు ఎకరాల ఆవరణలో వున్న వీరవరం హైస్కూలుకు మూడు వైపుల పండ్లతోటలు, దక్షిణంగా గ్రామంవైపు గేటు వుంది.

"సారథిబాబూ! వితరణశీలి, సంఘశ్రేయోభిలాషి అయిన వీరభద్రయ్య అనే ధనిక రైతు ఏడు ఎకరాల భూమి, కొంత

డబ్బు విరాళంగా ఇచ్చాడు. ప్రభుత్వం హైస్కూలు నిర్మించింది.

ఆయన వందల ఎకరాలున్న భూస్వామి కాదు, కోటీశ్వరుడూ కాదు. వీరవరంలో ఒక ధనిక రైతు మాత్రమే! ఆయనకంటే ధనిక రైతులు చేయలేని త్యాగం ఆయన చేశాడు. ఉన్నత విద్యా సౌకర్యాలు లేని వీర వరం గ్రామానికి హైస్కూలు నిర్మింపజేసి మహోపకారం చేశాడు. తన తండ్రి హను మయ్య పేరు స్కూలుకు పెట్టించుకున్నాడు.

ఈ హైస్కూల్లో చదివిన విద్యార్థులు కాలేజీల్లో చేరి ఫస్టు క్లాసులు, ఫస్టురాం కులు తెచ్చుకున్నారు. పతకాలు తెచ్చుకు న్నారు. ఇంజనీర్లుగా, డాక్టర్లుగా, లాయ ర్లుగా, వ్యవసాయ శాస్త్రవేత్తలుగా, దేశం లోను, విదేశాలలోను మంచి ఉద్యోగాల్లో వున్నారు. వందలాది యువతీయువకులకు ఈ హైస్కూలు విద్య చిన్నవో, పెద్దవో ఉద్యోగాలు కల్పించింది"

"ఆహా తాతయ్యా! ఒక వ్యక్తి ఔదార్యం గ్రామానికెంత మేలు చేసిందో చూశారా! ఈ దేశంలో వున్న కోటీశ్వరులంతా తమ దగ్గ రున్న ధనాన్ని చీకటి గదుల్లో బంధించ కుండా త్యాగశీలతతో వీరభద్రయ్యగారిలాగే విద్యా సంస్థల్ని, ప్రాజెక్టుల్ని నెలకొల్పితే మన దేశం ప్రపంచంలోనే మహోన్నత దేశంగా ఆవిర్భవిస్తుంది"

"త్యాగశీలత దేవుడెరుగు. ఇప్పుడు దేశంలో భోగశీలత పెరుగుతున్నది సారథి బాబూ! ధనదాహం ఎక్కువైంది. వాగ్దానాల హోరుతో ప్రజల్ని నమ్మించి గెలిచి, చేసిన బాసలు గాలికి వదిలి, సిగ్గు ఎగ్గు విడిచి పదవుల్ని అడ్డం పెట్టుకొని అడ్డదారుల్లో లక్షలు, కోట్లు, ప్రజాధనాన్ని కొల్లగొడుతు న్నారు. దేశాన్ని గుల్ల చేస్తున్నారు. దేశభ క్తుల్ని వెనక్కి నెట్టి దేశభోక్తలు గద్దెలెక్కుతు న్నారు.

ఈ పరిస్థితి కొనసాగితే మనదేశం నువ్వు ఊహించిన మహోన్నత దేశం కాదు. దానికి బదులు మహా అధోగత దేశంగా మారుతుంది.

"సారథిబాబూ! అది తలుచుకుంటే మా బోటి పెద్దవాళ్లకి దిగులుగా వుంది. ఇక మీ బోటి యువకులు నడుంకట్టి అవినీతిని అరి కట్టాలి. ఈ ఇంటి దొంగల గుట్టు రట్టు చేసి జనం ముందు నిలబెట్టాలి. గద్దెలమీద నుంచి కిందికి నెట్టాలి"

"అది కూడా జరుగుతుందిలే తాతయ్యా! జనం మేల్కొంటారు"

హైస్కూలునుండి ఇద్దరూ పశువుల హాస్పిటల్ కి వచ్చారు. అక్కడ ఉత్సాహవం తుడైన డాక్టరు శర్మ పశువులకు శ్రద్ధగా వైద్యం చేస్తున్నాడు.

"నమస్కారం రాఘవేంద్రగారూ! రండి" అంటూ సగౌరవంగా ఆహ్వానించాడు డాక్టరు శర్మ.

"సారథిబాబూ! డాక్టరు శర్మగారు వీర వరం హైస్కూలు విద్యార్థే!" అని సారథికి పరిచయం చేశాడు. సారథి ఆయనకి నమ స్కారం చేశాడు.

వెటర్నరీ హాస్పిటల్ నుండి సారథి, రాఘవేంద్ర సిండికేట్ బ్యాంకు దగ్గరికి వచ్చారు. బ్యాంకులో రాఘవేంద్రకీ, వైదేహికీ ఫిక్సెడ్ డిపాజిట్లున్నాయి.

"నమస్కారం రాఘవేంద్రస్వామి! రండి" అంటూ బ్యాంకు మేనేజరు విద్యాసాగర్ సగౌరవంగా ఆహ్వానించాడు.

రాఘవేంద్ర సారథిని బ్యాంకు మేనేజ రుకు పరిచయం చేశాడు. ముగ్గురూ మేనే జరు గదిలో కూర్చున్నారు.

"ఈ యేడు మీ బ్యాంకుకి వసూళ్లు, డిపా జిట్లు బాగున్నాయా" రాఘవేంద్ర అడిగాడు.

"మీ బోటి పెద్దలు డిపాజిట్లు బాగానే వేశారండి. ఈ ఏడు తొలకరి పంటలు పెసర, నువ్వులు, వేరుసెనగ, మొక్కజొన్న బాగానే పండినాయిగదా! ధరలు కూడా బాగానే వున్నాయి గనుక మాకు వసూళ్లు బాగా వున్నాయి. రబీ పంటలు కూడా

బాగా పండితే మాకు వసూళ్లు బాగా వుండటమేగాక ఫిక్సెడ్‌డిపాజిట్లు బాగా వస్తాయి. రైతులు బాగుంటేనే గదా మా బ్యాంకు కళ కళలాడేది? " అన్నాడు విద్యాసాగర్.

"మీరిద్దరూ మాట్లాడుతూ వుండండి! నేను కౌంటరులోకి వెళ్లి డబ్బు డ్రా చేసుకొని వస్తాను" అని రాఘవేంద్ర లేచి వెళ్లాడు.

రాఘవేంద్ర వచ్చాక "సారథిబాబూ! ఇక వెళ్దామా" అన్నాడు. సారథి బ్యాంకు మేనేజరుతో కరచాలనం చేసి బయటికి వచ్చాడు.



"కమల పిన్నీ బాగున్నావా? " అంటూ అనూరాధ గ్రంథాలయంలో అడుగుపెట్టింది.

"అనూరాధా! ఎప్పుడొచ్చావు? నేను బాగానే వున్నాను"

"నిన్న వచ్చాను పిన్నీ! నాగేశ్వరరావు బాబాయి బాగున్నారా? "

"బాగానే వున్నారమ్మా! ఆయన కూడా ఎక్కువగా లైబ్రరీకే వస్తారు. గతంలో ఇది సీతారామగ్రంథాలయం అనే పేరుతో గ్రామస్థులు ఏర్పాటు చేసుకొని స్వంతంగా నడుపుకుంటున్నపుడు ఆయనే లైబ్రేరియన్‌గా వుండి నిర్వహించేవారు. ఆయనకి ఈ గ్రంథాలయం అంటే ఎంతో ఇష్టం"

"ఉషాబాల లైబ్రరీకి వచ్చిందా పిన్నీ"

"రాలేదమ్మా! కాలేజీ నుండి ఇంకా ఊళ్లోకి రాలేదేమో! వస్తే నీకోసమైనా తప్పకుండా గ్రంథాలయానికి వస్తుంది. మీ ఇద్దరూ కలుసుకునేది ఇక్కడేగా"

అనూరాధ అంటే కమలకెంతో ప్రేమ. సెలవుల్లో వీరవరం వస్తే ఎక్కువగా గ్రంథాలయానికి వచ్చి కమల దగ్గరే వుంటుంది. గ్రంథాలయంలో అనూరాధకు కావలసిన పుస్తకాలు శ్రద్ధగా వెదికి ఇస్తుంది.

"పిన్నీ! నేను 'భారతీయ తత్త్వవేత్తలపై ఉపనిషత్తుల ప్రభావం' అనే అంశం తీసుకొని పిహెచ్.డి. చేయాలనుకుంటున్నాను. అందుకోసం అశ్వఘోషుడి రచనలు, సర్వేపల్లి రాధాకృష్ణన్ రచనలు కావాలి. మన గ్రంథాలయంలో వుంటే వెదికి ఇవ్వాలి పిన్నీ"

"తప్పకుండా వెదికి ఇస్తానమ్మా! నువ్వు పి. హెచ్.డి చేయబోతున్నందుకు నాకు చాలా సంతోషంగా వుంది"

"నాకూ సంతోషంగానే వుంది కమలా! ఆ సంగతి నాకు ముందే తెలుసు!" అంటూ కమల మాట అందుకొంటూ మురళీకృష్ణ లైబ్రరీలోకి వచ్చాడు.

"రండి అన్నయ్యా! మీకు ముందే తెలుసేమో అనూరాధ నాతో ఇప్పుడే అంది"

"మామయ్యా! నిన్న ఉదయం రైల్వే స్టేషన్లో మాట్లాడించే అవకాశమే లేకపోయింది. మీ మిత్రుడు మమ్మల్ని కాలు నిలవనీయలేదు. ఇంటికెప్పుడొచ్చారు? "

"అవునమ్మా! బతిమాలి లాక్కుపోయాడు. ఆ శంకరరావు కూతురుకి నాకు తెలిసివాళ్ల పెళ్లి సంబంధం ఒకటి చర్చల్లో వుంది. సమాచారం కోసం, సలహా కోసం నన్ను తీసుకుపోయాడు. నిన్నంతా నన్ను రానివ్వలేదు. ఈ రోజు ఉదయం నడిచి

వచ్చాను. నిన్న నిన్ను పలకరించటం నాకూ కుదరలేదుగా"

"ఇంతకీ పెళ్లి కుదిర్చారా మామయ్యా"

"ఆడపిల్ల పెళ్లి అంత తొందరగా కుదురుతుందా అనూరాధా! అందులో ఆ శంకరరావు కూతురు రంగు నలుపు. బి.ఏ పాసయింది. ఏదో చర్చ జరుగుతూ వుంది. ప్రయత్నం చేస్తున్నాం"

"మనిషి నలుపైతే ఏం మామయ్యా! మనసు ఎరుపు వుండాలిగాని"

"అలాగా! అయితే నీకు మనిషి నలుపు, మనసు ఎరుపు వున్న సంబంధం వెదుకుతాలే! మా బ్రహ్మన్న నన్నే వెదకమంటాడు"

"మిమ్మల్ని శ్రమ పెట్టనులే మామయ్యా! నేను వెదుక్కోగలను. పాపం శంకరరావు గారి కూతురుకి వెదికి పెట్టండి. నలుపు అని మీరే అంటున్నారుగా"

"అన్నయ్యా! అమ్మాయిలు గడుసువాళ్లు. మాటల్లో గెలవలేం" అంది కమల నవ్వుతూ.

★ ★ ★

"తాతయ్యా! ఈ పూట మనం బ్రహ్మనాయుడుగారి పొలం చూడటానికి వెళ్దామా? మీకు ఓపిక వుందా? సదానందం కూడా రమ్మన్నాడు"

"నాకింతవరకు కాళ్లబాధలు లేవు వెళ్దాం"

"తాతయ్య ఋషిలాంటివారు సారథి బాబూ! ఆహార నియమం పాటిస్తారు. 'తిననేర్చిన వారికి రోగంరాదు. మాట్లాడనేర్చిన వారికి జగడంరాదు' అంటారుగదా! ఆరోగ్యం జాగ్రత్తగా కాపాడుకుంటారు" అంది వైదేహి.

సారథి, రాఘవేంద్ర పొలానికి బయలుదేరారు. ఇద్దరూ మాట్లాడుకుంటూ పొలం దగ్గరికి వచ్చేసరికి బ్రహ్మనాయుడు డొంకకి ఉత్తరంగా ఉన్న చేనులో బావి దగ్గర వున్నాడు. గంగాధరం అనే పాలేరు ఆయన దగ్గరున్నాడు.

బ్రహ్మనాయుడు వారిని చూడగానే ఎదురు వచ్చి రండి! అని ఆహ్వానించాడు. ఆ చేను పదిహేను ఎకరాల్లో పడమటి వైపున నాలుగు ఎకరాలు మాగాణి చేసి వుంది. వరిపైరు చిరుపొట్టదశలో వుంది.

సారథిబాబూ! ఈ పదిహేను ఎకరాల చేలో ఈ వైపు మాగాణి పంటకు అనువైన నేల. అందుకని నాలుగు ఎకరాలు అచ్చుగట్టి మాగాణి చేశాను. నీటి వసతి వుంటే అన్ని రకాల నేలలూ వరి పంటకు అనువుగానే వుంటాయి. మెట్టపంటకి అనువుగా వుండని నేలలు నీటివసతి వుంటే వరి బాగానే పండుతాయి.

నేను ఈ వరి పంటకు వర్షాలు బాగా వున్నపుడు వర్షనీరే పెడతాను వర్షాలు లేనపుడు బావినీరు పెడతాను. అనావృష్టి భయం నాకు లేదు. పైరుకు వర్షపునీరు మంచిది. కనుక సాధ్యమైనంతవరకు అదే పెడతాను.

"వరిపైరు అంతా సమానంగా, నాటబడి నేత్రానందంగా వుందండీ! వరి నాటు కూడా ఒత్తు, పలచన గాకుండా వుండేలాగా చాలు పద్ధతిలో చక్కగా నాటు వేశారు. ఇది జపాను పద్ధతి నాటు" అన్నాడు సారథి.

దక్షిణంగా వున్న చేలోకి వచ్చారు. గంగాధరం కూడా వారితో వచ్చాడు.

ఆ చేను పదిహేను ఎకరాల్లో అయిదు ఎకరాలు తొలకరి పంటగా వేరుశనగ వేసి, అందులో మిశ్రమ పంటగా కంది పెట్టారు. ఎనిమిది చాళ్లు వేరుశనగ, తొమ్మిదవ చాలుగా కంది పెట్టారు. వేరుశనగ మంచి దిగుబడి వచ్చింది. కంది పైరు గుబురుగా కళకళలాడుతూ వుంది.

మిగతా పది ఎకరాల్లో తొలకరి పంటగా పెసరవేసి, అరవైరోజుల్లో ఆ పంట చేతికి వచ్చాక దాన్ని దున్ని బాగుచేస్తున్నారు. అందులో అయిదు ఎకరాల్లో రబీ వేరుశనగ వెయ్యటానికి సిద్ధంచేసి వుంచారు. మిగతా అయిదు ఎకరాల్లో పొద్దుతిరుగుడు పంట వేయటానికి నాగలి దుక్కి దున్నుతున్నారు.

బ్రహ్మానాయుడిది రెండు అరకల వ్యవసాయం. సదానందం ముందు అరక, చిన్న పాలేరు నాగేశు వెనక అరక దున్నుతున్నారు. నాగేశు చాలా చురుకైన యువకుడు. అతనికి సదానందం బాగా శిక్షణ ఇస్తున్నాడు.

"సారధిబాబూ! మనం కాసేపు నాగలి దుక్కి దున్నుదామా?" అన్నాడు బ్రహ్మానాయుడు. వెంటనే సారధి ఉత్సాహంగా "సరే! దున్నుదాం రండి" అన్నాడు.

సారధి పాంటు కొంచెం పైకి మడిచాడు. సదానందం దగ్గర అరక తీసుకున్నాడు. నాగలి ఎలువు, సలువు చూసుకున్నాడు. సదానందం సరిగానే కట్టి వుంచాడు.

బ్రహ్మానాయుడు ధోవతి పైకి దోపి కట్టుకున్నాడు. తలపాగా చుట్టుకున్నాడు. నాగేశు దగ్గర అరక తీసుకున్నాడు. ఎలువు, సలువు చూసుకున్నాడు. కొంచెం ఎలువుగా వున్నదనిపించింది. మోకు వెనక్కి లాగి కట్టి సరిజేసుకున్నాడు.

"సారధిబాబూ! నీ అరక ముందు పోనివ్వు!" అన్నాడు.

నాగలి దుక్కి కోంద్రలు వేసి దున్నుతారు. ముందు అరక దున్నేవాడే కోంద్రలు వేయాలి. అది చూడాలనే బ్రహ్మానాయుడు సారధిని ముందు పోనివ్వమన్నాడు.

సారధి అరకని కోంద్రచాలుకు మలిపాడు. ఈ దరినుండి ఆ దరికి లైను సరిగా చూసుకొని గురితప్పకుండా ముందుచూపు నిలిపి కోంద్రవేశాడు.

సదానందం, రాఘవేంద్రగారు, నాగేశు, గంగాధరం, గట్టున నిలిచి సారధి కోంద్ర వేయటం గమనించారు. కోంద్ర లైనుగా వచ్చింది. అరగంటసేపు ఇద్దరూ అరకలు దున్నటం సాగించారు. సారధి ప్రతి కోంద్ర వంకరపోకుండా లైనుగా వేశాడు.

అరగంట తరువాత అరకలు ఆపారు.

"కోంద్రలు బాగా వేశావు సారధిబాబూ! గడ్డ హెచ్చుతగ్గులు రాకుండా సమానంగానే వేశావు. లైనుగా వేశావు" అని బ్రహ్మానాయుడు అభినందించాడు.

"నిన్న బండి బాగా తోలారు. ఈరోజు నాగలి కోంద్రలు బాగా వేశారు. సారధిగారికి వ్యవసాయం బాగా తెలుసు" అన్నాడు సదానందం.

"పనిలో నైపుణ్యం వుంది. పట్టుదల వుంది. సారధిబాబు మన వీరవరంలో వుండదగిన వ్యక్తి" అన్నాడు బ్రహ్మానాయుడు.

"మీరు కూడా నాగలి దున్నటంలో నేర్పు చూపించారు గదా! అది విశేషమే!"

"సారధిబాబూ! మనం పుట్టింది కర్షక కుటుంబంలో, మన భారత దేశప్రజల ప్రధాన వృత్తి వ్యవసాయం. అందునా అన్నపూర్ణ అన్న బిరుదు వున్న ఆంధ్రరాష్ట్రం మనది. నేను బి.ఏ. చదివే రోజుల్లో కూడా సెలవుల్లో ఇంటికి వచ్చినపుడు అరక దున్నేవాణ్ణి! నాకు వ్యవసాయం అన్నా, తెలుగు సాహిత్యం అన్నా బాగా ఇష్టం."

"అందుకే గదా మీకు వీరవరం కర్షకులు "కర్షకబ్రహ్మ" అన్న బిరుదు యిచ్చారు. నిన్న కూడా నేను ఈ మాట అన్నాను"

"సారధిబాబూ! ఇక ఇంటికి వెళ్దాం పదండి! నేనూ వస్తాను"

ముగ్గురూ కలిసి ఇంటికి వస్తూ దారిలో శేషాద్రినాయుడి ఇంటికెళ్లారు. శేషాద్రినాయుడి కొడుకులు గణపతి, కుమార్ ఆరోజే కాలేజీ నుండి వచ్చారు. అనూరాధ, భారతీదేవి ఆ సమయంలో అక్కడే వున్నారు.

అందరూ హాల్లో కూర్చొని మాట్లాడుకుంటున్నారు.

పొలంనుండి రాగానే బ్రహ్మానాయుడు గణపతిని, కుమార్‌ని పలకరించాడు.

"హాస్టల్ భోజనం బాగుంటున్నదా?" రాఘవేంద్రగారు పిల్లల్ని అడిగాడు.

"ఆ! బాగానే వుంటున్నది తాతయ్యా!" అన్నాడు గణపతి.

"అరే కుమార్! నీ కాలికి ఆ కట్టేమిటిరా!"

బ్రహ్మానాయుడు అడిగాడు.

"రైల్వేస్టేషన్ నుండి వచ్చేటప్పుడు భూపాల్ మామయ్య బండి తోలాడు పెద నాన్నా! మధ్యలో బండి బోల్తాకొట్టించాడు. అన్నయ్యా, నేను దూకేశాం! నాకు కాలికి రాయి తగిలి చిన్న గాయం అయింది" అన్నాడు కుమార్.

"బండి భూపాల్ మామయ్య ఎందుకు తోలాడురా! కాంతయ్య వున్నాడుగా"

"కాంతయ్య వున్నాడు పెదనాన్నా! భూపాల్ మామయ్య బండి నేనే తోలతాన న్నాడు. అప్పుడు కాంతయ్య వద్దండీ! బాట సరిగాలేదు. బండి తోలటం మీకు కొత్త అన్నాడు. అయినా భూపాల్ మామయ్య వినలేదు. బండితోలటం గొప్ప విద్యా! నేను తోలలేననుకున్నావా? అని తానే తోలాడు. మధ్యలో ఒకచోట మలుపు తిప్పటం చేత కాక బోల్తా కొట్టించాడు" అన్నాడు కుమార్.

అది విని బ్రహ్మానాయుడు నవ్వాడు.

"భూపాల్! బండి తోలటం గొప్ప విద్యేరా! కాదని ఎందుకనుకున్నావు? అది రథసారథ్యం లాంటిది. రైతులు తోలే బండి కూడా రథంలాంటిదేరా! రథానికి గుర్రాలుం టాయి. బండికి ఎడ్లు వుంటాయి.

బండి తోలటమైనా, రథం తోలటమైనా నేర్చుకున్నవారే తోలగలుగుతారు. అది గొప్ప విద్యే! మహాభారత కథలో కృష్ణుడు, శల్యుడు, గొప్ప రథసారథులని పేర్కొ న్నారు. బండి తోలటంలో కొందరు రైతులు గొప్ప నేర్పు చూపిస్తారు.

"తేరు గడపగ మాయన్నదిద్దె నన్ను" అని చెప్పి సుభద్ర అర్జునుడి రథం నడిపిందట! ఆమె అన్న కృష్ణుడు ఆమెకు నేర్పితేనే గదా రథం తోలగలిగింది!

ఈ సారథిబాబు చూడు! నిన్న మా బండి ఎంత నేర్పుగా తోలాడో! తను నేర్చు కోబట్టే తోలగలిగాడు" అన్నాడు బ్రహ్మానా యుడు.

"పోనీలే! పెద్దగా దెబ్బలు తగలలేదుగదా సంతోషం" అన్నాడు రాఘవేంద్రగారు.

'ఈ కుమార్‌గాడి చిన్న గాయం అందరి ముందు నా పరువు తీసిందే' అని భూపా లరావు లోలోన చిరాకు పడ్డాడు.

'అందరిలో తన కొడుకు అసమర్థత బయ టపడినందుకు, అందునా అనూరాధ ముందు అవమానం జరిగిందే' అని కమ లాంబ కలత చెందింది. పైగా కొత్తగా వచ్చిన సారథిని ప్రత్యేకంగా బ్రహ్మానా యుడు మెచ్చుకోవటంతో ఈర్ష్య కలిగింది. ఇక ఊరుకోలేకపోయింది.

"చదువుకున్న వాళ్లకి బండి తోలటం ఏం చేతనవుతుంది. మా భూపాల్ బండి తోల కుండా వుండాల్సింది. చదువు అబ్బని వాళ్ళకి బండ్లు తోలటాలు, అరకలు దున్న టాలు, వ్యవసాయం పనులు, బాగా పట్టుబ డతాయి. మా వాడికేం చేతనవుతుంది" అని దీర్ఘాలు తీసింది కమలాంబ.

తన కొడుకు ఎం.ఏ. చదివినవాడనీ, సారథికి అంత చదువు లేదుగనుక బండి తోలటం చేతనయిందనీ, మర్మగర్భంగా ఎత్తి పొడిచింది.

"అమ్మమ్మా! కృష్ణుడు రథం తోలటంలో నిపుణుడని పెదనాన్న చెప్పారు గదా! కృష్ణు డికి చదువు అబ్బలేదంటావా" అన్నాడు గణ పతి.

"అమ్మమ్మా! మా నాన్నకి, పెదనాన్నకి బండి తోలటం, అరక దున్నటం, బాగానే వచ్చు! ఆ ఇద్దరికీ చదువు అబ్బలేదా? " అన్నాడు కుమార్.

'ఈ పిడుగులిద్దరూ ప్రశ్నమీద ప్రశ్న లేస్తున్నారే!' అనుకున్నది కమలాంబ చిరాకు పడుతూ.

"సారథిబాబుని ఎండలో తిప్పుతున్నారా! మొగం కంది పోయినట్లుందే? " అన్నది శాంతమ్మగారు సారథివైపు చూసి.

"అమ్మమ్మా! నాకు పొలంలో తిరిగే అల వాటుందిలే" అన్నాడు సారథి.

'ఈ ముసలమ్మకి కొత్తబ్బాయిమీద తెగ

ప్రేమ పుట్టుకొచ్చిందే! అతగాడేమో వరస గూడా సరిగా కలిపి అమ్మమ్మా అంటు న్నాడు. నా ప్రయత్నం సాగకుండా వీడొ కడు దాపురించాడే!' అని కమలాంబ లోలోన ఉడుక్కుంటున్నది.

"అమ్మా! పొలంలో తిరిగే అలవాటే కాదు. ఈ పూట సారథిబాబుతో మన పొలంలో నాగలి దున్నించాం! కోంద్రలు చక్కగానే వేశాడు. పనితనం చూపించాడు" బ్రహ్మానాయుడు తల్లితో చెప్పాడు.

"ఏంటీ! కోమలంగా కనపడే యీ సారథి బాబు కోంద్రలు వేశాడా! మంచి పనితనమే 'కోటివిద్యలైనా కోంద్రకులోకువే' అన్నారు మన పెద్దలు" అని శాంతమ్మగారు మెచ్చు కున్నది.

'ముక్కుమొగం తెలియని కొత్తవాణ్ణి పొగ డ్తలతో ముంచెత్తుతున్నారే!' అని కమలాం బకి మరీ కంపరం పుట్టుకొచ్చింది.

కాసేపు ఇష్టాగోష్టిగా మాట్లాడుకొని అందరూ వెళ్ళిపోయారు.

★ ★ ★

ఆరోజు కూడా రాత్రి భోజనాలయ్యాక భారతీదేవి, బ్రహ్మానాయుడు, అనూరాధ, సదానందం అక్కడికి వచ్చారు.

యధారీతి ఇష్టాగోష్టి మొదలయింది.

"సారథిబాబూ! తాతయ్యతో కలిసి పొలం వెళ్ళివచ్చావుగదా! ఎలా వున్నాయి మా వీరవరం పొలాలు? పైరులెలా వున్నాయి? "

"అందరి పొలాలు చూడలేదమ్మమ్మా! ఈ పూట మన బ్రహ్మానాయుడి పొలాలే చూశాను. తూర్పు పొలంలో డొంకకి ఉత్త రంగా, దక్షిణంగా వున్న రెండు చేలూ చూశాను. సుజలాం, సుఫలాం, సస్యశ్యా మలాం అన్నట్లుగా వారి పొలాలు వున్నాయి. మన పురాణాల్లో శివుడు గంగని తన జటాజూటంలో బంధించాడని వుంది.

బ్రహ్మానాయుడుగారు భగీరథుడులాగా ప్రయత్నించి బావులు తవ్వించి గంగని ఆవి ర్భవింపజేశారు.

మహాకవి శ్రీశ్రీ అన్నట్లు ఆ బావులలోని జలాలను కరెంటు మోటార్లతో పొలాలపై ప్రవహింపజేసి ఇలాతలంపై హేమం పండి స్తున్నారు. వీరవరంలో వారికి వున్న బిరు దుకు తగినట్లే వారి వ్యవసాయక్షేత్రం వుంది. అది మాలాంటి వాళ్ళకి 'గురుకులం' వంటిదే అమ్మమ్మా!"

"అమ్మా! నువ్వు రైల్వేస్టేషనుకి పంపిన పులిహోర, గడ్డపెరుగు మంచి ఫలితాన్ని అందించింది. సారథిగారు నిన్న నిన్ను పొగిడారు. ఈరోజు నాన్నని పొగుడుతు న్నారు" అన్నది అనూరాధ నవ్వుతూ.

ఇలా మాట్లాడుకుంటూ వుండగానే ముర ళీకృష్ణ అక్కడికి వచ్చాడు.

సారథి ఆయన్ని చూడగానే "నమస్కారం బాపూజీ! రండి" అన్నాడు.

"ఎలా వున్నావు సారథిబాబూ! వీరవరం వెదుక్కుంటూ కొత్తగా వచ్చావు. అప్పుడే మా రాఘవేంద్ర మామయ్యకి, వైదేహి అత్త య్యకి, సన్నిహితుడివైనావు. ఆ కుటుం బంలో ఒకడిగా కలిసిపోయావు. మా బ్రహ్మన్న కుటుంబానికి కూడా సన్నిహితుడి వయ్యావు.

విద్య, వివేకం, సౌందర్యం, సంస్కారం వున్నవాళ్లు ఎక్కడికి వెళ్లినా జన్మస్థాన సౌఖ్యోన్నతులు అందుతాయని రామరాజ భూషణులు అన్నాడు. అది నిజమని నువ్వు నిరూపించావు సారథి బాబూ"

"యేం మామయ్యా! సారథిగారిని కావ్యంలో కథానాయకుణ్ణి చేసి పొగుడుతు న్నావు. తెలుగు పండితుడివనిపించావు" అంది అనూరాధ చిరునవ్వుతో.

"అనూరాధా! సారథిబాబుని నేను ఊరికే పొగడటంలేదు. ఒక్కసారి పరిచయంతోనే సారథిబాబు నాకెంతో సన్నిహితుడ య్యాడు. సారథి బాబులో వున్న విశిష్టత అదే! కావ్యనాయకులైనా, కథానాయకులైనా,

ఇటువంటివారే! అయితే ఈ సారథిబాబు వీరవరం రావటం, నేను వీరవరం నుండి కొండపల్లి హైస్కూలుకు ట్రాన్స్‌ఫర్ కావటం ఒక్కసారే జరిగింది. అందుకు విచారంగా వుంది. అయినా ఉద్యోగం చేసేవాళ్ళం. ప్రభుత్వం ఎక్కడికి వెళ్ళమంటే అక్కడికి వెళ్ళటం మా విధి. నన్ను ఫలానాచోటికే వెయ్యమని అడగను. రికమెండేషన్ చెయ్యమని ఎవరినీ ప్రాధేయపడను. వాళ్ళెక్కడికేస్తే అక్కడికి వెళ్తాను. నా విధి నేను బాధ్యతగా నిర్వర్తిస్తాను. ఉద్యోగధర్మాన్ని విస్మరించను" అన్నాడు మురళీకృష్ణ.

"ఆదర్శవంతమైన పద్ధతి మీది. అందుకు మిమ్మల్ని అభినందిస్తున్నాను బావూజీ!" అన్నాడు సారథి.

"నేను రేపు కొండపల్లి వెళ్తున్నాను బాబూ! అక్కడ ఇల్లు చూసుకోవాలిగదా! నీకు చెప్పిపోదామని ఇటు వచ్చాను"

"కొండపల్లి మనకు దగ్గరే గదరా మురళీ! వస్తూ పోతూ వుండొచ్చుగా. చరిత్రాత్మకమైన కొండపల్లి ఖిల్లాని సారథి బాబుకు ఒకసారి చూపెట్టు" అన్నాడు బ్రహ్మానాయుడు.

"చూపెట్టకుండా వుంటానా బ్రహ్మన్నా! తప్పకుండా చూపెడతాను"

కొంతసేపు మాట్లాడుకొని గోష్టి ముగించి అందరూ బయలుదేరారు.

"అత్తయ్యా! రేపు రాత్రి భోజనాలు చేశాక సారథిబాబు, మీరు మా ఇంటికి రండి" అంది భారతీదేవి.

★ ★ ★

ఉదయం అయిదుగంటలకి రాఘవేంద్రగారు, సారథి, వాకింగుకి బయలుదేరారు. వారికి మళ్ళీ తూర్పుడొంకలో సదానందం, నాగేశు, అరకలతో వెళ్తూ కలిశారు.

"సారథిగారూ! ఈరోజు మా పొలంలో మధ్యాహ్నంనుండి అయిదెకరాల్లో వేరుసెనగ విత్తనం ఎదబెడతాం. మీరూ, తాతయ్యగారూ తప్పకుండా రండి" అన్నాడు సదానందం.

"మర్చిపోకుండా రండి సారథిబాబుగారో! మీరు ఎదగొర్రు దున్నుతుంటే సూడాలనుంది" అన్నాడు చిన్నపాలేరు నాగేశు.

"తప్పకుండా వస్తాం. నాకూ ఎదగొర్రు దున్నాలని వుంది"

"సారథిగారూ ఈపూట మీరు మా తోట చూసిరండి. పడమటిపొలంలో యేటిపక్కన మా తోట వుంది" అన్నాడు సదానందం.

"అలాగే సదానందం! తాతయ్యగారితో కలిసి వెళ్తాను

సదానందం అరకలతో వెళ్ళిపోయాడు. సారథి, రాఘవేంద్రగారు కొంత దూరం నడిచి వెనక్కి తిరిగి ఊరు ముందుకు వచ్చారు.

"తాతయ్యా! ఈ పూట ఈ పక్కవీధి నుండి వెళ్దాం. ఊరు చూసినట్లుగా వుంటుంది"

"అలాగే వెళ్దాం. నేను ఈ వీధినుండి ఎక్కువ నడవను. ఈ వీధిలో మా కుటుంబంమీద కక్షగట్టిన నాగరాణి అనే ఆమె ఇల్లు వుంది. అయినా నువ్వు వెళ్దామని అడిగావు గనుక వెళ్దాం"

"ఆ నాగరాణిగారు మీ కుటుంబం మీద కక్ష గట్టిందెందుకో నాకు తెలుసు తాతయ్యా! మురళీకృష్ణగారు ఆ కథ అంతా నాకు చెప్పారు"

సారథి, రాఘవేంద్రగారు నాగరాణి ఇంటి ముందుకు వచ్చారు. అప్పుడు టైము ఉదయం ఆరుగంటలు కావస్తుంది. నాగరాణి సరస్వతి అనే ఆమెతో కబుర్లలో మునిగివుంది.

ఆ సరస్వతి ఇల్లు నాగరాణి ఇంటిపక్కనే వుంది. ఆమెకి ఊళ్లో వార్తలన్నీ సేకరించే అలవాటుంది. అందరూ ఆమెని వార్తల సరస్వతి అంటారు.

ఇంటి పొరుగున వున్న నాగరాణికి ఎప్పటికప్పుడు ఊళ్లో వార్తలు అందిస్తుంది. అప్పుడా కబుర్లే నాగరాణికి అందిస్తూ

వుంది.

తెల్లవారగానే కబుర్లలో మునిగివున్న ఆ తెలుగింటి ముదితలిద్దరినీ చూసి ముసి ముసి నవ్వులతో రాఘవేంద్రగారు ముందుకు సాగాడు.

సారథిని, రాఘవేంద్రగారిని చూసి ఆ ఇద్దరూ కబుర్లు ఆపారు.

నాగరాణి సారథివైపు వింతగా చూసింది. ఈ ఇద్దరూ ఈ వీధికెందుకు వచ్చారబ్బా! ఈ యువకుడెవరో? అనుకుంది. వాళ్ళు కొంచెం ముందుకెళ్లాక,

"సరస్వతీ! ఆ వశిష్టమునీంద్రుల వారి వెంట నడిచే రాకుమారుడెవరే? "

"అతడా నాగరాణీ! హైదరాబాదులో బ్రహ్మానాయుడుగారికి రైల్వేస్టేషన్‌లో కలిశాడంట. వారితో కలిసి వీరవరం చూడాలని వచ్చాడట. రాఘవేంద్రగారి ఇంట్లో అతిథిగా వుంటన్నాడట. పేరు సారథి అట"

"ఈ వీరవరంలో ఇతడు చూడదగ్గ విశేషాలేంటబ్బా! ఇది పుణ్యక్షేత్రం కూడా కాదే! ఎందుకు వచ్చినట్లో"

"ఈ సారథి వీరవరం వస్తూనే బ్రహ్మానాయుడుగారి బండిని స్టేషన్‌నుండి తోలాడట నిన్న బ్రహ్మానాయుడుగారి పొలంలో నాగలి బాగా దున్నాడట. బ్రహ్మానాయుడు గారు ఆ విషయం తల్లికి చెప్పాడట. తల్లి, కొడుకు ఇద్దరూ ఈ సారథిని తెగమెచ్చుకున్నారట"

"ఓయబ్బో! కథ చాలా వుందే! మనిషి కూడా సుందరాకారుడేనే! సరస్వతీ! అ కథంతా నీకెవరు చెప్పారే? "

"నాకు రాత్రి శేషాద్రినాయుడి అత్త కమలాంబ చెప్పింది. అప్పటికి నువ్వు నిద్రబోయ్యావని పిలవలేదు"

"కమలాంబ ఎప్పుడు వచ్చింది? "

"మూడు రోజులైంది. భర్తతో, కొడుకుతో కలిసి వచ్చింది. కమలాంబ కొడుకు ఎం.ఏ. పాసయ్యాడు. మొన్న ఈ వీధినే వెళ్ళాడు నువ్వు చూశావు. పలకరించాను కూడా"

"అవునే! చూశాను. పలకరించాను కూడా. నాకు కమలాంబ వచ్చిందని తెలియదు. కమలాంబ కొడుకు మనిషి బాగానే వున్నాడు. కాని విగ్రహపుష్టికి తగిన వివేకం లేనట్లుందే! పలకరించి వివరాలు అడిగాను. అడిగినదానికి అతడు సమాధానం చెప్పిన తీరు ప్రసన్నంగా, సవినయంగా లేదు. అంతా యాంత్రికంగా వుంది. లౌకికం కల వాడు కాదనిపించింది.

కమలాంబ గడుసుదే సరస్వతీ! అనూరాధమీద, బ్రహ్మానాయుడి ఆస్తిమీద కన్నేసినట్లుంది. కుటుంబంతో కలిసి వచ్చిందంటే ఆలోచన అదే"

"నాక్కూ అంతే అనిపించింది నాగరాణీ! ఆ సారథిని బ్రహ్మానాయుడుగారు మెచ్చుకోవటం మింగుడు పడలేనట్లుంది. మూతి విరుపుతో చెప్పింది"

"ఆ అవతార పురుషుడు కమలాంబకి అవకాశమివ్వడులే సరస్వతీ"

ఇంతలో నాగరాణి కూతురు ఉషాబాల తన గదినుండి బయటికి వచ్చింది. గదిలో పడుకొనివుండి వాళ్ళ సంభాషణ విని లేచి వచ్చింది.

"అప్పుడే లేచావేం పాపా! పడుకో అమ్మా" అంది నాగరాణి.

"వార్తలకోసం లేచానమ్మా"

"అప్పుడే ఏం వార్తలే! ఆరుగంటలేగా అయింది"

"ఆరు గంటలకు సరస్వతి అత్తయ్య గ్రామవార్తలు, నీ వ్యాఖ్యలు వుంటాయిగా"

"విన్నావా సరస్వతీ! పాప మాటలు? "

"మన కబుర్లు దానికి చిరాకు కలిగించాయిలే" అంది సరస్వతి నవ్వుతూ.

"అమ్మా! తాతయ్యని వశిష్టమునీంద్రుల వారు అనీ, పెదనాన్నని అవతార పురుషుడు అనీ, తాతయ్య వెంటవున్నది రాకుమారుడు అనీ పేర్లు పెట్టటం బాగుందా? దారినపోయే వాళ్ళని వెక్కిరించడం ఎందుకు? "

"అందుకా నీ కోపం! అది వెక్కిరించటం కాదే! అరుంధతీ వశిష్ఠులు అని ఆ దంపతులకి ఊళ్ళోవాళ్లే బిరుదు పేర్లు పెట్టారు. నేను పెట్టిన పేరు కాదది. ఆ కొత్త అబ్బాయి పేరు ముందు తెలియక రాకుమారుడు అన్నాను. అతడు ప్రత్యేకమైన వర్ణంతో రాకుమారుడిలాగే వున్నాడని అలా అన్నాను. అది వెక్కిరింపు కాదు. పేరు సారథి అని సరస్వతి తరువాత చెప్పింది.

ఇక ఈ బ్రహ్మానాయుడు అలనాటి పలనాటి బ్రహ్మానాయుడి అవతారం కనుకనే మాల సదానందాన్ని కన్నమదాసులాగా పెంచుకున్నానని అనుకుంటున్నాడు. అందుకే అవతార పురుషుడన్నాను. అదేం తిట్టుకాదు"

"అమ్మా! అనాథగా వున్న సదానందాన్ని జాలిపడి చేరదీసి, ప్రేమగా ఇంట్లోనే అన్నం పెట్టి పాలేరుగా పనిచేయించుకుంటే అది పెంచుకున్నట్లా? మాటవరసకి దత్తపుత్రుడి లాంటి వాడని పెదనాన్న అంటూ వుంటాడు. అంతేగాని దత్తత చేసుకున్నాన న్నాడా? పెంచుకుంటే మాత్రం తప్పా?

ఆ మాటకొస్తే మన కొండయ్యా నిన్ను అమ్మా అని పిలవటంలేదా? నువ్వు కూడా కొండయ్యని కొడుకులాగే ప్రేమగా చూడటం లేదా?

సదానందం మాల అయితే, మన కొండయ్య బి.సి. తెగకు చెందినవాడు. అంతే తేడా. ఏ కులమైతే యేం? కావాల్సింది సంస్కారం, నిజాయితీ.

ఎంచి చూడ ప్రపంచమందున మంచి చెడ్డలు రెండె కులములు.

మంచి యన్నది మాలయైతే మాలనే యగుదున్ అన్నాడు గురజాడ. నాకంటే జీవితానుభవం వున్నదానివి. చదువుకున్న దానివి.

నువ్వు అలా అనకూడదమ్మా"

'ఆహా, నాకే నీతులు చెప్పే స్థాయికి ఎదిగింది నా కూతురు' అని లోలోన ఆనందించింది నాగరాణి. విని మౌనంగా వుంది.

'ఎంత చక్కగా మాట్లాడింది ఉషాబాల' అనుకున్నది సరస్వతి కూడా.

★ ★ ★

వాకింగునుండి రాగానే సారథి "అమ్మమ్మా! ఈపూట మేము కొత్త బజారున వచ్చాం. ఆ బజారు చాలా పొడవుగా వుంది. ఇరువైపులా వ్యవసాయ కుటుంబాల వారే వున్నారు. ప్రతి ఇంటిముందు పాడిగేదెలు, ఎడ్లు, బండ్లు వున్నాయి. ప్రతి ఇంటి ఆవరణ శుభ్రంగా ఊడ్చి పేడనీళ్లతో కళ్లాపి చల్లి అందంగా ముగ్గువేసి వుంది. ప్రతి ఇంటి ఆవరణ విశాలంగా వేపచెట్లు, చింత చెట్లు, కొబ్బరిచెట్లతో వుంది. ప్రతి ఇంటిలోను స్త్రీలు, పురుషులు పెందలకడనే లేచి సందడిగా పనులు చేసుకుంటున్నారు. అసలైన పల్లెటూరు వాతావరణం ఆ బజారునే వుందమ్మమ్మా. అది అన్నదాతల బజారు."

"ఏమిటి? నాగరాణి ఇంటి బజారున వచ్చారా? "

"అటే వచ్చాం. నాగరాణి, సరస్వతి కబుర్లు చెప్పుకుంటున్నారు"

"సారథిబాబుతో కలిసి అటెందుకు వచ్చారు? "

"సారథిబాబు ఆ వీధి చూడాలన్నాడు. ఏ వీధిన రావటానికైనా మనకేం భయం? సారథిబాబు మన ఇంట్లో రహస్యంగా వుంటున్నాడా? "

సారథి, రాఘవేంద్ర, అల్పాహారాలు, కాఫీ, తీసుకుని బ్రహ్మానాయుడిగారి తోటకి బయలుదేరారు. ఊళ్లోనుండి తోటదాకా డొంక బాట వుంది. ఇద్దరూ తోట దగ్గరికి వచ్చి, తూర్పుగా వున్న గేటునుండి తోటలోకి వెళ్లారు. గేటు పైభాగంలో ఎర్రని అక్షరాలతో 'ఆనందవనం' అని పేరుంది. ఆ అక్షరాలు తోటలోకి వచ్చేవారికి స్వాగతం చెబుతున్నట్లుగా వున్నాయి

తోటలో వున్న వీరన్న వారిని చూడగానే

గేటు దగ్గరికి వచ్చాడు. "రండి బాబాయి గారూ! సారథిబాబు గారికి తోట చూపించ టానికి తీసుకువచ్చారా? " అంటూ వీరన్న వారిని సగౌరవంగా ఆహ్వానించాడు.

"అవును వీరన్నా! సారథిబాబు తోట చూడాలన్నాడు, తీసుకువచ్చాను" అని.

"సారథిబాబూ! ఈ వీరన్న తోటకి సంర క్షకుడు. మన బ్రహ్మనాయుడికి సమవయ స్కుడు. ఈ వీరన్న భార్య వెంకటమ్మ కూడా బ్రహ్మనాయుడి పనిలోనే వుంటుంది. వారి ఆవరణలోనే పాలేర్లకోసం నిర్మించిన రెండు నివాసగృహాలలో ఒక విభాగంలో వీరన్న, వెంకటమ్మ దంపతులుంటారు. మరొక విభాగంలో గంగాధరం, అతని భార్య శంకరమ్మ వుంటారు సారథిబాబూ"

రాఘవేంద్ర, వీరన్నలతో కలిసి సారథి తోట అంతా తిరిగాడు. ఆ తోటలో జలస మృద్ధిగల బావి వుంది. కరెంటు మోటరు, షెడ్డు వుంది. ప్రత్యేకంగా సిమెంటు రేకు లతో వేసిన చిన్న కుటీరం వుంది. తోటకి కాపు సీజనులో రాత్రుళ్లు కాపలా అవసరమై నపుడు ఆ కుటీరం అవసరం అవుతుంది. అందంగా నిర్మించిన ఆ కుటీరం తోటకి మరింత అందాన్ని తెచ్చింది.

"తాతయ్యా! ఈ తోట ఆనందవనం అన్న పేరుకు తగ్గట్లే వుంది. నిజంగా ఇది ఆనం దవనమే"

★ ★ ★

అనూరాధ గ్రంధాలయానికి వచ్చి స్త్రీల విభాగంలో కూర్చుని, వ్యాసదర్శనం అనే పుస్తకం తీసుకుని చదువుతున్నది. మహర్షి వేదవ్యాసుని రచనలు,ఆయన భావాలు, కవి తాశక్తి అన్నీ సమీక్షచేస్తూ రాసిన గ్రంధం అది.

"అక్కా బాగున్నావా? " అన్న పిలుపు విని తలెత్తి చూసింది.

ఎదురుగా ఉషాబాల

"ఉషాబాలా! కాలేజీనుంచి ఎప్పుడొ చ్చావే? "

"నిన్న వచ్చానక్కా. నువ్విక్కడ కలుస్తా వని ఇటు వచ్చాను. ఊరులో వున్నా మనం కలిసిమెలిసి తిరిగే వీలు లేనందుకు బాధగా వుందక్కా"

"బాధపడకు ఉషాబాలా మీ అమ్మలో ఇకముందు వయసునుబట్టి పరిణామాత్మక మైన మార్పు రాకపోదు. మనం కలిసిమె లిసి తిరిగేరోజు తప్పక వస్తుంది. మా నాన్న ఎప్పుడూ మనం కలవాలనే కోరుకుం టారు. నువ్వు ప్రయత్నిస్తే ఫలితం వుండొచ్చు తల్లిగా ఆమెను గౌరవించు. అది తప్పుకాదు. అది నీ బాధ్యత కూడా"

"ఆహా! అక్కా, చెల్లెలు కుటుంబ ఐక్యత గురించి చేసే చర్చ హర్షణీయంగా వుందమ్మా" గ్రంధాలయాధికారి కమల మందహాసంతో అన్నది"

"మీబోటి శ్రేయోభిలాషుల సహకారం కూడా కావాలి పిన్నీ" అంది ఉషాబాల.

"మా సహకారం మీకు ఎప్పుడూ వుంటుందమ్మా. మీరు ఒకే వంశంలో పుట్టి నవాళ్లు. మీలో ప్రవహించే రక్తమే మిమ్మల్ని ఒకటిగా చేస్తుంది. నాగరాణికి ఇష్టంలేకపో యినా ఇప్పుడు మీరిద్దరూ మాట్లాడుకుంటు న్నారుగదా. ఇకముందు బహిరంగంగా కలిసి తిరిగే ధైర్యం సహజంగానే వస్తుంది. ధైర్యంగా వుండు ఉషాబాలా. నువ్వు ప్రయ త్నిస్తే మీ అమ్మలో మార్పు వస్తుంది"

"నిజమే పిన్నీ! మీ సలహా పాటిస్తాను, ప్రయత్నిస్తాను"

★ ★ ★

తోటనుండి వచ్చి భోజనం చేసి గదిలో పడుకున్న సారథి మధ్యాహ్నం రెండుగంట లకు లేచి బయటికి వచ్చాడు.

"అప్పుడే లేచావేం బాబూ, రెండుగంటలే అయింది" అన్నది వైదేహి.

"ఈరోజు పొలానికి కొంచెం ముందుగా వెళ్లాలమ్మమ్మా. బ్రహ్మనాయుడుగారి పొలంలో వేరుశనగ విత్తనం వేస్తారు. అది వాళ్లు వేసే విధానం చూస్తాను. నాకు దారి

తెలుసు. నేను ఒక్కణ్ణే వెళ్తాను. తాతయ్య ఎండలో రాలేరు"

"నేనూ వస్తాలే బాబూ! ఇంటి దగ్గర నాకూ ఏమీ తోచదు. రాగలనులే"

అల్పాహారాలు తీసుకుని టీ తాగి, సారథి, రాఘవేంద్రగారు బయలుదేరారు. ఇద్దరూ చేనుకి వచ్చేసరికి అక్కడ అరకలు సిద్ధంచేసి జడ్డిగాలు కట్టబోతున్నారు. ఆపూట వేయ బోయే ఐదు ఎకరాలకు వేరుశనగ విత్తనం రెండువందలయాభై కిలోలు తెచ్చారు. అది రబీ పంట.

ఇద్దరు కూలీలను ఎదపెట్టడం కోసం పిలి చారు. సుశీలమ్మ అనే మహిళ, రాములు అనే పురుషుడు, ఇద్దరూ బ్రహ్మానాయుడు గారి పొలాలకు ఎదపెట్టటానికి వాళ్లే వస్తారు. గ్రామాల్లో విత్తనాలు ఎదపెట్టే పనిలో స్త్రీలు కూడా నేర్పుగా పెడతారు. పురుషులకేమీ తీసిపోరు. సుశీలమ్మ, రాములు ఇద్దరూ ఎదపెట్టటంలో మంచి నేర్పరులే.

సదానందం మిత్రుడు దేవేంద్ర ఆరోజు వారికి ఎదగొర్రుతో బాడిగకు వచ్చాడు. రైతులకు తన అరకతో బాడిగకి రావటం అతని వృత్తి. మంచి నిపుణుడు.

బ్రహ్మానాయుడు దేవేంద్రని, సదానం దాన్ని ఎదగొర్రులు కట్టమన్నాడు. నాగేశుని, కాంతయ్యనీ గుంటకలు కట్టమన్నాడు. కాంతయ్య శేషాద్రినాయుడి పాలేరు. విత్తనం వేసే పని వుందని వారి అరక సహాయంగా వచ్చింది.

సదానందం, దేవేంద్ర ఇద్దరూ ఎదగొర్రు లకు జడ్డిగాలు కట్టారు. సుశీలమ్మ ఒడికట్టు కుని విత్తనాలు పోసుకుని సదానందం గొర్రుకి ఎదపెడుతున్నది. రాములు ఒడిక ట్టుకుని విత్తనాలు పోసుకుని దేవేంద్ర గొర్రుకి ఎదపెడుతున్నాడు. గంగాధరం గట్టున నిలబడి చుట్టు చుట్టుకి విత్తనాలు కొలిచి ఎదపెట్టేవాళ్లకి ఒడిలో పోస్తున్నాడు. ఆ దరికిపోయి ఈ దరికి వేస్తే అరకకి అది ఒక చుట్టు.

సారథి, బ్రహ్మానాయుడు గట్టున నిలిచి పరిశీలిస్తున్నారు. సదానందం, దేవేంద్ర ఇద్దరూ ఎదగొర్రులు మంచి పనితనంగా దున్నుతున్నారు.

"సారథిబాబూ! పట్టండి ఎదగొర్రు. ఇక సూపెట్టండి పనితనం. మీరెట్టా దున్ను తారో సూడాల" అన్నాడు చిన్నపాలేరు నాగేశు.

సారథి పాంటు కొంచెం పైకి మడిచి, సదానందం చేతిలో ముల్లుగర్ర అందుకుని అరక చేతికి తీసుకున్నాడు.

బ్రహ్మానాయుడు ధోవతి పైకి దోపి కట్టి, తలపాగా చుట్టి, దేవేంద్ర దగ్గర అరక చేతికి తీసుకున్నాడు.

"ఈ బాబుగారికి ఎదగొర్రు దున్నటం వచ్చా?" అన్నది సుశీలమ్మ.

"చూస్తూవుండు సుశీలమ్మా. సారథిబాబు గొర్రుకే ఎదపెడతావుగా. వచ్చునో, రాదో నీకే తెలుస్తుంది" అన్నాడు బ్రహ్మానా యుడు.

సారథి, బ్రహ్మానాయుడు, కొంతసేపు ఎద గొర్రులు దున్నారు. ఇద్దరూ తడబాటు లేకుండా, చాళ్లు వంకరపోకుండా తమ పనిత నాన్ని చూపారు. అప్పటికి సగం పొలంలో విత్తనం వేయటం పూర్తి అయింది. అర కలు కొంతసేపు ఆపారు. అలా మధ్యలో అరకల్ని విశ్రాంతిగా ఆపటాన్ని 'అర పొంటె' అంటారు. పొంటె అంటే రైతుల పరిభాషలో పూట.

"బాబుగారు ఎదగొర్రు బాగా దున్నారు" అన్నది సుశీలమ్మ.

"సారథిబాబూ! మా బ్రహ్మానాయుడికి పొలం ఎక్కువ వుండటం ముఖ్యంకాదు. తక్కువ పొలంలో ఎక్కువ దిగుబడి సాధిం చాలంటాడు. ఇప్పుడు తనకు వున్న నలభై ఎకరాల పొలంలో ఎనభై ఎకరాల్లో వచ్చి నంత ఆదాయం వస్తున్నది. పాడి, పంట, పశువులు, ఎడ్లు, బండ్లు, పాలేళ్లతో బ్రహ్మానా

యుడి ఆవరణ ఒక పరిశ్రమలాగే కళకళ లాడుతూ వుంటుంది" అన్నాడు రాఘవేంద్ర.

"మీరన్నది నిజం తాతయ్యా! ఈ దేశంలో ప్రతి కర్షకుడు బ్రహ్మానాయుడుగారిలాగే వ్యవసాయం చేస్తే, స్వయంకృషితో జల వనరులు సమకూర్చుకుంటే ప్రభుత్వ సహకారం కూడా వుంటే మనదేశం జపాన్, అమెరికా, వంటి దేశాలతో సరితూగుతుంది. మన పల్లెసీమలు భాగ్యసీమలవుతాయి"

"బాబాయ్! బావి దగ్గరికి పోదాం రండి. కాళ్లుచేతులు కడుక్కుని మంచినీళ్లు తాగి కాసేపు మాట్లాడుకుందాం"

ముగ్గురూ బావి దగ్గరకు వచ్చారు. బకెట్‌తో నీళ్లు తోడుకుని కాళ్లు, చేతులు, ముఖాలు కడుక్కుని అక్కడ కుండలోవున్న మంచినీళ్లు తాగారు. బావి దగ్గరలోనున్న కుటీరంలో కూర్చున్నారు.

"ఇక్కడ రైతులు దొరపొగాకు వేస్తారా? " అన్నాడు సారథి.

"వీరవరంలో కొందరు దొర పొగాకు వేస్తారు. ఇద్దరు ముగ్గురు రైతులు నాటు పొగాకు కూడా వేస్తారు. నేను మాత్రం ఏ పొగాకూ వెయ్యను. సమాజ శ్రేయస్సు కోరే వారు ఎవరూ అటువంటి పైరులు వెయ్యకూడదని నా సిద్ధాంతం నేను ఆ నియమం పెట్టుకున్నాను.

"సారథిబాబూ! పొగాకు మానవజాతికి పగాకు. అది ఆకలి తీర్చేదా, ఆరోగ్యం కూర్చేదా? మానవజాతిని మరణంవైపు నడిపించే పొగాకును అన్నదాతలన్న పేరున్న రైతన్నలు వేయకూడదు.

"మీ అభిప్రాయాలు, ఆచరణ ఆదర్శంగా వున్నాయి" అన్నాడు సారథి.

★ ★ ★

"ఆలస్యాదమృతం విషం" అన్న సూక్తి కమలాంబ ఎక్కడో వింది. అది ఇప్పుడు జ్ఞాపకం చేసుకుంది.

అనూరాధ పెళ్లి విషయం ప్రస్తావన తెచ్చి బ్రహ్మానాయుడిని ఈరోజే అడగాలి. ఆలస్యం చేయగూడదు అనుకున్నది కమలాంబ.

శాంతమ్మ, రమాదేవి ఆరోజు భోజనాలు చేసి, బ్రహ్మానాయుడి ఇంటికి బయలుదేరారు.

ఆ రాత్రి భోజనాల తరువాత కమలాంబ భర్త కేశవరావుని బలవంతంగా ఒప్పించి, రమాదేవితోపాటే భర్తతో కలిసి బయలుదేరింది. తనకు ఇష్టం లేకపోయినా భార్య పోరు పడలేక కేశవరావు బయలుదేరాడు.

బ్రహ్మానాయుడు, భారతీదేవి సగౌరవంగా కేశవరావును, కమలాంబను ఆహ్వానించారు. వారి ప్రసన్నత, గౌరవపూర్వకమైన ఆహ్వానం, కమలాంబకి అమితానందం కలిగించింది. తన కోరిక నెరవేరుతుందన్న ఆశని రేకెత్తించింది.

అందరూ హాలులో కూర్చున్నారు.

ఇదే సమయమని, అనూరాధ పెళ్లి విషయం అడగమని కమలాంబ భర్తని భుజం తట్టి సైగచేసింది. కేశవరావు కూడా అడిగే ప్రయత్నంలో వున్నాడు.

అదే సమయంలో రాఘవేంద్ర, సారథి, వైదేహి రాత్రి భోజనాలుచేసి అక్కడికి వచ్చారు. అంతకుముందు రాత్రి వారిని భారతీదేవి సారథిని కూడా తీసుకురమ్మని ఆహ్వానించింది.

ఇతగాణ్ణి వెంటేసుకొని వీరూ ఇప్పుడే దిగారే అని కమలాంబ చికాకుపడింది. భర్తని ఆగమని సైగచేసింది. అడగబోయిన కేశవరావు భార్య కనుసన్నతో ఆగిపోయాడు.

సారథిని చూడగానే శాంతమ్మ "సారథి బాబూ! ఈరోజు ఎక్కడికెళ్లావు? " అని వాత్సల్యంతో అడిగింది.

"తాతయ్యా, నేను ఉదయం తోటకెళ్లి చూసివచ్చాం అమ్మమ్మా. మధ్యాహ్నం తూర్పుపొలం వెళ్లాం. అక్కడ వేరుసెనగ

విత్తనం వేస్తుంటే చూడాలని వెళ్లాను"

"అక్కా! ఈరోజు తాత మనవడు ఇద్దరూ మరీ ఎండలో వెళ్లారు. విత్తనం వేసే పద్ధతి చూడాలని ముందుగా వెళ్లారు" అన్నది వైదేహి.

"మరీ ఎండలో ఎందుకు తిరుగుతావు నాయనా! అసలే నీది ఎర్రటి ఒళ్లు. ఎండలో తిరిగితే కందిపోతదయ్యా" అన్నది శాంతమ్మ.

'ఓ యబ్బో! ఈ ముసలమ్మలిద్దరూ ఇత గాడి మీద మరీ ప్రేమ ఒలకబోస్తున్నారే' అని కమలాంబకి కలవరం, ఈర్ష్య మొదల యింది.

"ఈరోజు ఉదయం మా తోట చూశా వుగా సారథిబాబూ! ఎలా వుంది? " భారతీ దేవి అడిగింది.

"మీ తోటకి 'ఆనందవనం' అనిపేరు పెట్టారు. ఆ పేరుకు తగినట్లే వుంది. మీ తోట చూస్తుంటే పరమానందం కలిగింది. అనూరాధా! గ్రామాల్లో ప్రతి కర్షకుడు మీ నాన్నగారిలాగే ఫలవృక్షాలతోటలు, జలవన రులతో సస్యక్షేత్రాలు, పాడి, పంటలు, అధి కోత్పత్తి సాధిస్తే, ప్రకృతి అందాలతో పచ్చద నంతో కళకళలాడే పైరులతో ప్రతిగ్రామం ఒక భాగ్యసీమగా, ప్రతిదేశం ఒక స్వర్గసీ మగా మారుతాయి" అన్నాడు సారథి.

"నువ్వన్నది నిజం సారథిబాబూ. కర్షక కుటుంబాల్లోని విద్యావంతులైన యువకులు కూడా నీలాగే మనకు ప్రధాన వృత్తిగా వున్న వ్యవసాయంలో పరిజ్ఞానం సంపాదిం చుకోవాలి. సంస్కృతిని గౌరవించాలి.

కాని ఈనాడు విద్యావంతులై డిగ్రీలు సంపాదించిన యువకులు కొందరు కర్షక కుటుంబాలలో పుట్టినవారై వుండికూడా, వ్యవసాయ రంగంపట్ల వైముఖ్యం ప్రదర్శిస్తు న్నారు. నిరుద్యోగులుగా వుంటూ నిష్ప్రయో జకులుగా తిరుగుతున్నారు. నువ్వన్నట్లు పల్లెసీమలు భాగ్యసీమలుగా మారాలంటే విద్యావంతులైన యువకులు కూడా వ్యవసా యరంగంలో ప్రవేశించాలి. ట్రాక్టర్లు ఇతర ఆధునిక వ్యవసాయ పరికరాలతో వ్యవసా యాన్ని యాంత్రికంగా అభివృద్ధిచేయాలి. అధికోత్పత్తి సాధించాలి" అన్నాడు బ్రహ్మనా యుడు.

"ఈరోజు సారథిబాబు ఎదగొర్రు చక్కగా దున్నాడు." అన్నాడు రాఘవేంద్ర.

"అలాగా! ఈ సారథిబాబు వ్యవసాయపు పనులన్నీ ఎంత బాగా నేర్చుకున్నాడు. అంతేనా! ఎంత చక్కగా మాట్లాడతాడో! అంతంత మాత్రంగా చదువుకున్నదానికి నాకే సారథి బాబు మాట్లాడుతుంటే వినబు ద్ధేస్తుంది. మనతోటని ఎంత బాగా వర్ణిం చాడో" అన్నది శాంతమ్మ.

కమలాంబకి ఈ సంభాషణ కర్ణకఠోరంగా వుంది. "డిగ్రీలు సంపాదించిన యువకులు కొందరు నిరుద్యోగులుగా వుంటూ నిష్ప్ర యోజకులుగా తిరుగుతున్నారు" అని బ్రహ్మ నాయుడు అన్నమాటలు ఎం.ఏ. పాసై వున్న తన కొడుకుకే తగిలి వస్తాయి.

సంబంధం విషయం అడగబోయే సమ యానికి సైంధవుడిలాగా సారథిగాడొకడు దాపురించాడే! ఈవూరు చూడటానికి వీడికి పుడే తీరిందే! అని కమలాంబ చిరాకుప డింది. ఇక సహించలేకపోయింది.

"మాటలు చెప్పటానికేముందిలే వదిన గారూ! ఊళ్లు పట్టుకొని తిరిగేవాళ్లకి మాటలు చెప్పటం బాగా పట్టుబడుతుంది. అయితే ఈ సారథిబాబు బండి తోలటంలో, అరక దున్నటంలో పనితనం చూపటాన్ని మెచ్చుకోవచ్చు. చిన్నతనంలోనే పనులన్నీ నేర్చుకున్నాడు"

అంటూ ఒకవైపున సారథిని మెచ్చుకు న్నట్లు మాట్లాడుతూనే, మరొక వైపున ఊళ్లు పట్టుకొని తిరుగుతూ మాటలు నేర్చిన దేశ దిమ్మరి అని చిత్రీకరించటానికి ప్రయత్నిం చింది. మర్మగర్భంగా ఎత్తిపొడిచింది.

"కమలాంబా! ఇంతకీ సారథిబాబు చెప్పే మాటలు ఊళ్లుపట్టుకొని తిరిగే దేశదిమ్మరి

వాళ్లు చెప్పే కల్లబొల్లి మాటల్లాగే వున్నా యంటావా? సారథిబాబు అలాంటివాడా? ఎందుకలా పోల్చావు? " వైదేహి ఆగ్రహంతో అడిగింది.

ఆగ్రహానికి గురి అవుతానని కమలాంబ అనుకోలేదు. ఊహించకుండా ఎదురైన ప్రశ్నకు ఉక్కిరిబిక్కిరి అయింది.

"అదికాదు వదినగారూ! ఆ మాటలు నేను సారథిబాబును గురించి అనలేదు. మాటలు చెప్పటం గురించి మాటవరసకి అన్నాను"

"అమ్మా! నువ్వు ఏ వుద్దేశంతో అన్నా, ఈ సందర్భంలో ఆ మాటలనటం బాగాలేదు" అంది శాంతమ్మ.

"అమ్మమ్మా! కమలాంబగారన్నది నిజ మేలే! అననీయండి! వ్యవసాయ విధానాలు తెలుసుకోవటానికి ఊళ్లుపట్టుకొని తిరిగాను. ఆ వూళ్లలో రకరకాల పంటలు, రకరకాల తోటలు, రకరకాల మనుషులు, రకరకాల మనసులు, రకరకాల మాటలు అన్నీ పరిశీ లించిన అనుభవం నాకుంది. నేనేం బాధ పడను" అన్నాడు సారథి చిరునవ్వుతో.

"సారథిగారికి వయసుకు మించిన అను భవం వుంది" అన్నాడు సదానందం.

"మా కమలాంబ అనుచితంగా అలా అనటం తప్పే. మన్నించండి వైదేహిగారూ! సారథిబాబూ! నువ్వూ మనసులో పెట్టుకో వద్దు. చిన్నవాడివైనా క్షమించు" అని కేశవ రావు క్షమాపణ చెప్పాడు.

"క్షమాపణలెందుకు తాతగారూ? నేనేమీ అనుకోను"

అంతటితో చర్చ ముగిసింది. అందరూ వెళ్లిపోయారు.

అనూరాధని భూపాలరావుకి అడుగుదా మని వచ్చి, అనుచితంగా నోరుజారి పరిస్థి తిని ప్రతికూలం చేసుకుంది. ఆ రోజుకి ఆ ప్రయత్నం విరమించుకుంది. మళ్లీ అను కూల సమయం చూసి అడగాలని, ఇది సమయం కాదనీ అనుకుంది.



"సారథిబాబూ! రేపు వాకింగు మాను కుందాం! నాకు కొంచెం జలుబుచేసి తల దిమ్ముగా వుంది. ఈ రోజు పగలు ఎండలో తిరిగాంగదా! అందుకే నాకు బాగా లేదు" అన్నాడు రాఘవేంద్ర రాత్రి పడుకో బోతూ.

"వాకింగుకు నేను ఒక్కణ్ణే వెళ్తాను తాతయ్యా! దారి తెల్సిందేగదా!"

"దారి తెలిసిందేగాని సారథిబాబూ! వీర వరం వూరి పరిస్థితి గతంలోలా లేదు. కొంతకాలం నుండి వూరు తీరు మారింది. జాగ్రత్తగా వెళ్లిరా! ఎవరైనా పలకరిస్తే ఆచి తూచి మాట్లాడు"

"వీరవరం వూరు తీరు మారిందంటు న్నారు! ఆ మార్పుకు కారణాలేంటి? వివ రంగా చెప్పండి తాతయ్యా"

"విషయాలు నీకు తెలియటం మంచిదే! వూరు నీకు కొత్తగదా! విను. ఉత్తమ సంస్కృతి గల ఈ వీరవరం గ్రామంలో క్రమక్రమంగా అక్రమ కాపుసారా వ్యాపారం మొదలయింది. పేకాట రాయుళ్లు పెరి గారు. తాగుబోతులు తయారయ్యారు.

జూదగృహాలు వెలిశాయి. ధన సంపాదనే పరమావధిగా పెట్టుకున్న కొందరు స్వార్థపరులు అధికారులకు లంచాలు మేపి అక్రమ సంపాదనకు పూనుకున్నారు.

ఈ నియోజకవర్గపు ఎం.ఎల్.ఏ బాలాజీ అవినీతి చక్రవర్తిగా తయారయ్యాడు. ఆ బాలాజీ అండ వీళ్లందరికీ దండిగా వుంది. ఈ వీరవరం పోలీస్‌స్టేషన్ ఎస్.ఐ.కి, బాలాజీకి అక్రమ వ్యాపారాలన్నిటిలోను వాటాలు వున్నాయి. ఈ గ్రామ వాతావరణం కలుషితమైంది.

విశిష్టమైన విద్యా సంస్థగా పేరు తెచ్చుకున్న వీరవరం హైస్కూల్లో కూడా క్రమక్రమంగా క్రమశిక్షణ అంతరించింది. విద్య పట్ల శ్రద్ధలేని విద్యార్థులు కొందరు వెకిలి చేష్టలకు పాల్పడుతున్నారు. చందన్ అనే వాడు ఆ విద్యార్థులకు నాయకుడు. కర్షక కుటుంబంలోనే పుట్టిన చందన్ స్కూలు ఫైనల్ పరీక్ష మూడుసార్లు తప్పి చదువుకు స్వస్తి చెప్పి అల్లరి చిల్లరగా తిరుగుతూ ఆకతాయి విద్యార్థులకు ముఖ్య సలహాదారు అయ్యాడు.

అవినీతిపరులైన అధికారులకి, అవినీతి చక్రవర్తి ఎం.ఎల్.ఏ బాలాజీకి చందన్ ముఖ్య అనుచరుడయ్యాడు.

వీరవరం హైస్కూలుకు పక్క గ్రామాల నుండి విద్యార్థులు, విద్యార్థినులు ప్రతిరోజు ఉదయం నడిచి వచ్చి సాయంత్రం క్లాసులు కాగానే నడిచి వెళ్తారు. బస్సు సర్వీసులు లేవు గనుక నడిచి రావాల్సిందే! పక్క గ్రామాల్లో ప్రాథమిక పాఠశాలలే వున్నాయి. ఆరవ తరగతి నుండి వీరవరం హైస్కూల్లో చేరతారు"

"తాతయ్యా! పక్క గ్రామాలనుండి అమ్మాయిలుకూడా నడిచి వచ్చేవాళ్లా? "

"చదువుకోవాలన్న ఆసక్తివున్న అమ్మాయిలు నడిచే వచ్చేవాళ్లు. అది తప్పదుగదా సారథిబాబూ! రోజూ నడక అలవాటైతే కష్టమనిపించదు.

పల్లవపురం అనే గ్రామం వీరవరానికి నైరుతి దిశగా రెండు కిలోమీటర్ల దూరంలో వుంది. రెండు చిన్న నదులు సంగమించిన చోట సంగమేశ్వర ఆలయం నిర్మించారు. దాన్ని కూడలి అంటారు. దానికి దక్షిణ ఆగ్నేయ దిశగా వున్న చిన్నగ్రామం పల్లవపురం. ఆ గ్రామంలో ప్రధానంగా కర్షక కుటుంబాలు కొన్ని, ఒక బ్రాహ్మణ కుటుంబం, కొన్ని ఇతర కుటుంబాలున్నాయి.

బ్రాహ్మణ కుటుంబానికి చెందిన సునంద అనే విద్యార్థిని వీరవరం హైస్కూల్లో స్కూలు ఫైనలు చదువుతోంది. ఆ వూరి అమ్మాయిలతో కలిసి రోజూ స్కూలుకు నడిచివచ్చేది. సాయంత్రం నడిచి వెళ్లేది.

సునంద అందమైన యువతి. చురుకైనది. మన అనూరాధకు క్లాసుమేటు. వీరవరం హైస్కూల్లో వెకిలివేషాలు వేసే ఇద్దరు ముగ్గురు విద్యార్థులు సునంద పై కన్ను వేశారు. వారిలో గోపాల్ అనేవాడు ముఖ్యుడు. వాడు చందన్ శిష్యుడు.

పేద బ్రాహ్మణ కుటుంబంలో పుట్టిన సునందకి అండదండ ఎవరూ వుండరన్న అహంకారంతో గోపాల్ సునందతో సరసాలు ప్రారంభించాడు.

సునంద తీవ్రంగా నిరసన తెలిపి హెడ్మాస్టరుతో చెప్పింది.

చందన్ అండ చూసుకొని గోపాల్ హెడ్మాస్టర్ హెచ్చరికని లెక్కచెయ్యలేదు. మరింత పట్టుదలతో సునంధని సమయం చూసి పట్టాలని ఆలోచనతో వున్నాడు. అందుకు చందన్ ప్రోత్సాహం కూడా వుంది.

గోపాల్ తల్లిదండ్రులకు ఒక్కడే కొడుకు. ధనవంతులు కాకపోయినా మరీ పేదవాళ్లు కాదు. తల్లి అతిగారాబంతో ఆకతాయిగా తయారయ్యాడు. వాడి అవసరాలకు తల్లి డబ్బు బాగా అందిస్తుంది.

దురదృష్టవశాత్తు సునంద ఒకరోజు పల్ల

వపురం నుండి ఒక్కతే స్కూలుకు వచ్చింది. రోజూ సునందతో వచ్చే అమ్మాయిలు, అబ్బాయిలు ఊళ్లో యేదో ఫంక్షను మూలంగా రాలేదు. సునంద క్రమం తప్పకుండా స్కూలుకు హాజరవుతుంది.

ఒంటరిగా సునంద వచ్చిన సంగతి తుంటరి గోపాల్ గమనించాడు. వాడు కావాలనుకున్న సమయం కలిసి వచ్చింది. ఆ పగలు చందన్‌తో మంతనాలాడి, చందన్‌తోపాటు ప్రకాశం అనే మరొక తుంటరిని జతగూర్చుకున్నాడు.

అపర కీచకులు ముగ్గురూ వీరవరానికి, పల్లవపురానికి మధ్యలో దారికి దగ్గరలో బ్రహ్మానాయుడుగారి తోట పక్కన ఏటి ఒడ్డు చాటున మాటువేసి వున్నారు. సునంద రాగానే ఏటి ఒడ్డుచాటుకి ఎత్తుకుపోవాలని పథకం పన్నారు.

ఆ రోజు సాయంత్రం స్కూల్లో ఆడపిల్లలతో రింగు ఆడించి కొంచెం ఆలస్యంగా వదిలారు. అప్పటికి సాయంత్రం అయిదున్నర అయింది. కొంచెం పొద్దువుంది. సూర్యుడు అస్తమించలేదు. సునంద వడివడిగా నడకసాగించింది.

అక్కడ మాటువేసిన ముగ్గురికీ అంతా అనుకూలంగానే కుదిరింది.

ఆ సమయంలోనే బ్రహ్మానాయుడుగారి తోటలో నిమ్మకాయలు, పూలు, కూరగాయల కోసం సదానందం అటు వచ్చాడు. ఏటి ఒడ్డున మాటువేసి దారి వైపే చూస్తున్న అపరకీచకుల్ని గమనించాడు. చందన్ సంగతి, గోపాల్ సంగతి సదానందానికి తెలుసు. ఈ దుండగులు ముగ్గురూ ఏదో దుర్మార్గం తలపెట్టి వుంటారని అనుమానించాడు సదానందం. ఎందుకైనా మంచిదని కంచె ఇవతలికి వచ్చి ఒక పొదచాటున ఒదిగి, ఆ అపరకీచకుల్ని గమనిస్తూ కూర్చున్నాడు.

సారథిబాబూ! యాదృచ్ఛికంగా కొన్ని ఘటనలు విచిత్రంగా జరుగుతాయి. అపర కీచకులు అటు మాటువేసి వుంటే అభినవ భీముడు ఇటు పొంచి వున్నాడు. ఆసక్తికరమైన కథలు ఇటువంటి వాస్తవ ఘటనల నుండే పుట్టుకొస్తాయి"

"అవును తాతయ్యా! మీరన్నది నిజం! ఆధారం లేకుండా కథలుండవు. కాకపోతే అతిశయోక్తులు, అలంకారాలుంటాయి. తరువాతేం జరిగింది? "

"సునంద పుస్తకాలు పట్టుకొని వడివడిగా నడుస్తూ వచ్చింది.

అల్లంత దూరం నుండే సునంద రావటం చూసి దుండగులు హఠాత్తుగా అడ్డం తిరిగి ఆపారు. "వెయ్యి కండ్లతో నీకోసం ఎదురు చూస్తున్నాం సునందా! మంచిగా మాతోరా! మజా చేద్దాం! మారాం చేస్తే ఎత్తుకుపోతాం" అన్నాడు గోపాల్.

సునంద గుండె దడదడలాడింది. భయం, కోపం, దుఃఖంతో వణికింది.

"గోపాల్! ముందు తప్పుకో! నేను చావుకైనా సిద్ధమేకాని నీకు లొంగను"

"తప్పుకోవటం జరగదు. నువ్వు ఒప్పుకోవటమే జరగాలి. నువ్వు చస్తానని బెదిరిస్తే వదిలేస్తామనుకున్నావా!" అంటూ వచ్చి చెయ్యి పట్టుకున్నాడు.

"అరేయ్!" అనే గర్జనతో సదానందం మెరుపువేగంతో పిడుగులా దూకి పిడికిటి పోటు గోపాల్ రొమ్ముపై వేశాడు. బలమైన ఆ పోటుకి వాడు స్పృహతప్పి పడిపోయాడు. రెప్పపాటులో చందన్‌ని మరొక ముష్టిఘాతంతో నేల గూల్చాడు. పారిపోబోయిన ప్రకాశంపై సింహంలా లంఘించి పట్టి పైకెత్తి విసిరి నేలకు కొట్టాడు. వాడు కండ్లు తేలేసి సొమ్మసిల్లాడు.

జింకలపై దూకిన సింహంలా ముగ్గురినీ మళ్లీ లేవకుండా పారిపోకుండా ముష్టిఘాతాలతో మర్దించాడు.

కర్రసాము, మల్లయుద్ధం, నేర్చిన కర్కశకాయుడు సదానందం పిడికిటిపోట్లకి పిల్లకాకులవంటి ఆకతాయి వెధవలు కళ్లు తేలేసి నేలపై కూలారు.

"కదిలారంటే రక్తం కక్కిస్తా!" అని గర్జించాడు. ముగ్గురూ నేలపైపడి వుండి ఏడుస్తూ సదానందానికి చేతులెత్తి మొక్కుతున్నారు.

వక్షస్థలాన్ని చేతులతో కప్పుకొని వణుకుతున్న సునందకి సదానందం తన తలకి కట్టుకొని వున్న టవలు తీసి విసిరేశాడు. సునంద ఆ టవలు అందుకొని కప్పుకుంది.

తోటలో వున్న వీరన్న సదానందం గర్జనలు విన్నాడు. ఏదో జరుగుతున్నదని బాణాకర్ర పట్టుకొని పరుగుపరుగున అక్కడికి వచ్చాడు.

"చూడు బాబాయ్! ఈ దుష్టులు ఈ అమ్మాయిని ఎత్తుకుపోవాలని దారిగాచి అడ్డం తిరిగారు. నేను చూడకపోతే నిండు జీవితాన్ని నాశనం చేసేవాళ్లు. పరమనీచులు వీళ్లు"

"ఎంత పాపకార్యానికి పాల్పడ్డార్రా" అని వీరన్న ఆగ్రహంతో గోపాల్‌ని బాణాకర్రతో ఒక్కటి వేశాడు. సదానందం ముష్టిఘాతాలకే ఒళ్లంతా గుల్ల అయి వున్న దుండగులు బాణాకర్ర చూసి బావురుమని ఆర్తనాదాలు చేశారు.

వీరన్న తోటలోకి వెళ్లి బావి దగ్గరవున్న తాడు తీసుకువచ్చి ముగ్గురికీ చేతులు కట్టి లంకె పెట్టాడు. ముగ్గురినీ వీరవరం పోలీసు స్టేషనుకు తీసుకువచ్చారు. సునందను కూడా వీరవరం తీసుకువచ్చారు. దుండగుల్ని పోలీసు స్టేషన్లో అప్పగించి సునందని బ్రహ్మనాయుడుగారి ఇంట్లో అనూరాధ దగ్గర వుంచారు.

బ్రహ్మనాయుడు పల్లవపురం నుండి సునంద తండ్రి పాపయ్యశాస్త్రిని పిలిపించాడు. వీరవరం గ్రామప్రెసిడెంటు జగదీష్ ప్రసాదు, బ్రహ్మనాయుడు, పోలీసు స్టేషనుకు పాపయ్య శాస్త్రిని తీసుకువెళ్లి రిపోర్టు రాయించి ఇచ్చారు. దుండగులు ముగ్గురినీ లాకప్‌లో వేశారు"

"ఆహా తాతయ్యా! ఆపదలో చిక్కుకున్న ఒక అమ్మాయిని ఆపద్బాంధవుడై కాపాడిన ఘనత మన సదానందానికి దక్కింది సంతోషం"

"అంతటితో ఈ కథ అంతం కాలేదు సారథిబాబూ! ఆపైన మరికొంత రభస జరిగింది"

"అది కూడా చెప్పండి తాతయ్యా"

"చందన్ పినతండ్రి చిదంబరం ఎం.ఎల్.ఏ బాలాజీకి ముఖ్యమైన అనుచరుడు. ఎన్నికల సమయంలో బాలాజీకి వీరవరంలో ఏజంటుగా వున్నాడు. నాగరాణితో పాటు చిదంబరం గుంటూరులో బి.ఏ పాసయ్యాడు.

చందన్‌కూడా బాలాజీకి శిష్యుడే! ఎం.ఎల్.ఏకి ఇష్టుడే.

చందన్‌ని మిగతా ఇద్దరినీ విడిపించటానికి చిదంబరం హుటాహుటిగా బాలాజీ దగ్గరికి వెళ్లాడు. విషయాలేమీ దాచకుండా ఉన్నదున్నట్లు నిజం చెప్పాడు. బాలాజీ వెంటనే చిదంబరాన్ని స్కూటరుతో పల్లవపురం పంపి పాపయ్యశాస్త్రిని తన దగ్గరికి రప్పించుకున్నాడు.

జరిగిన దానికి నష్టపరిహారంగా డబ్బు ఆశచూపాడు. చదువుకాగానే నీ కూతురుకి ఉద్యోగం ఇప్పిస్తానని వాగ్దానం చేశాడు. ఆడపిల్లని కోర్టుకి ఎక్కించవద్దన్నాడు. ఆర్థికంగా ఇబ్బందులు పడుతున్న పాపయ్యశాస్త్రికి బాలాజీ సలహా బాగా నచ్చింది. బాలాజీ ఇచ్చిన డబ్బు అందుకొని కేసు ఎత్తివేసుకున్నాడు.

వీరవరంలో గోపాల్ తండ్రిద్వారా ఎస్.ఐకి డబ్బు అందింది.

దుండగులు ముగ్గురూ పోలీస్ స్టేషను నుండి మాయం అయ్యారు"

"తాతయ్యా! తరువాత గోపాల్ హైస్కూలుకు వచ్చాడా? చదువేమయింది"

"సారథి బాబూ! తరువాత పెద్దగొడవే జరిగింది. వీరవరం ప్రెసిడెంటు జగదీష్‌ప్రసాదు ప్రజాభిమానం వున్నవాడు. నిజాయి

తీపరుడు. ధైర్యశాలి.

అపరకీచకుల్ని వదిలేసినందుకు ఎస్.ఐ మీద ఆగ్రహించాడు. గ్రామంలోని స్త్రీలను, పురుషుల్ని సమీకరించి పోలీసు స్టేషను ముందు నిరసనగా బైఠాయించాడు. పల్లవ పురం జనం కూడా ధర్నాలో పాల్గొన్నారు.

ప్రజాసమూహాన్ని చూసి పోలీసులు కల వరం చెందారు. ఇంత పెద్ద నిరసన ఎదు రౌతుందని ఎస్.ఐ ఊహించలేదు. ఏమీ తోచక నందిగామ ఎం.ఎల్.ఎ బాలాజీకి ఫోన్‌చేసి పరిస్థితి చెప్పాడు.

బాలాజీ ఎస్.ఐతో జగదీష్‌ప్రసాదుని ఫోన్ దగ్గరికి పిలవమన్నాడు.

ఎస్.ఐ ప్రార్థించి అడిగితే జగదీష్‌ప్ర సాదు ఫోన్ అందుకున్నాడు.

"హలో! జగదీష్ నేను బాలాజీని మాట్లా డుతున్నాను"

"నమస్కారం బాలాజీగారూ! ఎందుకు పిలిచారో చెప్పండి"

"చూడు బ్రదర్! జరగకూడని ఘటన ఏదో జరిగిపోయింది. ఇక ముందు ఇలాం టివి జరగకుండా చూద్దాం. ఇలా జరిగినం దుకు నాకూ బాధగానే వుంది. నేను పాప య్యశాస్త్రితో మాట్లాడి పరిష్కారం చేశాను. అతను కేసు ఎత్తివేసుకున్నాడు. పరిష్కార మయిన దానికింకా గొడవెందుకు? జగ దీష్! నువ్వు బాధ్యతగల వ్యక్తివి. ఇటు వంటి గొడవల్ని నేర్పుగా సర్దుబాటు చెయ్య వలసిన స్థానంలో వున్నవాడివి. ఇంతటితో వదిలెయ్యి"

"ఏదో జరిగిపోయిందని వదిలేసే సాధా రణ విషయమా యిది. ఒక నిండు జీవి తంతో చెలగాట మాడిన ఘోరకృత్యం! బాలాజీగారూ! బాధ్యతగల ప్రజాప్రతినిధిగా వుండి మీరే నేరస్థుల్ని కాపాడటమెందుకు? వాళ్లు చేసింది నీచాతినీచమైన నేరం. వాళ్లని వదలమని మీరు చెప్పటం ఘోరం"

"ఆవేశపడకు జగదీష్! వాడు స్టూడెంటు. పరీక్ష రాయకుండా చేసి వాడి భవిష్యత్తుని నాశనం చెయ్యకూడదు. పాపయ్యశాస్త్రి కేసు ఎత్తివేసుకున్నాడుగదా! ఎవరేమి చేసినా అయ్యేదేమీలేదు. వదిలెయ్యి బ్రదర్"

"బాలాజీగారూ! పాపయ్యశాస్త్రి కూతు రుపై జరిగింది గనుక పరీక్ష రాయకుండా గోపాల్‌ని ఆపగూడదని వాడిమీద సాను భూతి చూపుతున్నారు. నేను సూటిగా అడుగుతున్నాను. అదే మీ కూతురుపై జరి గితే ఇదే అనేవారా?"

"జగదీష్! నువ్వు హద్దు మీరి మాట్లాడు తున్నావు. నేనొక్కటే చెబుతున్నాను. గోపాల్ పరీక్ష రాయకుండా నువ్వు ఆప లేవు? నా సత్తా చూపిస్తా! వాడితో పరీ క్షలు రాయిస్తా"

"మిస్టర్ బాలాజీ! నేను సరిగానే మాట్లా డాను. హద్దులోనే నిజం చెప్పాను. అందుకు ఉలిక్కిపడ్డావు. అతి ఘోరకృత్యా నికి పాల్పడ్డ గోపాల్‌ని వీరవరం హైస్కూల్లో అడుగు పెట్టనివ్వను. నీ సత్తా ఏమిటో నేనూ చూస్తాను"

అని ఫోన్ ఎస్.ఐ.కి ఇచ్చి జగదీష్‌ప్ర సాదు బయటికి వచ్చాడు.

ఇంతలో బ్రహ్మనాయుడు, నేను అక్కడికి వెళ్లాం. ఫోన్ సంభాషణంతా మాతో చెప్పా డు జగదీష్‌ప్రసాదు.

జగదీష్‌ప్రసాదుతో మాట్లాడి పాపయ్య శాస్త్రి పరిస్థితి అర్థం చేసుకోమని నచ్చజెప్పి ధర్నా విరమింప చేశాం! ఎస్.ఐ బ్రహ్మనా యుడికి నాకు కృతజ్ఞతలు చెప్పాడు.

గోపాల్ వీరవరం హైస్కూల్లో అడుగుపె డితే ఒప్పుకోనని జగదీష్‌ప్రసాదు ఎస్.ఐకి చెప్పాడు.

తరువాత ఎస్.ఐ బాలాజీతో ఫోన్లో మాట్లాడాడు.

వీరవరం హైస్కూల్లో గోపాల్ అడుగుపె ట్టలేదు.

గోపాల్‌ని వేరే వూళ్లో వాళ్ల బంధువుల ఇంట్లో వుంచి చదివించారు. వీరవరం హైస్కూల్లో హాజరు రహస్యంగా వేయిం

చారు.

పరీక్షలు రాసేనాటికి కొండపల్లి పరీక్షా కేంద్రానికి బాలాజీ అండతో తీసుకువచ్చి రాయించారు. వీరవరం హైస్కూలుకు అదే సెంటరు.

గోపాల్ వంటి తుంటరికి అండగా నిలిచి కళంకం తెచ్చుకుంటున్నానన్న జ్ఞానం ఎం.ఎల్.ఏ బాలాజీకి లేకుండాపోయింది.

సదానందంతో చావుదెబ్బలు తిన్న చందన్ ఎగ్గూసిగ్గూ లేకుండా యథావిధిగా వీరవరంలో తలయెత్తుకొని తిరుగుతున్నాడు.

కృష్ణాజిల్లా అధికార పార్టీ ముఖ్య నాయకుల్లో బాలాజీ ఒకడు. ఆ పలుకుబడితో మళ్లీ జరిగిన ఎన్నికల్లో సీటు సంపాదించి పోటీచేశాడు. ప్రజలకు ఎన్నో వాగ్దానాలు చేశాడు. జనాన్ని భ్రమల్లో ముంచాడు. అధికార పార్టీ బలంతో రెండవసారి గెలిచాడు.

రెండవసారి గెలిచాక వాగ్దానాల్ని గాలికి వదిలి అన్నిరకాల అక్రమ సంపాదనలకి తెగబడి లక్షలు సంపాదిస్తున్నాడు.

ఈ వీరవరంలో చిదంబరం అతనికి నమ్మినబంటు. చందన్ అతని అక్రమ సంపాదనలకి ఏజంటు. ఏడేండ్లుగా ఇలా జరుగుతున్నది.

ఇదే సారథిబాబూ! ఇప్పటి వీరవరం పరిస్థితి. ఈ వూరు తీరు మారిందని అందుకే అన్నాను. ఇది నీకు తెలియటం మంచిదని చెప్పాను"

"సంతోషం తాతయ్యా! మంచి సంగతులు చెప్పారు"

★ ★ ★

సారథి ఉదయం అయిదు గంటలకే లేచి రాఘవేంద్రకి చెప్పి ఒంటరిగా వాకింగుకి బయలుదేరాడు.

ఊరు బయట తూర్పుడొంకలో సారథికి ఒక కొత్త వ్యక్తి కలిశాడు. అతనికీ సారథి వయసే వుంటుంది. పాంటు, షర్టుతో చలాకీగా వున్నాడు.

"మీది ఈ వూరే గదండి" సారథి ముందుగా పలకరించాడు.

"కాదండి! కొత్తగా వచ్చాను" అన్నాడా యువకుడు.

"అలాగా! బంధువుల ఇంటికి వచ్చారా?"

"ఇక్కడ నాకు బంధువులు లేరండి! తెలిసినవాళ్లున్నారు. ఇక్కడ పని వుండి వచ్చాను. మీది కూడా ఈ వూరు కాదట్లుంది? ఈ వూరేనా అని మీరు నన్ను అడిగారు"

"నాది కూడా ఈ వూరు కాదండి! నాకూ ఇక్కడ బంధువులు లేరు. నేను కూడా తెలిసిన వాళ్లద్వారా ఇక్కడ పని వుండి వచ్చాను" అన్నాడు సారథి.

"అయితే మన ఇద్దరం ఒకే విధంగా ఈ వూరు వచ్చిన వాళ్లం గదండీ" అన్నాడు కొత్త యువకుడు నవ్వుతూ.

ఇద్దరూ నడుస్తూనే మాట్లాడుకుంటున్నారు.

"ఇక్కడ నాకు పరిచయమైనవారు బంధువులకంటే ఎక్కువ సన్నిహితులయ్యారండి" అన్నాడు సారథి.

"వారి పేరేమిటండి" కొత్త యువకుడు ఆసక్తిగా అడిగాడు.

"రాఘవేంద్రస్వామి, బ్రహ్మనాయుడు. నేను రాఘవేంద్రస్వామిగారి ఇంట్లో వుంటున్నాను. బ్రహ్మనాయుడుకి రాఘవేంద్రస్వామి స్వయానా పినతండ్రి"

"బ్రహ్మనాయుడు పేరు నేను విన్నానండి. పేరున్న కర్షకుడు. 'కర్షకబ్రహ్మ' అని అందరూ అంటారట. మీరు రాఘవేంద్రస్వామిగారింటికి ఎవరి ద్వారా వచ్చారు?"

"నాకు మా మేనమామ ద్వారా నారాయణరావు పరిచయం అయ్యారు. వారి ప్రోత్సాహంతోనే ఈ వూరు రాఘవేంద్రస్వామిగారింటికి వచ్చాను"

కొత్త యువకుడు పకపకా నవ్వాడు "బలే చిత్రంగా వుందండీ మనం కలుసుకోవటం! నాకు కూడా మా మేనమామ ద్వారానే నారాయణరావు పరిచయమయ్యారు. వారి

ప్రోత్సాహంతోనే నేను ఈ వూరు వచ్చాను. మన ఇద్దరి పరిచయాలు కూడా ఒకే విధంగా వున్నాయి" అన్నాడు కొత్త యువకుడు.

"ఈ వూరు మీరు ఏం పని మీద వచ్చారు? చెప్పగూడనిదైతే చెప్పొద్దు! అభ్యంతరం లేకపోతేనే చెప్పండి" అన్నాడు సారథి.

"అసలైతే చెప్పగూడనిదే, కాని మీరు, నేను ఈ వూరు ఒకే విధంగా ఒకే వ్యక్తి సలహాతో వచ్చిన వాళ్లం కనుక మనం దగ్గరయ్యాం. ఇద్దరం ఈ వూరికి కొత్త వాళ్లమే. మన మధ్య రహస్యాలెందుకు? మీకు చెబుతాను...

"నా పేరు భార్గవ. నేను ఈ వీరవరం పోలీసుస్టేషనుకి ఎస్.ఐగా వచ్చాను. ఈ వీరవరంలోను, పరిసర గ్రామాలలోను కాపుసారా ధారాళంగా తయారుచేసి విచ్చలవిడిగా దుకాణాలు పెట్టి బహిరంగంగా అమ్ముతున్నారట. జూదగృహాల జోరు ఎక్కువైందట. వీటితోపాటు వ్యభిచారం, దొంగతనాలు పెరుగుతున్నాయట.

"వీధుల్లో తాగుబోతుల అల్లరి తారాస్థాయికి చేరిందట.

"ఇంతకుముందు ఇక్కడున్న పోలీసు అధికార్లకి, ఈ నియోజకవర్గపు శాసనసభ్యుడు బాలాజీకి కాపు సారా వ్యాపారులతో, జూదగృహాలు నడిపే వారితో లింకులు వున్నాయట. దండిగా లంచాలు పుచ్చుకొని వాళ్లకి అండగా నిలబడుతున్నారట. క్రమంగా వూరు వాతావరణం కలుషితమైపోతూ వుందట.

"వీరవరం పెద్దలు నారాయణరావు, బ్రహ్మానాయుడు హైదరాబాదులో ముఖ్యమంత్రిని కలుసుకొని వీరవరం, దాని పరిసర గ్రామాల పరిస్థితి, అధికారుల అవినీతి, ఎం.ఎల్.ఏ అండదండలు అన్నీ వివరంగా చెప్పారట.

"వారు చెప్పింది ముఖ్యమంత్రి సానుభూతితో విని, సమర్థుడైన ఎస్.పి భరత్‌కుమార్‌ని కృష్ణా జిల్లాకు వేశారు.

"ఎస్.పి. భరత్‌కుమార్ నన్ను ఈ వీరవరం స్టేషన్‌కి వేశారు. ఎస్.పిగారికి వీరవరం అంటే అభిమానం వుందండి. నారాయణరావుకి నేను తెలుసుగనుక వారి సలహాతోనే నన్ను ఇక్కడికి వేశారు.

"రెండు రోజులు నేను ఎస్.ఐని అని తెలియకుండా సివిల్‌డ్రస్సులో తిరిగి, పరిస్థితిని తెలుసుకోవాలనుకున్నాను. అజ్ఞాతంగా తిరుగుతూ వున్నాను. ఎల్లుండి విజయదశమిగదా! ఆ రోజు నుండి ఎస్.ఐగా ప్రత్యక్షమై ప్రక్షాళన ప్రారంభిస్తాను"

"చాలా సంతోషం భార్గవా! మీరు తప్పక విజయం సాధిస్తారు"

"అభ్యంతరం లేకపోతే మీరు కూడా వీరవరం వచ్చిన పని ఏమిటో చెప్పండి. రహస్యమైతే చెప్పొద్దు. నేనేమీ అనుకోను"

"అరగంటలో ఇద్దరం ఆత్మీయులమయ్యాం. మనసు విప్పి మీ విషయాలు నాకు చెప్పారు. అలాగే నేనూ చెబుతాను. అభ్యంతరమెందుకు? నా పేరు విజయసారథి. నేను ఈ వీరవరం సిండికేటు బ్యాంకులో ఆర్.డి.వోగా వచ్చాను. (రూరల్ డెవలప్‌మెంటు ఆఫీసరు) ఈ విషయం రహస్యంగానే వుంచాను. సారథి అనే సగం పేరుతో సాధారణ పౌరుడిగా తిరుగుతున్నాను. అయితే మీలాగా నేను రహస్యంగా తిరగాల్సిన అవసరం లేదు. మీ ఉద్యోగంలాగా నాకు తెలుసుకోవాల్సిన రహస్యాలుండవు.

అయినా వీరవరంలో నాలుగు రోజులు సాధారణ పౌరుడిగా అందరితో కలిసి సరదాగా తిరగాలనిపించింది. బండి తోలాను. అరకదున్నాను. పొలాల వెంట తిరిగి పంటలు, వ్యవసాయ పద్ధతులు, పరిశీలించాను. గ్రామసంస్కృతి గురించి తెలుసుకున్నాను. తాతయ్యగారిద్వారా కొందరి కథలు విన్నాను.

ఇలా తిరగటం నాకు బలే సరదాగా వుందండి! నేను కూడా మీలాగే ఎల్లుండి విజయదశమినాడు బ్యాంకు ఆఫీసరు విజయసారథిగా నిజాన్ని వెల్లడిస్తాను"

"ఇద్దరం ఒకే పంథాలో వున్నాం విజయ సారథిగారూ! ఈ వీరవరంలో మీతో పరిచయం ఏర్పడటం ఆనందంగా వుంది. మీరన్నట్లు సాధారణ పౌరుడిగా వుండి జనంతో కలిసిమెలిసి తిరగటం సరదాగానే వుంటుంది.

ఇక్కడ రవీంద్ర అనే కానిస్టేబుల్ బి.ఎస్.సి చదివాడు. డిగ్రీ చదివినా కానిస్టేబుల్ ఉద్యోగంలో సంశయించకుండా చేరాడు. నిజాయితీపరుడు. అతడికింకా పెళ్లి కాలేదు. నేను వాళ్ల ఇంట్లో వుంటున్నాను. రవీంద్ర తల్లి రమాబాయి నన్ను తన కొడుకులాగే చూసుకుంటుంది. వాళ్లది సంస్కారం గల కుటుంబం. నేను ఎస్.ఐని అని రవీంద్ర ఒక్కడికే తెలుసు"

ఇలా మాట్లాడుకుంటూ ఇన్‌స్పెక్టర్ భార్గవ, విజయసారథి కొంత దూరం వెళ్లి వెనక్కి తిరిగి ఊరు ముందుకు వచ్చారు. వారికి వినుకొండ వీరభద్రయ్య బాణాకర్రతో ఎదురు వచ్చాడు. సారథిని చూసి నవ్వుతూ "సారథిబాబూ! ఈ రోజు ఎవరో కొత్తబ్బాయితో వస్తున్నావే" అన్నాడు.

"ఈయన నా స్నేహితుడు తాతయ్యా పేరు భార్గవ"

భార్గవ వీరభద్రయ్యకి నమస్కారం చేశాడు.

"భార్గవగారూ! ఈ తాతయ్య పేరు వినుకొండ వీరభద్రయ్య. ఏడుగురు దొంగల్ని ఒంటరిగా ఎదుర్కొని పోరాడి తరిమికొట్టిన వీరుడు. కర్రసాము బాగా నేర్చిన మొనగాడు" అని దొంగల్ని కొట్టిన కథ చెప్పాడు.

"అయితే మీరు ఊళ్లో వుండవలసినవారే తాతయ్యా!" అన్నాడు భార్గవ.

"సారథిబాబు కర్రసాము నేర్పమంటున్నాడు. నువ్వూ నేర్చుకుంటావా? "

అని నవ్వుతూ అడిగాడు వీరభద్రయ్య.

"అలాగే నేర్చుకుంటాం. ఇద్దరికీ నేర్పండి తాతయ్యా"

వీరభద్రయ్య దగ్గరలో వున్న తన తోటకి వెళ్లిపోయాడు.

"బాంకు దగ్గర కలుద్దాం భార్గవగారూ! మూడు గంటలకి రండి"

"అలాగే కలుద్దాం" అని సారథితో కరచాలనం చేసి భార్గవ వెళ్లిపోయాడు.

★ ★ ★

అనూరాధ, ఉషాబాల గ్రంథాలయంలో మాట్లాడుకుంటున్నారు. గ్రంథాలయాధికారి కమల వారి దగ్గర వుంది.

"నమస్కారం కమలగారూ" అంటూ సారథి గ్రంథాలయంలోకి వచ్చాడు.

సారథిని కమల సాదరంగా ఆహ్వానించింది.

అనూరాధ సారథికి ఉషాబాలని పరిచయం చేసింది.

ఉషాబాల చేతులు జోడించి సారథికి నమస్కారం చేసింది.

తన తల్లి నాగరాణి "రాకుమారుడు" అని సారథిని అనటం విన్నదిగాని మనిషిని చూడలేదు. అలా ఎందుకు వర్ణించిందో ఇప్పుడు అర్థమైంది.

"మా వీరవరం ఎలా వుంది సారథి బాబూ? " అన్నది కమల.

"సారథిగారు వీరవరం స్వర్గసీమలా వుందంటారులే పిన్నీ. చక్కగా వర్ణిస్తారు" అన్నది అనూరాధ నవ్వుతూ.

కొంతసేపు పత్రికలు చదివి సారథి బ్యాంకు దగ్గరికి వెళ్లాడు

భార్గవ కూడా ఆ సమయానికి బ్యాంకు దగ్గరికి వచ్చాడు. సిండికేటు బ్యాంకు మేనేజరుకి సారథి భార్గవని పరిచయం చేశాడు. ముగ్గురూ మంచి మిత్రులై అరమరికలు లేకుండా రహస్య విషయాలు కూడా మాట్లాడుకున్నారు. విద్యాసాగర్ స్నేహశీలి.

"విజయసారథిగారూ! మీరు, భార్గవగారు, వీరవరంలో సరదాగా అజ్ఞాతవాసం చేస్తున్నారే" అన్నాడు బ్యాంకు మేనేజరు విద్యాసాగర్.

"అజ్ఞాతవాసం భార్గవగారు అవసరం వుండే చేస్తున్నారు. నేను మాత్రం సరదాగా జనంతో కలిసి తిరగాలని చేస్తున్నాను. ఎల్లుండివరకే మా ఇద్దరి అజ్ఞాతవాసం. ఆ తరువాత భార్గవగారు అక్రమ కాపుసారా వ్యాపారులపైన, జూదగృహాలమీద, తాగుబోతులమీద విజృంభిస్తారు. హడలెత్తిపోయేలా ప్రక్షాళన ప్రారంభిస్తారు" అన్నాడు సారథి.

"వీరవరం ప్రజల్ని ఆశ్చర్యపరుస్తూ విజయసారథిగారు, నేను అజ్ఞాతాన్ని విడుస్తాం" అన్నాడు భార్గవ.

"భార్గవగారూ! తాతయ్యని, అమ్మమ్మని పరిచయం చేస్తాను రండి"

"పదండి. అంతమంచి తాతయ్యని, అమ్మమ్మని చూడాల్సిందే" విద్యాసాగర్‌తో చెప్పి, ఇద్దరూ రాఘవేంద్రగారి ఇంటికి వచ్చారు.

సారథితో కలిసివస్తున్న కొత్త యువకుణ్ణి చూసి "రండి బాబూ! అంటూ ఆ దంపతులు సాదరంగా ఆహ్వానించారు.

పార్వతీపరమేశ్వరుల్లా వున్న ఆ దంపతులకి భార్గవ చేతులు జోడించి నమస్కారాలు చేశాడు.

"మా మిత్రుడు భార్గవ. వీరవరంలో పని వుండి వచ్చాడు తాతయ్యా. వీరవరం అంటే అభిమానం వుంది. మిమ్మల్ని చూడాలని వచ్చాడు"

"చాలా సంతోషం. వీరవరంలో ఎన్నాళ్లుంటావు బాబూ?"

"వచ్చిన పని అయ్యేదాకా వుండాలండీ. అవసరమైన పనిమీదే వచ్చాను. కొంచెం సమయం తీసుకుంటుంది. ఇక్కడ రవీంద్ర అనే మిత్రుడున్నాడు. అతని ఇంటికి వచ్చాను. అతను కానిస్టేబుల్‌గా వీరవరం పోలీసు స్టేషనులో చేస్తున్నాడు. ఉదయం వాకింగులో సారథిగారు కలిశారు." అన్నాడు

'పెద్దవారితో నిజం చెప్పలేకపోతున్నానే' అని లోలోన అనుకున్నాడు.

"అయితే అప్పటివరకు సారథిబాబుతో కలిసి మా ఇంట్లో వుండు బాబూ. ఎక్కడో వుండటం ఎందుకు?" అన్నది వైదేహి.

"కర్షకులు అన్నదాతలు బాబూ! మాది కర్షకుల కుటుంబం. ఇక్కడే భోజనం చెయ్యి" అన్నాడు రాఘవేంద్ర.

"రవీంద్ర తల్లి నన్ను కన్నకొడుకులాగే చూస్తుంది తాతయ్యా. రవీంద్ర నాకు కాలేజీలో క్లాసుమేటు కూడా. నేను ఇక్కడే వుంటే రవీంద్ర తల్లి బాధపడుతుంది" అన్నాడు భార్గవ.

వైదేహి సారథికి, భార్గవకి సున్నివుండలు ప్లేట్లలో పెట్టి ఇచ్చింది. తర్వాత ఇద్దరికీ టీ ఇచ్చింది.

"తాతయ్యా! ఒకసారి సారథిగారు, నేను ఊరు తిరిగి చూసివస్తాం"

"అలాగే చూసిరండి. కాలక్షేపంగా వుంటుంది"

★ ★ ★

సారథి, భార్గవ, వీరవరం వీధి వీధి చూస్తూ నడుస్తున్నారు. హరిజనవాడకు వచ్చారు. అక్కడ ఒకవీధిలో పాత పెంకుటింట్లో చాపలు పరిచి, పేకాట ఆడుతున్నారు. ఆ ఇల్లు మధ్యహాలు విశాలంగా వుంది. రెండు వైపులా తలుపులు, దర్వాజాలు వున్నాయి. ఆటగాళ్లు పదిమంది వున్నారు. వాళ్లు ఆడే ఆటపేరు కోతముక్క.

ఆ కోతముక్క ఆటలో కొద్దిమందికి డబ్బు వచ్చినా, ఎక్కువమందికి జేబులు ఖాళీ అవుతాయి. జూదగృహ యజమానికి ఇంటి అద్దె, పేకముక్కల ఖరీదు, పోలీసుల మామూళ్లు, ముందే వసూలు చేస్తారు. ఎవరెంత నష్టపడ్డా జూదగృహ యజమాని మాత్రం ముందే డబ్బు దండుకుంటాడు.

భార్గవ ఆటగాడిలా ఆ ఇంట్లో ప్రవేశించాడు. దర్వాజలు పరిశీలిస్తూ పది రూపాయిలు ఆటలో కాశాడు. పదికి పది వచ్చాయి. మళ్లీ పది కాశాడు. రెండవసారి ఆ పది పోయాయి. మళ్లీ ఇరవై కాశాడు. ఇరవైకి ఇరవై వచ్చాయి. అంతటితో భార్గవ ఆట ఆపాడు. సారథితో కలిసి బయటికి వచ్చాడు.

"ఈయనెవరో తెలివైనోడేరా. జేబు కాళీ కాకముందే లాభంగా జారుకున్నాడురా" అన్నాడొకడు. ఆ మాటలు భార్గవకి వినపడ్డాయి. ఇద్దరూ నవ్వుకుంటూ అదే వీధిన ముందుకు వచ్చారు.

ఒక ఒంటి దూలం పూరింటికి ముందువైపున విశాలమైన వసారా వుంది. ఆ వసారాలో జాడీ పెట్టుకుని ఒక వ్యక్తి కాపుసారా అమ్మకం సాగిస్తున్నాడు. భార్గవ, సారథి అక్కడికి వచ్చి పక్కన నిలిచి చూస్తున్నారు.

అప్పుడే అక్కడికి ఒక మధ్యవయస్కుడు వచ్చి ఒక గ్లాసు సారా తాగి డబ్బు ఇచ్చాడు. ఇంకా అక్కడే నిలబడి "రత్తయ బావా! ఇంకో గ్లాసు బొయ్యి. డబ్బులు రేపిత్తాగాని" అన్నాడు.

"అప్పు మాత్తరం పొయ్యనబ్బాయ్! అప్పులు బోసి కూకుంటే నా యాపారానికి తిప్పలొచ్చినట్టే" అన్నాడు సారాకొట్టు రత్తయ్య.

"ఇదుగో బావా! నెలపొడుగునా నీ సారా కొట్టుకి వందలకి వందలు తగలేత్తన్నం గదా. ఒక్కపూట అప్పడిగితే పొయ్యనంటవేం? మరీ పట్టూ ఇడుపూ లేకుండబొయ్యిందే. ఇట్టయితే నిన్ను పోలీసోళ్లకి పట్టిత్తా. నీ యాపారం అసలే మూలబడుద్ది. ఏంటనుకుంటన్నవో"

"అరే నీలాంబరం! నన్ను బెదిరిత్తన్నావురా. నక్కంజూసినోడల్లా యాటకాడేనంట్రా. నన్నెవుడ్రా పట్టుకునేది?

"యస్సై దగ్గర్నుంచి యమ్మెల్యేకి, యస్.పి. దాకా యేలకియేలు గుమ్మరిత్తన్నంరా. అట్టా యాపారం సాగిత్తన్నం. సారాకొట్టోళ్లంతా టాలాటోలీగా యాపారం జేత్తన్నారనుకున్నవా? యెర్రినాయాల. మబ్బుకింద బుట్టినోడు మా యాపారం ఆపలేడు తెలుసా"? "

"నేనేదో నవ్వులాటకన్నాలే రత్తయబావా! ఇయ్యాల అప్పుజేసి తాగితే రేపు కట్టొద్దూ. ఈరెవురో వచ్చారు సూడు" అంటూ అతడు వెళ్లాడు

"మందేవూరు బాబుగారూ? సారాకోసం వచ్చారా? రాండి. ఈ బల్లమీద కూకోండి. నిప్పులాంటి సరుకుంది. మీకు దుకాణం వుంటే హోల్ సేల్‌గా కూడ దొరుకుద్ది. ఇంటి దగ్గర తాగటానికైతే సీసాల్లో బోసి యిత్తా.

బాలింతరాళ్లకి గూడ మా సరుకు పనికొచ్చుద్ది. అగ్గిపుల్ల గీసి కాల్చిసూసుకోండి. నీలి మంటొస్తేనే తీసుకోండి. ఈ రత్తయ్య సరుకెట్టాటిదో ఎవర్నైనా అడిగి తెలుసుకోండి"

"ఊరు చూద్దామని బయలుదేరాం రత్తయ్యా. నీ దుకాణం గురించి తెల్సిందిగా. కావాల్సినప్పుడు తప్పకుండా వస్తాం. నిప్పులాంటి సరుకన్నావుగా నీ మాటమీద నమ్మకం కుదిరింది. 'హోల్ సేల్'గా కుదుర్చుకుందాం

"అది సరే రత్తయ్యా! ఇంతకుముందు నువ్వు ఎం.ఎల్.గారి, పేరెత్తావేంటి? మీ కాపుసారా వ్యాపారంతో ఆయనకేం సంబంధం? "

"అమ్మో! ఆయన గురించి మీకేందెల్లు బాబుగారూ? ఈ సుట్టుపట్టు వూళ్లల్లో వున్న సారా దుకాణాలు, సారాబట్టీలు, పేకాట సెంటర్లు, ఆయన సెయ్యిలేంది యేదీ లేదు. యీటికన్నిటికీ అందే ముడుపుల్లో ఆయనకి వాటా వుంటది. యెమ్మెల్లే గారిదంతా లోపాయకారీ బేరంలేండి. సంపాదన లచ్చల్లో వుంటది. యెవుడన్నా బాలాజీగారికి వాటా యియ్యకుండ యెగె

య్యాలని సూశారనుకోండి. యెంటనే కని పెడతడు. యిగ వాడి బతుకు బజార్న బడే స్తడు. అందుకని ఆయన వాటా ఆయన కుంటది"

"మళ్లీ కలుస్తాం రత్తయ్యా! మంచి విష యాలు చెప్పావు" అంటూ భార్గవ, విజయ సారథి కొంచెం ముందుకు వచ్చారు.

అక్కడ ఒక చిన్న పెంకుటిల్లు వుంది. ఆ ఇంటిముందు వసారాలో సుమారు ఇరవై అయిదేళ్ల వయసున్న యువతి తలనిండా కనకాంబరం పూలతో లేత గులాబీరంగు చీరె కట్టుకుని ప్రత్యేకమైన అలంకరణతో నిలిచివుంది. మనిషి అందంగా వుంది.

ఇంటిముందు మల్లె, మందారం, గులాబీ, కనకాంబరం, పూలమొక్కలున్నాయి. ఇంటి ఆవరణలోని పూలమొక్కలు, మనుషులు కనబడేలాగా ఎత్తు తక్కువగా కట్టిన ప్రహరీగోడ వుంది. ప్రహరీగోడ వీధివైపున వున్న గేటుదగ్గర యాభైయేండ్ల వయసున్న మహిళ నిలబడివుంది.

ఇంటి వసారాముందు నిలిచివున్న యువతి మెల్లగా, 'సంగమ్మపిన్నీ' అన్నది. ఆ పిలుపే గేటు దగ్గరున్న మహిళకు సంకేతం.

సారథి, భార్గవ సారాకొట్టు రత్తయ్య మాట్లాడుతున్నపుడే సంగమ్మ, ఆ యువతి చూశారు. సారాకొట్టుకు వచ్చారుగనుక యువకులిద్దరూ మందు, మగువల పొందు కోరేవారే అయివుండవచ్చు నన్న ఆశ ఆ యువతికి కలిగింది. ఈరోజు మంచి బేరం తగిలింది అనుకుంది. 'సంగమ్మ పిన్నీ' అని మెల్లగా హెచ్చరించింది.

మెల్లగా అన్నా ఆ హెచ్చరిక పిలుపు యువకుల చెవినబడింది.

"ఏవూరు బాబూ తమరిది? " అని గేటు దగ్గరున్న సంగమ్మ అడిగింది.

"మాది గుంటూరు. వేరే పనిమీద వచ్చాం. ఊరు చూద్దామని సరదాగా ఇటు బయలుదేరాం" అన్నాడు భార్గవ.

"సారాకొట్టు రత్తయ్యతో బేరమాడతన్నా రుగా బాబుగారూ! సరుకు కొన్నారా? బేరం కుదిరిందా? "

"సారా కొనలేదులే సంగమ్మా. అతడే వివరాలు చెప్పాడు, విన్నాం. ఊరు మాకు కొత్తగదా. విషయాలు తెలుసుకుందామని సరదాగా బయలుదేరాం" అన్నాడు సారథి.

"అమ్మో బాబుగారూ! నా పేరు తెలుసు కున్నారే. మీరు ఆవులిస్తే పేగులు లెక్కబె ట్టగలిగినోరే. సరదా వున్నోరే. నేం జెప్పేది వినండి. పల్లెకంతటికీ మేలైన మల్లెమొగ్గ లాంటి పిల్ల ఎదురుగా వుంది సూడండి.

పేరు సంధ్యారాణి. పదో తరగతి వరకు చదివింది.

ఈ పక్క పెంకుటింట్లో యింకొక పిల్ల వుంది. అదీ ఇట్లాంటి అందమైన పిల్లే. అదీ పదో తరగతి వరకు చదివింది. దానిపేరు రమణి.

నేం జెప్పితే మీరు నమ్ముతారో లేదోగాని బాబుగారూ! ఈ పిల్లలిద్దరూ మీలాంటివా రికి దప్ప అందరికీ చోటివ్వరు. నేను గాలి మాటలు చెప్పేదాన్ని గాదు. కొద్దోగొప్పో చదువుకున్నదాన్నే. కావాలంటే మాట్లాడతా. మీరు కాదనేవారు కాదని నాకనిపించి, మిమ్మల్ని కదిలించాను. ఏమంటారు బాబు గారూ!" అన్నది సంగమ్మ ఆశగా.

వసారాలో వున్న సంధ్యారాణి వాళ్ల సంభాషణకి అడ్డు రాకుండా లోపలికి వెళ్లింది.

"సంగమ్మా! నువ్వన్నట్లు మల్లెమొగ్గ లాంటి పిల్లే. మేం చూశాంగా. ఇంకొక పిల్ల కూడా ఇలాంటిదే నన్నావుగా. నీ మాటలు నమ్ముతాం. నువ్వు చదువుకున్నదానివేనని నీ మాటలే చెబుతున్నాయి. అసలు వీళ్లు ఈ వృత్తిలో ఎందుకు దిగారు? వివరంగా చెప్పు" అన్నాడు భార్గవ.

"ఏం చెప్పను బాబుగారూ, వీళ్లిద్దరికీ ఇది వరకే పెళ్లిళ్లు అయినాయి. వీళ్లని చేసుకున్న అబ్బాయిలు మొదట మంచిగానే వున్నారు.

అన్ని పనులు తెలిసినోళ్లు. కష్టగాళ్లు. కాపు రాలు బాగానే సాగినాయి.

కొంతకాలం తర్వాత మాయదారి కాపు సారా దుకాణాలు, కోతముక్క పేకాట సెంటర్లు, వీధివీధికి వెలిశాయి. వీళ్ల భర్తలిద్దరూ ముందుగా పేకాటకీ, తర్వాత తాగుడికీ, అలవాటుపడ్డారు. సావాస దోషా లవల్ల చవకగా దొరికే కాపుసారాకి, పేకా టకి సంపాదనంతా తగలేసి, వట్టిచేతులతో ఇంటికొచ్చేవాళ్లు. తాగినమైకంలో వీళ్లకి ఏవో అక్రమ సంబంధాలు అంటగట్టి అస భ్యంగా తిట్టటం, కొట్టటం సాగించారు. వీళ్ల అందం వీళ్లకొక శాపం అయింది.

ఇంట్లో తిండిగింజలు లేక ఇటు పస్తులు, తాగివచ్చే భర్తలతో తన్నులు. అలా బాధలు పడిపడి, భరించలేక తెగబడి, ఇద్దరూ కోర్టుకెక్కి విడాకులు తీసుకున్నారు. మళ్లీ పెళ్లి మాట ఎత్తకుండా ఈ వృత్తిలో దిగారు. ఇద్దరూ అక్కచెల్లెళ్లే"

"అలాగా సంగమ్మా. మనసు విప్పి మంచిగా నిజం చెప్పావు. అవసరమనుకు న్నపుడు వస్తాంలే. అని భార్గవ ఇరవై రూపాయలు సంగమ్మ చేతిలోపెట్టి "ఇప్ప టికి ఇవి వుంచుకో" అన్నాడు. అక్కడినుండి ఇద్దరూ ముందుకు సాగారు.

అదే వీధిన మరో యాభైగజాలు ముందుకు నడిచారు. అక్కడొక చిన్న బంగళాలాంటి అందమైన పెంకుటింటి వసారాలో సుమారు డెబ్బయ్యేళ్ల వయ సున్న వృద్ధురాలు నిలబడి వుంది.

ఇంటిముందుకు వచ్చిన యువకులిద్దరినీ ఆ వృద్ధురాలు నిలవేసింది. "అయ్యా బాబులూ! ఏ వూరు మీది? "

"మాది గుంటూరు. ఈ వీరవరంలో పని వుండి వచ్చాం. ఊరు చూద్దామని ఇటుగా వచ్చాం"

"నాయనలారా! మీరిద్దరూ చూడముచ్చ టగా వున్నారయ్యా. ఇద్దరూ వీధిన నడ స్తుంటే కృష్ణార్జునుల్లాగే వున్నారు. మీరు ఆ సంధ్యారాణి ఇంటిముందు నిలబడి సంగ మ్మతో మాట్లాడి, డబ్బులివ్వటం చూశాను. ఊరు చూడాలని వచ్చి మీరు ఆ పాపకూ పంలో ఎందుకు పడతారు?

అయ్యా! నా పేరు సత్యవాణి. టీచరుగా చేసి రిటైరైనదాన్ని, పెద్దదాన్ని, మీ మేలు గోరి చెబుతున్నా. ఆ పాపకూపంలో పడొద్దు. నా మాటినండి. రాండి. ఈ సోఫాలో కూర్చోండి. సంగమ్మకి డబ్బులెం దుకిచ్చారు? "

సారథి, భార్గవ ఒకరినొకరు చూసుకుని నవ్వుకున్నారు. వసారాలో వున్న సోఫాలో కూర్చున్నారు.

"అమ్మమ్మా! మేం పాపకూపంలో పడ్డవా ళ్లని బయటికి లాగి కాపాడేవాళ్లమే గాని మేం పడం. మేము అటువంటి వాళ్లం కాదు" అన్నాడు సారథి.

"ఆ సంధ్యారాణి, రమణి అనేవాళ్లు ఆ వృత్తిలో ఎందుకు దిగారో, మూల కారణం ఏమిటో చెప్పమని సంగమ్మని యుక్తిగా అడిగాం. ఆమె వాళ్ల పూర్వాపరాలు వివ రంగా చెప్పింది. అందుకు మెచ్చి ఇరవై రూపాయిలు బహుమతిగా ఆమె చేతిలో పెట్టానమ్మమ్మా" అన్నాడు భార్గవ.

"అదా సంగతి? మా నాయన్లే. మీరు వాళ్ల వలలో పడతారేమోనని భయపడి మిమ్మల్ని అనుమానించానయ్యా. మీరు పాపకూపంలో పడ్డవాళ్లని బయటికి లాగే వాళ్లమే ననటం నాకెంతో ఆనందం కలిగిం చింది. మీరు నన్ను అమ్మమ్మా అని పిలిచే సరికి నా మనసు పరవశించిపోయిం దయ్యా. చల్లగా నూరేండ్లు వర్ధిల్లండి." అంటూ ఆ సత్యవాణి ఇంట్లోకి వెళ్లి అరటి పండ్లు తెచ్చింది. చెరి రెండు పండ్లు చేతు ల్లోపెట్టి, బాబులూ! మీ అమ్మమ్మే ఇచ్చిం దని తినండయ్యా" అన్నది.

ఇద్దరూ నవ్వుతూ తిన్నారు. "అమ్మమ్మా! మళ్లీ కలుస్తాం. ఈసారి మేము నిన్ను కలి సేటప్పటికి ఈ వీధిలో పాపకూపాలు,

సారా దుకాణాలు వుండవు. మీరెలా చేయ గలరని మమ్మల్ని అడగొద్దు" అన్నాడు భార్గవ.

"ఎంత సంతోషకరమైన మాట విన్నాను బాబులూ! మీకు నా ఆశీస్సులు"

భార్గవ, సారథి అక్కడినుండి వీధిలోకి వచ్చారు.

"ఈ అపర శబరి సత్యవాణి పరిచయం మనకి చాలా ఆనందం కల్గించింది భార్గవ గారూ! ఈమెది నిర్మల హృదయం. మన పట్ల చూపిన వాత్సల్యం మరపురానిది" అన్నాడు సారథి.

"అవును విజయసారథిగారూ! మనల్ని కృష్ణార్జునులు అని వర్ణించింది. అది మనం సార్థకం చేద్దాం. ఈ సత్యవాణి మాట సత్యం కావాలి" అన్నాడు భార్గవ.

"భార్గవగారూ! మనం ఇక్కడి సెంటరుకు వెళ్లి జనవాక్యం విందాం"

ఇద్దరూ నాలుగు వీధులు కలిసే సెంట రుకు వచ్చారు. అక్కడొక హోటలుంది. ఆ పరిసరాలలో వున్న టీ బడ్డీలకంటే అది కొంచెం విశాలంగా వుంది. శుభ్రంగా వుంది. కూర్చోవటానికి బల్లలున్నాయి. ఆ హోటల్ యజమాని పేరు చిన్నారావు. ఒక వామపక్షపార్టీ అభిమాని. హోటల్ అరుణ అని పేరుంది.

పల్లెటూరు హోటళ్లలో ఊళ్లో విషయాలు చర్చకు వస్తాయి. ఆ సంగతి సారథికి భార్గ వకి తెలుసు. హోటళ్లలో అడుగు పెట్టారు.

విద్యావంతుల్లాగా కనబడుతున్న యువ కులిద్దరినీ చూసి చిన్నారావు రండి సార్ అని ఆహ్వానించాడు. అక్కడ బల్లలమీద ఖాళీలేదు. కబుర్లు చెప్పుకుంటూ కూర్చున్న యువకులతో బల్లలు నిండి వున్నాయి. చిన్నారావు ఒక బల్లమీద వున్నవాళ్లని సర్దు కోమని ఖాళీచేయించి సారథిని, భార్గవని కూర్చోబెట్టాడు.

"మనుషులొస్తే కనపట్టంలేదంట్రా, సర్దు కునే పన్లేదా? మందమతి నాయాళ్లకి తోలుమందం. పోసుకోలు కబుర్లు జెప్పు కుంట సూడనే సూడరు" అని అక్కడున్న పెద్దమనిషి ఒకాయన కసురుకున్నాడు.

"సూళ్లేదులే మావా. సూత్తే సర్దుకోవా" అన్నారా యువకులు.

సారథి, భార్గవ టీ కావాలని చెప్పారు. చిన్నారావు వాళ్లకి స్పెషల్‌గా టీ తయారు చేసి ఇచ్చాడు. పల్లెటూళ్లలో కొన్ని హోట ళ్లలో మామూలు టీ, స్పెషల్ టీ వుంటాయి. స్పెషల్ టీ రేటెక్కువ.

"ఏ ఊరు బాబూ మనది? " కుర్రోళ్లని కసురుకున్న పెద్దాయన అడిగాడు.

"మాది గుంటూరండీ. మాకు ఈ వీరవ రంలో పనివుండి వచ్చాం. ఈ ఊరు చూద్దామని ఇటు వచ్చాం" అన్నాడు భార్గవ.

"ఏం జూత్తారు బాబూ యీ వూరు. ఎన కటిలాగుందా ఏమన్నానా? కొత్తకొత్త కాపు సారా కొట్లు, కోతముక్క పేకాట సెంటర్లు, తాగుబోతు నాయాళ్ల అల్లరి, సిన్నారి వయ్యారి బామల సిద్విలాసాలు, అన్నీ కొత్తకొత్త సిత్రాలొచ్చిపడ్డాయి. దొంగసారా అమ్మే తొత్తు కొడుకులు బాగుపడతన్నారు. ఊరుపోరగాళ్లంతా సెడిపోతన్నారు" అన్నాడా పెద్దమనిషి.

"ఇదుగో మావా! పాత యస్సై మారి పోయి కొత్త యస్సై వస్తండంట. కాపుసారా కొట్టోళ్ల యాపారం కట్టు. కోతముక్క పేకాట సెంటర్లు బంద్" అన్నాడొక యువకుడు.

"కొత్త యస్సై వచ్చి మడిగట్టుకుని కూకుంటడేంటిరా? ఎమ్మెల్లే బాలాజీ, కాపు సారా కొట్టోళ్లు, కిందున్న పోలీసులు అందరూ పోగై ముడుపులు ముట్టజెప్పి బుట్టలో యేసుకుంటారు. అంతా గప్‌చుప్. మళ్లీ ఎప్పుటాటే. పాడైపొయ్యేది మన పోర గాళ్లే" అన్నాడొకాయన.

"కింద పోలీసులంటన్నవ్. ఆళ్లని గూడ సగంమందిని మార్చి కొత్తోళ్లనేశారంట. ఇగ ఇప్పుడున్నోళ్లంతా గట్టోళ్లేనంట" అన్నాడు

మొదటి వ్యక్తి.

"ఎంత గట్టోళ్లయితే అంత తొందరగా ఇక్కణ్ణుంచి మళ్లీ ఎల్లిపోతారు" అన్నాడు మరొక పెద్దమనిషి.

"ఏం ఎందుకని? పెద్ద తెలిసినట్టే జెపుతున్నవ్"

"ఎందుకా? మన ఎమ్మెల్యే బాలాజీ తనకి ముడుపులొచ్చే యాపారాలు మూత బడతంటే ముడుసుకోని కూసుంటడా? యస్.పి.ని బట్టుకుంటడు. తనకి ఎదురు దిరిగిన యస్సైని యెంటనే యింకో జిల్లాకి పంపిస్తడు. మళ్లీ తనకనుకూలమైనోళ్లనే ఇక్కడికి రప్పించుకుంటడు. ఎవురెరగని బాగోతాలయ్యా" అన్నాడా పెద్ద మనిషి.

"చివరికి జరిగేదంతేనయా. అంతా మాయే. సెడిపొయ్యేది, గాడిదలమయ్యేది మనవే. వాళ్లూ వాళ్లూ ఒకటే. దొంగలు దొంగలు వూళ్లు పంచుకున్నట్టే జరుగుద్ది" అన్నాడు మరొక పెద్దమనిషి.

"ఇదుగో నర్సయ మావా! ఎల్లకాలం సీకటే వుంటదా? ఎన్నెలగూడా వస్తది. మరీ నిరాశ పడొద్దు. పాత యస్సైని, పాత పోలీసుల్ని మార్సేశారంటే పైనుంచే ఏదో పకడ్బందీగా జరిగింది. ఇదేం అల్లాటప్పా యవారంగాదు. ఊరు పాడైపోతంటే మన వూరు పెద్దలు సూత్తా వూరుకుంటారా? వచ్చే కొత్త యస్సై గట్టాయనే అయ్యుంటడు. నాకా నమ్మకం వుంది" అన్నాడు హోటల్ యజమాని చిన్నారావు చివరిగా.

భార్గవ, విజయసారథి సంభాషణంతా చిరునవ్వుతో విన్నారు. టీకి డబ్బులు చెల్లించి బయటికి వచ్చారు.

"మన యాత్ర సఫలం అయింది" అన్నాడు విజయసారథి.

"చాలా విషయాలు తెలుసుకున్నాం. సంతోషంగా వుంది" అన్నాడు భార్గవ.

★ ★ ★

అలనాటి పలనాటి నాగమ్మ బ్రహ్మనాయుడిపై కత్తిగట్టి ప్రళయం సృష్టించింది. యుద్ధంలో ఓడిపోయి బ్రహ్మనాయుడికి క్షమాపణ చెప్పింది. అప్పటికే జననష్టం జరిగి సర్వనాశనమైంది.

బ్రహ్మనాయుడిపై దీర్ఘకాల ద్వేషంతో నాగరాణి, బ్రహ్మనాయుడి ఆస్తిపై ఆశతో, సారథిపై ఈర్ష్యతో కమలాంబ ఇద్దరూ సన్నిహితులయ్యారు.

కూతురు రమాదేవికి, భర్త కేశవరావుకి, తెలియకుండా కమలాంబ వార్తల సరస్వతి ఇంట్లో నాగరాణిని కలిసి రహస్యంగా మాట్లాడింది.

"అమ్మా, నాగరాణీ! నువ్వు తెలివైనదానివి. ధైర్యశాలివి. చదువుకున్నదానివి. నా బాధని సానుభూతితో అర్థం చేసుకుంటావని మనసువిప్పి నీకు నిజం చెబుతున్నా. నాకున్న ఒక్కగానొక్క కొడుకుని మంచిగా ఒక ఇంటివాణ్ణి చేద్దామని ఆశపడుతున్నా. అనూరాధని నా కొడుక్కి చేసుకుంటే నా ఆశ నెరవేరుతుందమ్మా. నా కన్నకూతురే నాకు ఈ విషయంలో సాయం చెయ్యటం లేదమ్మా. అందుకు బాధగా వుంది. ఇప్పుడీ సారథి అనేవాడొకడు తయారయ్యాడా. నా ప్రయత్నానికి వాడు పెద్ద అడ్డంకి అయ్యాడా.

వాడు అందగాడు. చురుకైనోడు. బ్రహ్మనాయుడి అభిమానం సంపాదించి అనూరాధని ఆకర్షించి ఎగరేసుకుపోయేలా వున్నాడు. అతణ్ణి అడ్డు తొలగించుకోకపోతే నా ప్రయత్నం సఫలం కాదు. ఈ విజయదశమికి ముందే వీరవరం నుండి సారథిని మాయం చెయ్యాలి. ఈ పనిలో నాకు నీ అండ కావాలమ్మా" అని వేడుకున్నది కమలాంబ.

"కమలాంబ పిన్నీ! ఇటువంటి విషయాల్లో నేను జోక్యం పెట్టుకోను. నీ కార్యసాధనకి తగిన వ్యక్తి చందన్. ఎటువంటి వెధవ పనికైనా వాడు వెనుకాడడు. వాడికి మన ఎం.ఎల్.ఏ. బాలాజీ అండ వుంది. వాడు బాలాజీకి ముఖ్య శిష్యుడు.

ఆ బాలాజీ చేసేవి కూడా వెధవపనులేలే. వాళ్లకి కావాల్సింది డబ్బు. అది నీ దగ్గరుంటే అందించు. నీకు కావాల్సిన పని వాళ్లు చేసి పెడతారు. అన్ని విషయాలు వాళ్లకే చెప్పు. వాళ్లకి అధికారుల అండ వుంది. అదీగాక బ్రహ్మనాయుడికీ, ఆ బాలాజీకి బద్ధవిరోధం వుంది. అతనిమీద వున్న ద్వేషంతో నువ్వను కున్న పని తప్పకుండా చేసిపెడతారు. ఇక ముందు నన్ను ఏమీ అడగొద్దు.

చివరగా ఒక మాట. నువ్వా సారథిని వెళ్లగొట్టాలనుకోవటం నాకు ఇష్టంలేదు అది అన్యాయమే. నువ్వు ప్రాధేయపడి అడి గావని ఈ రహస్యం దాస్తున్నాను. ఇక ముందు ఈ విషయంలో సలహాకి నా దగ్గ రికి రావద్దు" అన్నది నాగరాణి.

"అమ్మా! ఇక నీ దగ్గరికి రాను. ఈ విషయం మాత్రం రహస్యంగా వుంచు!" అని మరీ మరీ వేడుకొని కమలాంబ వెళ్ళి పోయింది.

సరస్వతి ఇంటికి చందన్‌ని పిలిపించు కొని మంతనాలాడింది కమలాంబ. వాడికి డబ్బు అందించింది. చందన్ తన పిన తండ్రి చిదంబరంతో కలిసి ఆఘమేఘాల మీద స్కూటరుతో బాలాజీ దగ్గరికి వెళ్లాడు. విషయమంతా చెప్పాడు.

చందన్ చెప్పిన విషయం విని బాలాజీ ఆనందంతో పొంగిపోయాడు. బ్రహ్మనా యుడు ముఖ్యమంత్రిని కలిసినప్పుడు బాలాజీ ప్రవర్తన గురించి, అతని సంపా దన గురించి పూసగుచ్చినట్లు చెప్పాడు. ముఖ్యమంత్రి బాలాజీని మందలించాడు. మంత్రిపదవి సంపాదించాలనే ప్రయ త్నంలో వున్న బాలాజీకి మందలింపు ఎదు రైంది. బ్రహ్మనాయుడిమీద ఆ కక్ష వుంది.

బ్రహ్మనాయుడి కుటుంబంలో ఆరని చిచ్చు రేపాలి. అన్నదమ్ముల ఐక్యతని కమ లాంబద్వారా కలతలురేపి విచ్ఛిన్నం చేయాలి. అందుకు వ్యూహం పన్నాలి.

చందన్ మిత్రుడు గోపాల్‌కి బాలాజీ కానిస్టేబుల్ ఉద్యోగం ఇప్పించాడు. విజయ వాడలో ఉద్యోగం చేస్తున్న గోపాల్‌ని నంది గామకి పిలిపించుకున్నాడు. వీరవరం పక్కనే వున్న దేవనగరంలోని ధనికరైతు పాపారావు బాలాజీకి ముఖ్యశిష్యుడు. ఆ సమయంలో పాపారావు బాలాజీ దగ్గరే వున్నాడు.

పాపారావు దేవనగరంలోని గూండాలకు గురువు, పోషకుడు.

బాలాజీ, పాపారావు, చందన్, గోపాల్, చిదంబరం అయిదుగురూ సారథిని విజయ దశమికి ముందురోజు కిడ్నాప్ చెయ్యాలని వ్యూహం పన్నారు.



ఊరికి తూర్పుగా పొలం వెళ్లే డొంకప క్కన వినుకొండ వీరభద్రయ్యకి మామిడి తోట వుంది. ఆ తోటకి తూర్పువైపున పక్కనే చవిటి మైదానం వుంది.

అది పంటకి పనికిరాని భూమి కనుక ఖాళీగా వుంది.

ఆ మైదానానికి దక్షిణంగా వీరభద్రయ్య మామిడితోట పక్కనే నాగరాణి తోట వుంది. అది పది ఎకరాలు. తోటలో తాటా కుల పాక వుంది.

విజయదశమికి ముందుగా నాగరాణి మామిడితోటలో ఎనిమిది మంది కొత్త మనుషులు తిరుగుతుండటం వీరభద్రయ్య గమనించాడు. పక్కనే వున్న తోట గనుక దగ్గరికి వెళ్లి పలకరించాడు.

“ఏ వూరబ్బాయ్ మీది? తోటలో తిరుగు తున్నారేంటి? ”

“మాది తెనాలి పక్కవూరండి. మామిడి తోట కాపుబేరానికి వచ్చాం. మేం పూత మొదలవకముందే తోట వాలకంజూసి బేరంజేసి కొంటామండి. మాకు అదృష్టం బాగుంటే లాభాలొస్తయ్యండి. లేకపోతే సొమ్ముజేసుకుంటామండి.”

“మీతోపాటు దేవనగరం పాపారావు, చందన్, గోపాల్ వున్నారెందుకు? మీతో వాళ్లకేంపని? ”

“పాపారావుగారికి తోటుందిగదండి! దాన్ని బేరం జేత్తన్నాం. ఇంకా వూళ్లో ఒక నిమ్మ తోట, సపోటాతోట వున్నాయని చందన్, గోపాల్ చెప్పారండి. ఈ నాగరాణిగారితోట చందన్ ద్వారా బేరం జరుగుతావుంది. ఇంకా ఏతోటా బేరం కుదరలేదండి”

వాళ్లేది చెప్పినా వాళ్లమాటలు నమ్మద గ్గవిగాలేవని వీరభద్రయ్యకి అనిపించింది. దేవనగరం పాపారావు, చందన్, గోపాల్ ఎటువంటివాళ్లో వీరభద్రయ్యకి బాగా తెలుసు. వీళ్లేదో దుష్టకార్యం తలపెట్టారని అనుమానించాడు. తనతోటలోనుంచి తూర్పుగావున్న చవిటి మైదానంలోకి మనిషి పోవటానికి వీలుగా కంచెకి ఒక కంతచేసి వుంచాడు. దాన్ని తాత్కాలికంగా ఒక మండ అడ్డంవేసి మూసి వుంచాడు.

పనిలేనప్పుడు వీరభద్రయ్య నిద్రబో వటంలో కుంభకర్ణుడే. కాని ఏదైనా ముఖ్య మైన ఆలోచనలో పడితే నిద్రపోడు. వీరభ ద్రయ్యకి నిద్రబట్టలేదంటే విశేషమేదో వున్నట్లే. ఉదయం అయిదు గంటలకే లేచి తోటకి వస్తున్నాడు.

★ ★ ★

విజయసారథి ఉదయం అయిదు గంట లకేలేచి వాకింగు బయలుదేరాడు. ఆరోజు కూడా రాఘవేంద్రగారు రాలేదు. ఒక్కడే డొంకకి వచ్చి భార్గవకోసం చూస్తూ నిలబ డ్డాడు. కొంచెం లేటయింది అంటూ భార్గవ వచ్చాడు.

ఇద్దరూ మాట్లాడుకుంటూ నడుస్తు న్నారు. చవిటి మైదానం దగ్గర కాపువేసి వున్న చందన్ సన్నగా ఈలవేసి సంకేతం అందించాడు.

సారథి, భార్గవ అటువైపు వచ్చేసరికి వెంటనే ఒక స్త్రీ ఆర్తనాదం మొదలైంది.

“అమ్మో! అయ్యో! రక్షించండి. నన్ను కాపాడండి” పెద్దగా అరుపులు, కేకలు.

“భార్గవగారూ! ఎవరో అమ్మాయి ఆపద లోవుంది. పదండి, పోదాం”

ఇద్దరూ పాంట్లు కొద్దిగా పైకి మడిచి వడివడిగా ఆ వైపుకు నడిచారు.

ఎనిమిదిమంది కొత్తమనుషులు కర్రలతో కాచుకొని సారథి కోసం పట్టుకోవటానికి సిద్ధంగా వున్నారు. చందన్, గోపాల్, పాపారావు వాళ్లవెనక నిలిచి వున్నారు. చందన్ వాళ్లకి సారథిని చూపించాడు.

అంతకుముందే వీరభద్రయ్య బాణాక ర్రతో కంతనుండి బయటికి రావటం వాళ్లె వరూ గమనించలేదు. వాళ్లంతా డొంకవైపు ముఖాలుపెట్టి,సారథికోసం చూస్తున్నారు. సారథిని దారితప్పించి పట్టివేసే పథకం అది. వాళ్లున్నచోటుకి డొంకదారి రెండువం దల గజాల దూరంలో వుంది.

అప్పుడే మసకచీకటి విడిపోతూ వుంది. తెల్లవారే సమయమది. ఆర్తనాదం విని వేగంగావచ్చే విజయసారథిపై ఆ ముఠా విరుచుకుపడబోతున్నది.

ముందుగా స్త్రీ ఆర్తనాదం మోసం అని గ్రహించిన వీరభద్రయ్య ఉగ్రుడై వెనుక నుండి బాణాకర్రతో విరుచుకుపడ్డాడు.

ప్రమాదాన్ని పసిగట్టిన విజయసారథి తనపై దూకిన గూండా దగ్గరి బాణాకర్రని

చాకచక్యంగా లంఘించి లాక్కున్నాడు.

ఈలోపునే ఇన్‌స్పెక్టర్ భార్గవ పిడుగులా మరొకడిపైదూకి తన్ని పడగొట్టి, వాడి కర్రని ఊడబెరికి చేతికి చిక్కించుకున్నాడు.

కర్రలు చిక్కించుకున్న యువకసింహాలు ఇద్దరూ గర్జించి దుండగులపై దూకి వీరవిహారంచేశారు. ఇద్దరికీ కర్రసాము, మల్లయుద్ధం వచ్చునని వీరభద్రయ్యకీ తెలియదు. గూండాలకీ తెలియదు.

వెనుకనుండి వీరభద్రయ్య విజృంభించి గూండాలను చెండాడాడు.

ముందువైపునుండి భార్గవ, విజయసారథి చూపిన ప్రతాపానికి ఎక్కడివాళ్ళక్కడే కుప్పకూలిపోయారు.

విజయసారథిని గూండాలకు చూపిన చందన్, ఇద్దరు కొత్త గూండాలు, వీరభద్రయ్య చేతిలో నేలకూలారు.

విజయసారథి, భార్గవ ఆరుగురు కొత్త గూండాల్ని విరగేసి పడగొట్టారు.

పారిపోయే వీలులేని గూండాలు పడిపోయి మూలుగుతున్నారు.

పాపారావు, గోపాల్ యుక్తిపరులు. పక్కన కొంచెం దూరంలో నిలిచి చూస్తూ గుండాలపాటు, చందన్ పడిపోవటంచూసి, 'బతుకుజీవుడా' అని తప్పించుకొని పరుగు తీస్తూ డొంకకి వచ్చారు.

ఆ సమయంలో సదానందం, నాగేశు, దేవేంద్ర, నాగరాణి పాలేరు కొండయ్య అరకలతో ఊళ్ళోనుండి వస్తున్నారు. పక్కమైదానంలో కర్రలమోత, ఘర్షణ, గర్జనలు, హాహాకారాలు విని డొంకలో ఆగారు.

పరుగుతీస్తూ వస్తున్న పాపారావుని, గోపాల్‌ని అనుమానించి అడ్డం తిరిగి పట్టుకున్నారు. పాపారావుని సధానందం పట్టుకున్నాడు. గోపాల్‌ని కొండయ్య పట్టుకున్నాడు. విదిలించుకొనిపోవాలని ఇద్దరూ గట్టిగా ప్రయత్నించారు.

భల్లూకాల్లా పట్టిన యువకవీరుల పట్టు నుండి పాపారావు, గోపాల్ ఎంతగా గింజుకున్నా విడిపించుకోలేకపోయారు. పైగా దేవేంద్ర, నాగేశు వాళ్లకి పక్కనే కాచుకొని తోడుగా వున్నారు.

ఇంతలో మరికొందరు కర్షక యువకులు అరకలతో అక్కడికి వచ్చారు. అక్కడ జరుగుతున్న ఘర్షణ సంగతి తెలిసి ఆగిపోయారు. పాపారావుని, గోపాల్‌ని అందరూ కలిసి పగ్గంతో చేతులు కట్టి, ఘర్షణ జరిగిన చోటుకి నడిపించుకొని తీసుకువచ్చారు.

చందన్‌తోసహా గూండాలందరూ కుప్పకూలి మూలుగుతున్నారు.

సారథి మీద దాడి జరిగిందని వీరభద్రయ్య సదానందానికి చెప్పాడు. పాపారావే దాడికి ముఖ్యనాయకుడని తెలిసి ఆగ్రహంతో సదానందం, అతని మిత్రబృందం పాపారావుని, గోపాల్‌ని ఒళ్లు హూనం అయ్యేలా చితకదన్నారు.

కర్షక యువకులంతా పగ్గాలుతెచ్చి అందరికీ చేతులు కట్టి ఇద్దరికీ, ముగ్గురికీ కలిపి లంకెలు పెట్టారు.

"తాతయ్యా! ఇప్పుడే వస్తాను మీరంతా ఇక్కడే వుండండి" అని భార్గవ వడివడిగా వూళ్ళోకి వెళ్లిపోయాడు.

ఆర్తనాదంచేసిన యువతి సిగ్గుతో తల వంచుకొని నిలబడి వుంది. వయసు ఇరవై అయిదేండ్లు వుంటాయి. మంచి రంగుతో అందంగా వుంది.

కర్షక యువకులు ఆమెని కూడా పగ్గంతో చేతులు కట్టబోయారు. కాని విజయసారథి వారిని వారించాడు.

"ఆమె చేసింది తప్పే! అయినా స్త్రీలని మాతృస్వరూపిణులుగా గౌరవించే సంస్కృతి మనది. ఆమె ఎక్కడికీ తప్పించుకుపోదులే" అన్నాడు.

"అమ్మాయ్! నిన్ను తీసుకువచ్చిందెవరు?" వీరభద్రయ్య అడిగాడు.

చందన్, గోపాల్, పాపారావు, ముగ్గురివైపు చేయిచూపింది.

చుట్టూ వున్న యువకులు ఆ ముగ్గురినీ

ఏమి అడిగినా నోరు విప్పటంలేదు. బోనులో చిక్కిన పులిలాగా పాపారావు అందరివైపు కోరచూపులు చూస్తున్నాడు.

ఇంతలో ఇన్‌స్పెక్టర్ భార్గవ యూనిఫాంలో నలుగురు పోలీసులతో హుటాహుటిన అక్కడికి వచ్చాడు.

వీరభద్రయ్య ఆశ్చర్యంగా భార్గవని చూసి, "ఇదేంటి? నువ్వు...నువ్వు..." అంటూ వుండగానే,

"నేను ఇన్‌స్పెక్టర్ భార్గవని తాతయ్యా! అయినా మీ మనవడినేలే! ఆశ్చర్యపడకండి" అన్నాడు నవ్వుతూ.

"చిత్రంగా వుందే! సారథిబాబూ! నువ్వా వట్టిసారథి బాబువేనా! లేక... నీకూ ఏదైనా వుందా? "

"తాతయ్యా! అది గూడా నేనే చెబుతా వినండి. ఆయన వీరవరం సిండికేటు బ్యాంకులో రూరల్ డెవలప్‌మెంటు ఆఫీసరు. వట్టి సారథికాదు. 'విజయసారథి'. ఆయన అగ్రికల్చరల్ ఎం.ఎస్.సి గోల్డ్ మెడల్‌తో పాసయ్యాడు. ఆయన, నేను సరదాగా సాధారణ పౌరులుగా తిరిగాం" అన్నాడు భార్గవ.

"అబ్బో! మీరిద్దరూ ఆఫీసర్లేనన్నమాట. బలే మనవళ్లు దొరికారు మాకు. పైగా మీ ఇద్దరికీ కర్రసాము బాగా వచ్చునే! మీరు చేసిన తీరు మెచ్చుకోవచ్చు మెళకువలు బాగా తెలుసు. ఈక వెంగిలి గాకుండా ఆరుగురిని పడగూల్చారు. ఇంత బాగా వచ్చి గూడా నన్ను నేర్పమన్నారు"

"మా ఇద్దరికీ కర్రసాము బాగా వచ్చు తాతయ్యా! మా ఇద్దరికీ కుస్తీ కూడా వచ్చు" అన్నాడు భార్గవ.

"తాతయ్యా కర్రసాము మీరు చేసిన తీరు గూడా అద్భుతంగా వుంది. ఈ వయసులో గూడా మీ విన్యాసాలు, కదలికలు ఎంతో వేగంగా వున్నాయి. మాకు ఆశ్చర్యం కలిగించాయి" అన్నాడు విజయసారథి.

ఇదంతా వింటున్న సదానందం, "ఆహా! మా సారథి బాబుగారు ఎంత గొప్పవారు! ఎంత వీరులు" అని ఆనందించాడు.

ఆర్తనాదంచేసిన యువతితోసహా అందరినీ పోలీసు స్టేషన్‌కి తీసుకువచ్చారు. ఎనిమిది మంది కొత్త గూండాల్ని, చందన్‌ని, గోపాల్‌ని, పాపారావుని లాకప్‌లో పడేశారు. ఆ యువతిని ఒక బల్లమీద కూర్చోబెట్టారు. విషాదవదనంతో తలవంచుకొని కూర్చుంది యువతి.

"రవీంద్రా! ఈ గ్రామ ప్రెసిడెంటుగారు నీకు తెలుసుగదా! జరిగిన విషయం ఆయనతో చెప్పి, ఆయన్ని నేను ఆహ్వానించానని చెప్పి వారితో కలిసి స్టేషన్‌కిరా! నేరస్తుల్ని వారి సమక్షంలో విచారిస్తానని చెప్పు" అని భార్గవ రవీంద్రని గ్రామ ప్రెసిడెంటుకోసం పంపాడు.

సదానందం ఇంటికివచ్చి సారథిమీద జరిగిన దాడి గురించి వారికి చెప్పాడు. సారథిని గురించి, భార్గవని గురించి తెలుసుకున్న విషయాలన్నీ చెప్పాడు.

భారతీదేవి, అనూరాధ దాడి వార్త వినగానే భయపడ్డారు. ప్రమాదం జరగలేదని తెలిశాక సంతోషించారు.

బ్రహ్మానాయుడు వార్త వినగానే రాఘవేంద్రగారితో కలిసి పోలీసు స్టేషన్‌కి వచ్చాడు. భార్గవ వారిద్దరికీ సవినయంగా నమస్కారాలుచేసి ఆహ్వానించాడు. సారథి బ్రహ్మానాయుడిని భార్గవకి పరిచయంచేశాడు.

"నువ్వు నిన్న మా ఇంటికి వచ్చిన భార్గవకదూ" అన్నాడు రాఘవేంద్రగారు.

"అవును తాతయ్యా! ఇన్‌స్పెక్టర్ భార్గవని. మీ సారథిబాబు కూడా వట్టి సారథి బాబు కాదు. మీ వూరు సిండికేటు బ్యాంకులో రూరల్ డెవలప్‌మెంటు ఆఫీసరు. విజయసారథి. ఇద్దరం మీకు నిన్న నిజం చెప్పనందుకు మన్నించండి"

"ఇంతకీ ఈ సారథిబాబు మీద దాడి ఎందుకు జరిగింది? ఎవరు చేయించారు? "

"ఆ సంగతి మీ పెద్దలయెదటే తెలు

స్తాను తాతయ్యా. గ్రామ ప్రెసిడెంటుగారు కూడా వస్తారు. ఆయనకోసం మనిషిని పంపాను"

మాటల్లోనే ప్రెసిడెంటు జగదీష్‌ప్రసాదు రవీంద్రతో వచ్చాడు.

భార్గవ ఆయనకి నమస్కారం చేసి సగౌరవంగా ఆహ్వానించాడు. అందరినీ పోలీసు స్టేషను వెనుక ఆవరణలో కుర్చీలు వేయించి కూర్చోబెట్టాడు. చందన్, గోపాల్, పాపారావు వీరవరంలో అందరికీ తెలిసిన వాళ్ళే. ముందుగా ఆ ముగ్గురినీ పిలిచి 'విజయసారథిమీద దాడి ఎందుకు చేశారు? , అని అడిగాడు భార్గవ. ముగ్గురూ ఎన్నిసార్లడిగినా నోరు విప్పలేదు.

"వీళ్ళు ఎం.ఎల్.ఏ. బాలాజీ భక్త శిఖామణులండీ. సాధారణ మానవులతో సంభాషించరు" అన్నాడు జగదీష్‌ప్రసాదు నవ్వుతూ.

"పలికించటం కష్టంకాదు. కాని ఇది సమయం కాదు" అన్నాడు భార్గవ.

ఆ ముగ్గురినీ మళ్ళీ లాకప్‌లో వేయించాడు. కొత్తగూండాలని ఎనిమిదిమందినీ లాకప్‌నుండి బయటకి రప్పించాడు. వాళ్ల ముఠానాయకుడెవరో అడిగి తెలుసుకున్నాడు. అతణ్ణి ప్రశ్నించాడు.

"నీ పేరేంటి? నీదేవూరు? "

"నా పేరు నాగులు సార్. మాది తెనాలి శివారు అయితానగరం"

"నాగులూ! మీరు ఉన్నదున్నట్లు నిజం జెపితే మీ వంటికి మంచిది. దానివల్ల మీకు కొంత మేలు జరుగుతుంది. మిమ్మల్ని తెనాలినుండి తీసుకువచ్చింది ఎవరు? మిమ్మల్ని దాడికి పురికొల్పి సాయం చేసిందెవరు? "

"అయ్యా! ఇకమేం నిజమే చెబుతామండి. మమ్మల్ని తెనాలినుంచి తీసుకొచ్చింది బూపాలరావుగారండి. ఆయన్దీ మావూరే. కేశవరావుగారి కొడుకండి. ఈ ఊళ్లో వారి అక్కగారుండారండి. ఆయన మమ్మల్ని తీసకొచ్చి ఇక్కడ చందన్, గోపాల్, పాపారావు అనే వారికి అప్పగించారండి. తరవాత మాకు తింటానికి వుంటానికి అన్నీ ఆ ముగ్గరే జూశారండి. సారథిబాబుగార్ని గూడా సూపిచ్చి దాడి దగ్గరుండి సేయించారండి."

"నాగులూ! భూపాల్రావు తండ్రిగారికి దాడితో సంబంధం వుందా? "

"అమ్మో, అయ్యగారూ! ఆయన దేవుడిలాంటోరండి. ఇదంతా వారికి తెలవకుండా బూపాల్రావుగారే సేయించారు. కేశవరావుగారికి తెలవదని, తెలిత్తే వూరుకోరని బూపాల్రావుగారే మాతో అన్నారండి"

భూపాలరావు పేరు విని విజయసారథితో సహా అందరూ ఆశ్చర్యపోయారు. భార్గవ వెంటనే భూపాలరావు కోసం ఇద్దరు పోలీసుల్ని శేషాద్రినాయుడి ఇంటికి పంపాడు. తిరిగి విచారణ కొనసాగించాడు.

"నాగులూ! భూపాలరావు విజయసారథిగారిని చంపమన్నాడా? "

"అమ్మో బాబుగారూ! సంపటానికైతే అసలు మేం రామండి. మేం కూనీకోరు గూండాలంగాదండి. బూపాల్రావుగారు ఆయన్ని కిడ్నాప్ జెయ్యాలన్నారు. ఆయన్నెత్తకపోయి దాసిపెట్టి వారం రోజులుంచాక వదలాలన్నారు"

"అయ్యాగారూ! ఆయన వట్టి పిరికిమనిసి, ఆయన్నెత్తకపోవటం తేలికేనని బూపాల్రావు మాకు జెప్పారండి. డబ్బుకోసం ఆశపడ్డాం. మేం అనబవం లేని కొత్త గూండాలం. ఇంతకుముందు ముటాకూలీలం. కేశవరావుగారి వరిపొలంలో నూరిపిడి గూడా జేశాం. మా రోజులు బాగలేక ఈ పాడుపనికొప్పుకున్నాం. మాకు పొగరు తలకెక్కి అక్కడొక పాత గూండాగాడి మాటలిని కొత్తగా ఈ పన్లకి అలవాటయ్యాం. ఇంతకుముందు వాడితో గలిసి రెండు కిడ్నాపులు జేశాం. బాగనే గిట్టుబాటయింది. దసరా పండగ కర్చులకని ఈ

కిడ్నాపు వప్పుకున్నాం. సావుదెబ్బతిన్నాం. ఒల్లు గుల్లయింది. బుద్దొచ్చింది సార్. ఇగ ఈ జనమలో ఇట్టాంటి పనిజెయ్యం"

"నాగులూ! ఇప్పుడు మీకు బుద్ధి వచ్చిందన్నా కేసు పెట్టకుండా వదలం. మీకు నిజంగా బుద్ధివస్తే ఇకముందు ఇటువంటివి గూండా పనులు మానేవాళ్లయితే కోర్టులో బుద్ధిగా నిజం ఒప్పుకోండి. చేసిన తప్పుకు శిక్ష అనుభవించేటానికి సిద్ధంగా వుండండి. అలా అయితే మీ శిక్ష కొంత తగ్గుతుంది."

"సిత్తం బాబుగారూ! మాకు నిజంగా బుద్దొచ్చింది. కోర్టులో జరిగింది జరిగినట్టే జెపుతాం. ఎవ్వరి మాటలూ యినం. మేం ఇల్లు వాకిలి పెళ్లాం పిల్లలున్నోళ్లం. కసాయి కూనీకోరు గూండాలంగాదండి. మా సంగతి కేశవరావుగారిని అడగండి. మా మాటలు నమ్మండి"

తరవాత ఆర్తనాదం చేసిన యువతిని భార్గవ విచారించాడు. పిలవగానే వచ్చి పెద్దల ఎదట తల వాల్చి నిల్చింది.

"చూడమ్మా! ఈ పెద్దల ఎదట మేము అడిగే ప్రశ్నలకు నిస్సంకోచంగా నిజం చెప్పు. నువ్వు స్త్రీవి కనుక నిన్ను తగిన విధంగా సంభావిస్తాం. పోలీసులంటే భయం, కంగారు వద్దు. తలయెత్తుకుని నీ పరిస్థితి చెప్పు. అది నీకు మంచిది. నీ పేరేంటి? నీదేవూరు? "

"నా పేరు సావిత్రి. ఊరు ఈ వీరవరం పక్కనే వున్న దేవనగరం"

"నిన్ను ఈ పనికి తీసుకుని వచ్చిందెవరు? "

"పాపారావు, చందన్, గోపాల్ ముగ్గురూ నన్ను తీసుకువచ్చారు. పాపారావు దేవనగరం వాడే. ధనికరైతు. ఆ పాపాత్ముడే ఈ దాడికి నాయకుడు. నన్ను ఆక్రందన చెయ్యమన్నది అతడే."

"ఈ విజయ సారథిగారి మీద దాడి జరుగుతుందని ముందే నీకు తెలుసా? ఆక్రందన చెయ్యమన్నది దాడి చెయ్యటానికేనని నీకు తెలుసా? "

"దాడి గురించి ముందుగా నాకేమీ తెలియదు. నన్ను నందిగామ నుండి తీసుకువచ్చారు. ఎం.ఎల్.ఎ. బాలాజీగారు వీళ్లతో పంపారు. ఎందుకు పంపుతున్నదీ ముందుగా నాకేమీ చెప్పలేదు. వాళ్లు చెప్పింది చెయ్యమని ఆయన పంపారు. ఆక్రందన చెయ్యమని వీళ్లు ఆజ్ఞాపించారు. ఎందుకు చెయ్యమన్నారో నిజంగా నాకు తెలియదు. అలా చెయ్యటం నాకు ఇష్టంలేకపోయినా బాలాజీగారి ఆదేశానికి లోబడి, వీళ్లకి ఎదురుచెప్పటానికి భయపడి తప్పక చేశాను."

"నువ్వు చదువుకున్నావా? మాటతీరు బాగుంది."

"మా దేవనగరంలోనే మహదేవశాస్త్రిగారి దగ్గర తెలుగు చదువుకున్నాను"

"మీది దేవనగరంగదా. నందిగామలో ఎందుకున్నావు? బాలాజీగారు నిన్నెందుకు వీళ్లతో పంపాడు? వివరాలు చెప్పు"

ఆ ప్రశ్నకు సావిత్రి తలవంచుకుని కన్నీరు కారుస్తూ మౌనంగా వుంది. బ్రహ్మనాయుడు సావిత్రిని చూసి జాలిపడ్డాడు.

"చూడమ్మా సావిత్రీ! నీకున్న కష్టమేమిటో, ఎందుకిలా రావాల్సివచ్చిందో మూల కారణం తెలుసుకోవటం కోసమే మా సమక్షంలో ఆయన అడుగుతున్నారు. ఆ వివరాలు చెబితే నీకు మేలే జరుగుతుంది" అన్నాడు.

"బాబాయిగారూ! మీరు పితృసమానులు. మీ గురించి నేను విన్నాను. బ్రహ్మనాయుడుగారంటే మా దేవనగరంలో అందరికీ అభిమానం వుంది. మీ పెద్దల ఎదట మనసు విప్పి నిజం చెబుతాను. ఇంతదాకా వచ్చాక నేను దాచుకోవటానికేం మిగిలింది? "

అలా సావిత్రి అంటూవుండగానే రవీంద్ర, కృష్ణమూర్తి అనే కానిస్టేబుల్స్ ఇద్దరూ

భూపాలరావును వెంటబెట్టుకుని వచ్చారు.

భూపాలరావు తండ్రి కేశవరావు కూడా వారితో వచ్చాడు. ఆయన్ని చూడగానే కొత్త గూండాలందరూ చేతులు జోడించి నమస్కారాలు చేశారు.

భార్గవ ఆయనకి నమస్కారం చేసి ఆహ్వానించి కూర్చోబెట్టాడు.

భూపాలరావు తలొంచుకుని చేతులు కట్టుకుని నిలబడ్డాడు.

"సావిత్రీ! ఇక నువ్వు చెప్పేది చెప్పమ్మా" అన్నాడు బ్రహ్మానాయుడు.

"బాబాయిగారూ! మాది బీద కుటుంబం. మా తండ్రి అకాలమరణం పాలయ్యాడు. మేం తగిన అండదండలేని వాళ్లమయ్యాం. నాకొక తమ్ముడున్నాడు. వాడికి చదువు బాగా వస్తుంది. నేను, మా అమ్మ పొలాల్లో కష్టంజేసి, కూలిపనులు జేస్తూ వాణ్ణి చదివించాం. ఈ వీరవరం హైస్కూల్లోనే నా తమ్ముడు చదివి స్కూల్ఫైనల్ ఫస్టుక్లాసులో పాసయ్యాడు.

మా అమ్మ, నేను ఎంత కష్టపడి అయినాసరే వాణ్ణి కాలేజీలో చేర్పించాలనుకున్నాం. వాడికి చదువు అయ్యేదాకా నేను పెండ్లి చేసుకోగూడదనుకున్నాను. పొలాల్లో కూలిపనులు చేస్తూ నేనూ మా అమ్మా డబ్బు కూడబెట్టుకుంటున్నాం.

ఈ పాపారావు ధనికరైతు. అర్థబలం, అంగబలం వున్నవాడు. అధికారుల అండ వున్నవాడు. ఎప్పుడూ నలుగురు గూండాల్ని వెంటేసుకు తిరుగుతుంటాడు. మా ఊళ్లో అందరికీ ఈ పాపారావంటే భయమే.

ఆ అహంకారంతోనే అవివాహితగా వున్న నన్ను ఈ అపర కీచకుడు పాపారావు పొలంలో ఒంటరిగా వున్న సమయం చూసి బలాత్కరించాడు.

నాకు నా తమ్ముడంటే అపారమైన ప్రేమ. వాడి చదువు పూర్తి అయ్యేదాకా పెండ్లి మానుకుని కష్టపడి చదివించాలనుకున్నాను. కాని నా వయసు, అందం శాపమై పాపారావు చేతిలో పడ్డాను.

తరవాత పాపారావు నన్ను పెండ్లి జేసుకుంటానని మా అమ్మని నమ్మించాడు. ఖా తమ్ముణ్ణి చదివిస్తానని కాలేజీలో చేర్పించాడు. నన్ను స్వాధీనం చేసుకున్నాడు. పెండ్లికి వాయిదాలేస్తూ మా అమ్మకి మాయమాటలు చెబుతూ రెండేండ్లు గడిపాడు. నా తమ్ముడికి చదువు చెప్పిస్తూ నన్ను ఉంపుడుగత్తెగా వాడుకున్నాడు.

**తరువాత ఈ వంచకుడు పాపారావు కల**వారి అమ్మాయిని పెద్ద కట్నంతో పెండ్లిజేసుకుని నన్ను వదిలేశాడు. అప్పుడు నా తమ్ముడు బి.ఏ. చదువుతున్నాడు. వాడి చదువు ఆగిపోయేలావుంది.

పాపారావుకు ఎం.ఎల్.ఏ. బాలాజీ గురువు. పాపారావు ఇంటికి బాలాజీ వస్తూ పోతూ వుండేవాడు. ఆ పరిచయాలమూలంగా బాలాజీకి నేను తెలుసు. నన్ను పలకరిస్తూ వుండేవాడు. ఆ పరిచయంతో నేను నా తమ్ముడి చదువుకు సాయం చెయ్యమని బాలాజీని ఆశ్రయించాను. నామీద కన్నువేసివున్న బాలాజీ నా తమ్ముణ్ణి చదివిస్తానన్నాడు. చదువు కాగానే వాడికి ఉద్యోగం కూడా చూస్తానన్నాడు. అందుకు పణంగా బాలాజీకి నేను స్వాధీనం కావాల్సివచ్చింది. తమ్ముడి భవిష్యత్తుకోసం నాకది తప్పలేదు.

ఇలా జరిగినా బాలాజీ పాపారావుల గురుశిష్య సంబంధాలకు అంతరాయం కలగలేదు. యధావిధిగా వున్నాయి. వాళ్లకి ఆ పట్టింపులు వుండవు. బాలాజీకి పాపారావు బంగారుగుడ్లు పెట్టే బాతులాంటివాడు, ధనికుడు.

పాపారావుకి బాలాజీ అక్రమాలకు అండగా నిలిచే ఆపద్బాంధవుడు.

ఒకసారి నా శీలం పాపారావు మూలంగా కళంకితమయింది. ఇక నిండా మునిగినదానికి చలి ఏముంది? అని తమ్ముడి చదువుకోసం బాలాజీకి వశమ

య్యాను. అతని ఆదేశాలు పాటించాల్సి వచ్చింది. అంత మహా పతివ్రత పేరు పెట్టుకుని ఇంత పాడుపనికి ఎలా ఒప్పుకున్నానో తెలియాలనే మీకు ఇదంతా చెప్పాను.

ధనవంతులకు దాసోహం అనే అధికారులు అక్రమాలకు అండగా నిలిచే బాలాజీ వంటి ప్రజాప్రతినిధులు, పాపారావు వంటి అపరకీచకులు, ధనమదాంధులు వున్నచోట నాలాంటి అనాథ యువతుల శీలానికి రక్షణయేది? ఆ ఊళ్లో నన్నెవరైనా ఆదుకోగలిగారా?

బాబాయిగారూ! ఒక్కటి నిజం. బాలాజీ ఆదేశించినా, పాపారావు ఆజ్ఞాపించినా, విజయసారథిగారివంటి ఉన్నత వ్యక్తిమీద దాడి జరుగుతుందని ముందే తెలిస్తే ఆక్రందన చెయ్యటానికి చచ్చినా ఒప్పుకునేదాన్నికాదు.

కర్షక యువకులు నన్ను పగ్గంతో కట్టివేయబోతుంటే విజయసారథిగారు "స్త్రీలని మాతృస్వరూపిణులుగా గౌరవించే సంస్కృతి మనది" అని వారించిన తీరు నేను ఈ జన్మలో మరువలేను. నేను చేసిన ఈ నీచకృత్యం నా జీవితంలో మాయని మచ్చ అవుతుంది. నేను పాపిష్టిదాన్ని" అని సావిత్రి ముఖాన్ని పైట చెరగు కప్పుకుని భోరున ఏడ్చింది.

"అమ్మాయ్ సావిత్రీ! నీ బాధని, పరిస్థితిని అర్థం చేసుకున్నాం. నేను ఎక్కువ చదువుకోలేదుగాని 'ప్రపంచంలో మొదటి వృత్తి వ్యభిచారమే' అని కారల్ మార్క్సు అనే ఆయన అన్నాడట. అది ఇష్టమై చేసేది కాదని, కొందరు తప్పనిసరి అయి చేస్తారన్నది నిజమే. ఇకముందు నువ్వు మంచి మార్గాన నడువు. మేమంతా నీకు అండగా వుంటాం" అన్నాడు వీరభద్రయ్య.

"సావిత్రీ ఇక ఏడవకు. ఇంతకుముందు నిన్ను ఏడిపించినవాళ్ళే ఇకముందు ఏడుస్తారు. నీ కష్టాల్ని, నష్టాల్ని మాకు కళ్ళకు కట్టినట్లు చక్కగా వినిపించావు. చదువుకున్నదానివనిపించావు. నీ ప్రశ్నలు సహేతుకంగా వున్నాయి. నీలో విజ్ఞత వుంది. వివేకం వుంది. ఓర్పు వుంది. నేర్పు వుంది. పాత జీవితానికి చరమగీతం పాడు. కొత్తదానికి నాంది పలుకు. కోర్టులో నిజం చెప్పు. భార్గవగారు, మేము నీకు అండగా నిలబడతాం. ఇక నీ తమ్ముడి చదువు పూర్తి చేయించే బాధ్యత మాది. నీకు ఎవరిపట్లా భయం అవసరం లేదు. నీ జోలికి ఎవరూ రారు. నిన్ను వంచించినవాళ్ళు తగిన శిక్ష అనుభవిస్తారు" అన్నాడు బ్రహ్మానాయుడు.

తరువాత భార్గవ భూపాలరావును ప్రశ్నించాడు.

"చూడు భూపాల్రావ్. నా పేరు భార్గవ. మాది దుగ్గిరాల. మీది తెనాలి. నువ్వు, నేను గౌరవనీయమైన కర్షక కుటుంబాల్లో పుట్టినవాళ్ళం. నువ్వు చదువుకున్నవాడివి. నేను నీ మేలు కోరి చెబుతున్నాను. తప్పు చేసినా పశ్చాత్తాపపడి దిద్దుకోవడంలోనే గొప్పతనం వుంది. నేరస్థుడిగా ఇక్కడ నిలబడిన నువ్వు నిజాయితీతో నేరం అంగీకరిస్తే, కోర్టులో నిజం చెపితే తప్పు దిద్దుకున్నవాడివవుతావు. కొంత శిక్ష తగ్గుతుంది.

ఈ విజయసారధిగారిని కిడ్నాప్ చెయ్యడానికి గూండాల్ని తెచ్చింది నువ్వే కదూ. అది నిజమేకదా"

"భార్గవగారూ, ఈ పెద్దలముందు నేను ఏ విషయమూ దాచను. గూండాల్ని నేనే తెచ్చాను. విజయసారథిగారిని కిడ్నాప్ చేయాలనుకున్నది నేనే"

"ఆయన్ని కిడ్నాప్ చేయాలని ఎందుకు అనుకున్నావు? "

"ఆయనంటే ఈర్ష్య వుంది. బ్రహ్మానాయుడు బావగారు, రాఘవేంద్రగారు అందరూ ఆయన్ని మెచ్చుకోవడంతో నాకు ఈర్ష్య కలిగింది. సహించలేకపోయాను. ఆయన్ని కిడ్నాప్ చేసి, సావిత్రితో కలిపి ఫొటోలు తీసి, సావిత్రితో లేచిపోయాడని

ప్రచారం చేయించాలని, ఫొటోలో చూపించాలని, చందన్, పాపారావు, గోపాల్ సలహా చెప్పారు. ఇంత ప్రచారం జరిగాక ఇక అతను వీరవరం 'రావడానికి ఇష్టపడడని అనుకున్నాం. ఆయన చదువుకున్నవాడని మేం అనుకోలేదు. బ్యాంకు ఆఫీసరని ఎవరికీ తెలియదు. అనామకుడనుకున్నాం. ఆయనకి కర్ర సాము వచ్చునని కూడా మాకు తెలియదుకదా.

"విజయసారథిగారూ! మీరు, భార్గవగారూ నన్ను క్షమించండి. చేసిన తప్పుకు శిక్ష అనుభవిస్తాను. అసలు ఇంత హేయమైన పనికి పాల్పడతానని నేను కలలో కూడా ఊహించలేదు. గౌరవనీయుడుగా పేరు తెచ్చుకున్న మా నాన్న మనసులో కల్లోలం రేపాను. చేయరాని తప్పు చేశాను. కోర్టులో నిజం చెప్పి నేరాన్ని అంగీకరిస్తాను. అందుకు తగిన శిక్ష అనుభవిస్తాను. నన్ను అరెస్టు చెయ్యండి"

"శభాష్! భూపాల్రావ్. చదువుకున్నందుకు తగిన సంస్కారం కనబరిచావు. నిన్ను అరెస్టు చేస్తున్నాను. ఇప్పటికైనా నీలో పరివర్తన కలిగినందుకు నిన్ను అభినందిస్తున్నాను"

అంతటితో విచారణ ముగిసింది.

"బ్రహ్మానాయుడు బాబాయిగారూ! కేసు రిజిస్టరు చేసి ఈరోజే ముద్దాయిల్ని కోర్టులో హాజరుపరుస్తాను. ఈ కేసులో నాకు మీ అందరి సహకారం కావాలి. ప్రత్యక్ష సాక్షులతో కోర్టులో సాక్ష్యం చెప్పించాలి"

★ ★ ★

చందన్ పినతండ్రి చిదంబరం ఆఘమేఘాలమీధ స్కూటరుతో నందిగామ బాలాజీ దగ్గరకు చేరాడు. జరిగిన విషయం చెప్పాడు.

"ఆందోళనపడకు చిదంబరం. అధికార పార్టీ ఎం.ఎల్.ఎ.లకి అనుకూలంగా నడుచుకోవడం పోలీసులకు తప్పదు. పోలీసులకు ఫోన్ చేసి, మనవాళ్ళని ముగ్గురినీ, సావిత్రిని విడిపిస్తాగా" అని బాలాజీ వీరవరం పోలీసుస్టేషన్‌కి వెంటనే ఫోన్ చేశాడు. ఇనస్పెక్టర్ పేరు, ఊరు చిదంబరం చెప్పాడు.

అప్పుడే భార్గవ విచారణ పూర్తిచేసి, పెద్దలకు వీడ్కోలు చెప్పి, విశ్రాంతిగా కూర్చున్నాడు. ఇంతలో ఫోన్ మోగింది. ఫోన్ అందుకుని "హలో..." అన్నాడు. అవతల నుంచి బాలాజీ మాట్లాడాడు.

"నేను ఎం.ఎల్.ఏ. బాలాజీని మాట్లాడుతున్నాను"

"నమస్కారం బాలాజీగారూ. నేను ఇన్‌స్పెక్టర్ భార్గవని మాట్లాడుతున్నాను. ఏమిటో చెప్పండి?"

"ఏమిటి...? వీరవరంలో ఏదో గొడవ జరిగిందట"

"అవునండీ... జరిగి రెండు గంటలయింది. అప్పుడే మీకు ఈ మారుమూల వూరునుండి కబురెలా చేరింది?" అని జరిగింది వివరంగా చెప్పాడు.

"మంచి పని జరిగింది. మీ యువకులిద్దరూ మంచి సాహసవీరులు. వీరభద్రయ్యని కూడా అభినందించాలి. మీ యువకులిద్దరికీ మంచి భవిష్యత్తు వుంది. నేను ప్రజాప్రతినిధిని కదా. నా నియోజకవర్గంలో ఎక్కడ ఏం జరిగినా తెలుసుకోవలసిన బాధ్యత నాకుంది. ఇప్పుడే మా మనిషి అక్కడనుండి వచ్చి నాకు వార్త చెప్పాడు. నీకు వెంటనే ఫోన్ చేశాను. నిరంతరం ప్రజలకు అందుబాటులో వుండడం నా నియమం. నువ్వు దోషులపై గట్టిగా కేసు రిజిష్టరు చెయ్యి. నేరస్థుల్ని కఠినంగా శిక్షించాలి. అరాచకం పెరగకుండా అణచెయ్యాలి"

"కేసు పకడ్బందీగా పెడతాను. ప్రత్యక్ష సాక్షులు కూడా వున్నారు. గ్రామపెద్దల సహకారం బాగుంది"

"మంచిది. వీరవరం పోలీస్ స్టేషన్‌కి వస్తూనే ఒక విజయం సాధించావు. నీది

దుగ్గిరాల అని తెలిసింది. కర్షక కుటుంబం నుండి వచ్చినవాళ్ళంటే నాకు చాలా అభిమానం. నేనూ ఒక రైతునే. నీకు న సహకారం నిరంతరం వుంటుంది. అలాగే నువ్వూ నాకు సహకరించు. నీకు నాతో ఏ అవసరం వచ్చినా అడుగు, చేసి పెడతాను"

"చాలా సంతోషం కృతజ్ఞతలు"

"భార్గవా... అక్కడంతా బాగానే జరిగింది. కానీ ఆ ఊరికి నువ్వు కొత్తకావడంతో ఒక పొరపాటు జరిగింది. మీరు ఆ గూండాలతోపాటు చందన్, గోపాల్, పాపారావు అనేవాళ్ళని పట్టుకువచ్చారట. అక్కడ జరిగినదానికి, ఆ ముగ్గురికి ఏం సంబంధం లేదు. ఆ ముగ్గురూ మనవాళ్ళు. అక్కడికి మనవాళ్ళు వేరే పనిమీద వచ్చారట. మీరు అనుమానించి పట్టుకున్నారట. అక్కడ జరిగిన గొడవంతా బ్రహ్మానాయుడు కుటుంబ వ్యవహారం. నువ్వు ఆ ఊరికి కొత్త. అక్కడ మన అధికార పార్టీకి వ్యతిరేకులు ఎక్కువ. మనవాళ్ళని కేసుల్లో ఇరికించటానికి బ్రహ్మానాయుడు పన్నిన మాయాజాలం అది. నువ్వు మనవాళ్ళని ముగ్గురినీ సావిత్రినీ వదిలెయ్యి. అదొక పిచ్చిముండ. దానికేదో ఆశ పెట్టి మాయచేశాడు. నా మాటవిని మనవాళ్ళని వదిలెయ్యి. ఆ కొత్తవాళ్ళమీద కేసు రిజిస్టరు చెయ్యి. ఆ పాపారావు అనేవాడు బంగారపు గుడ్లు పెట్టే బాతులాంటి వాడు, ధనికుడు నేను నీ జీవితానికి బంగారపు బాట వేస్తాను. మనం తరువాత అన్ని విషయాలూ మాట్లాడుకుందాం. ముందు మనవాళ్ళని వదిలెయ్యి"

"బాలాజీగారూ! గూండాలతోపాటు ఆ ముగ్గుర్నీ పట్టుకురావటంగాదు. ఆ ముగ్గురితోపాటు గూండాల్ని పట్టుకువచ్చాం. అసలు కథానాయకులు ఆ ముగ్గురే. మీరు అటుది ఇటు, ఇటుది అటు తిరగేసి చెబుతున్నారు. ఇందులో ఎవరి మాయాజాలం, మహేంద్రజాలం లేదు. కొత్త గూండాలకి వసతులన్నీ సమకూర్చింది ఆ ముగ్గురే. వాళ్లకి విజయసారథి ఎలా వుంటాడో కూడా తెలియదు. ప్రధాన నేరస్థుల్ని వదలటం కుదరదండీ"

"చూడు భార్గవా! నేను అధికారపార్టీ ఎం.ఎల్.ఏ.ని. నువ్వు పోలీసు అధికారివి. మనం మనం పరస్పరం సహాయ సహకారాలు అందించుకోవలసిన వాళ్ళం. నా సలహా వింటే నీ భవిష్యత్తు బాగుంటుంది. నేను నీ మేలు కోరేవాణ్ణి. నా మాట విని వాళ్లని వదిలెయ్యి"

"వాళ్లు అపర కీచకులు, అతి దుర్మార్గులు. వాళ్లని వదలను. పరస్పరం సహకరించుకోవటం అంటే నేరస్థుల్ని కాపాడటమా? నేనొప్పుకోను"

"మన రైతు కుటుంబంనుంచి వచ్చినవాడివని, మనవాడివని, మంచిగా చెప్పినా వినకుండా మంకుపట్టు పడుతున్నావు"

"వాళ్లని వదిలే ప్రశ్నేలేదు. ఆ మంచి నాకక్కరలేదు. మీబోటి వాళ్లని ఎదిరిస్తేనే మంచి అనుభవం వస్తుంది"

"నేను అధికారపార్టీ ఎం.ఎల్.ఏ.ని. హోంమినిస్టర్‌తో చెప్పి నిన్ను విశాఖపట్నం జిల్లాకి విసిరేయిస్తా. బాలాజీ పవరేంటో చూపిస్తా. నన్నందరూ 'ఉక్కుమనిషి బాలాజీ', 'సర్దార్ బాలాజీ' అంటారు"

"నేను ఎస్.పి. గారి మెప్పు పొందిన ఇన్‌స్పెక్టర్‌ని. నన్నందరూ 'చిచ్చరపిడుగు' అంటారు. ఇన్‌స్పెక్టర్ భార్గవ అంటే ఏమిటో చూపిస్తా"

"నేను వీరవరం వచ్చి, మా పార్టీవాళ్ళందరితో కలిసి నిర్దోషులైన మా పార్టీ కార్యకర్తల్ని అరెస్టు చేసినందుకు నిన్ను ఘెరావ్ చేస్తా. అప్పుడేం చేస్తావో చూస్తా"

"పచ్చి గూండాల్ని వదిలిపెట్టమని వచ్చి ఘెరావ్ చేస్తావా? రా. నిన్ను కూడా లాకప్‌లో పడేస్తా. గురుశిష్యులందరూ లోపల కూర్చుని కాలజ్ఞానతత్వగీతాలు పాడుకోవచ్చు"

"మర్యాదగా మాట్లాడు. నువ్వు ఉద్యోగం

చేసేది నా నియోజకవర్గంలో ఇది నీ స్వంత ఊరు దుగ్గిరాల కాదు"

"ముందు మర్యాద తప్పింది, బెదిరించింది నువ్వే వీరవరం పోలీస్ స్టేషన్ పరిధిలోని ఏరియా నీ స్వంత జాగీరు కాదు. ఈ ఏరియా రక్షణ బాధ్యత నాదే. నువ్వు దీనికి చక్రవర్తివి కాదు. అవినీతి చక్రవర్తివి. నీ సంగతి నాకు తెలుసు"

అని భార్గవ ఫోను పెట్టేశాడు.

బాలాజీ లాలింపులు, బెదిరింపులు భార్గవముందు పని చెయ్యలేదు. వెంటనే ఎస్.పి.కి ఫోన్ చేశాడు. కల్లబొల్లి కథలల్లి చెప్పాడు. భార్గవని మందలించి, మా మనుషుల్ని విడిపించమని అడిగాడు.

అంతకుముందే భార్గవ ఎస్.పి. భరత్‌కుమార్‌కి విషయమంతా వివరంగా ఫోనులో చెప్పి వున్నాడు. ఎస్.పి. బాలాజీ మాట వినలేదు.

"ఎస్.పి. గారూ! ఎం.ఎల్.ఏ. మాటకి విలువ ఇవ్వకుండా తిరస్కరిస్తారా? మా పార్టీ కార్యకర్తలకి రక్షణ లేకుండా పోయింది. అక్రమంగా అరెస్టు చేశారు. నేను ఈ విషయం ముఖ్యమంత్రికి చెబుతా" అని బెదిరించాడు.

"చెప్పండి బాలాజీగారూ! ముఖ్యమంత్రిగారు మీరు చెప్పిందే వేదం అనుకోరు. విజ్ఞత కలవారు. ఆయన మన రాష్ట్రానికి ముఖ్యమంత్రే కాని కృష్ణాజిల్లాకి ఎస్.పి. కాదు. ఆయనే నాకు ఈ జిల్లా శాంతి భద్రతలు అప్పగించారు. ఇక్కడ పరిస్థితిని బట్టి చర్యలు తీసుకోవలసింది మేము"

"శాసనసభ్యుడిగా మాకు సహకరించవలసిన మీరు నేరం చేస్తూ పట్టుబడిన గూండాల్ని కార్యకర్తలు అని కట్టుకథలు చెబుతున్నారు. మీ పద్ధతి అసహ్యంగా ఉంది. మేం పిచ్చివాళ్ళంకాదు" అని ఫోన్ పెట్టేశాడు.

బాలాజీ తెల్లముఖం వేశాడు.

భార్గవ ఆరోజే నేరస్థుల్ని కోర్టులో హాజరు పరిచాడు. మెజిస్ట్రేటు ప్రాథమిక విచారణ జరిపి, ముద్దాయిల్ని రిమాండుకు పంపాడు.

అసభ్య ప్రవర్తనకి సావిత్రిపై మోపిన కేసులో సావిత్రి కోర్టులో నేరం అంగీకరించింది. స్వయంగా కోర్టులో నేరం అంగీకరించి, దాడి విషయం తనకు తెలియదని పశ్చాత్తాపం ప్రకటించిన సావిత్రికి, న్యాయమూర్తి, ఐ.పి.సి. 294 సెక్షను కింద నూరు రూపాయలు జరిమానా విధించి విడుదల చేశారు.

విచారణ సందర్భంగా కోర్టుకు హాజరైన విజయసారథి సావిత్రికి విధించిన జరిమానాని చెల్లించాడు. పాత జీవితానికి చరమగీతం పాడి, బాలాజీని వదిలి సావిత్రి దేవనగరం వెళ్ళిపోయింది.

నాగరాణి, సరస్వతి ఇంటిముందు ఆవరణలో మాట్లాడుకుంటున్నారు. సమయం సాయంత్రం ఆరు గంటలు కావస్తోంది.

"నాగరాణీ! ఆ సారథి బ్యాంకు ఆఫీసరట. పేరు విజయసారథి అట. కొత్తగా వచ్చిన యస్.ఐ. ఆయనకి మిత్రుడంట. ఇద్దరూ మంచి వీరులంట. ఊరంతా వింతగా చెప్పుకుంటున్నారు. కమలాంబ తప్పంచనా వేసింది"

"అవునే సరస్వతీ! అసలే ఇద్దరూ వీరులైతే ఆపైన వాళ్ళకి వీరభద్రయ్య తోడయ్యాడంట. ఇక ఎదురేముంది?. నాకు మా కొండయ్య చెప్పాడు. సమయానికి మా కొండయ్య గూడా అక్కడే వున్నాడంట. వీడి దుంపతెగ పారిపోయే గోపాల్‌గాణ్ణి అడ్డం తిరిగి పట్టుకున్నాడంట" అని నవ్వింది నాగరాణి.

మాటల్లోనే విజయసారథి, భార్గవ, నాగరాణి ఇంటిముందుకు వచ్చారు.

ఆశ్చర్యం. అనూహ్యం. నాగరాణి సంభ్రమంలో మునిగిపోయింది. సరస్వతి చకచకా అక్కడినుండి వెళ్ళిపోయింది.

"నమస్కారం నాగరాణిగారూ! నా పేరు

విజయసారథి. ఈయన ఇన్‌స్పెక్టర్ భార్గవ" అని పరిచయం చేస్తూవుండగానే భార్గవ నమస్కారం చేశాడు.

"రండి" అని నాగరాణి ఇద్దరినీ సాదరంగా ఆహ్వానించి హాల్లో సోఫాలో కూర్చోమంది. ఇద్దరూ కూర్చున్న తర్వాత ఎదురుగా వున్న సోఫాలో తాను కూర్చుంది. లోపల గదిలోవున్న ఉషాబాల బయటికి వచ్చింది. ఆ ఇద్దరికీ నమస్కారం చేసి తల్లి పక్కనే సోఫాలో కూర్చుంది.

హాల్లో ఎదురుగా అర్జునరావు ఫొటో వుంది. ఉషాబాలకి ఆ పోలికలున్నాయి.

"నాగరాణిగారూ! మీతో మాట్లాడాలని వచ్చాం" అన్నాడు భార్గవ.

"మంచిది బాబూ! మాట్లాడండి"

"రేపు విజయదశమి పండగ సందర్భంగా పోలీసు స్టేషను ముందు రాత్రికి సభ ఏర్పాటుజేశాం. ఎస్.పి. భరత్‌కుమార్‌గారు వస్తారండి. సభానంతరం హరికథ కూడా వుంటుంది. గ్రామ పెద్దల్ని ఆహ్వానిస్తున్నాం. మీరు తప్పక రావాలి. విజయసారథిగారు, నేను మిమ్మల్ని పరిచయం చేసుకుని ఆహ్వానించాలని వచ్చాం. తప్పక వస్తారుకదూ"

"మీరు స్వయంగా వచ్చి ఇంత గౌరవంగా ఆహ్వానిస్తున్నపుడు రాకుండా వుంటానా? తప్పకుండా వస్తాను"

"నాగరాణిగారూ! మిమ్మల్ని ఒక విషయం అడగాలనుకుంటున్నాం. కానీ సందర్భం కాదేమోనని సందేహిస్తున్నాం" అన్నాడు భార్గవ.

"సందేహమేమీ వద్దు. అడగండి. నేనేమీ అనుకోను"

"ఈ విజయసారథిగారి మీద దాడి జరిగిందని మీకు తెలిసేవుంటుందిగదా"

"తెలుసు. మా పాలేరు కొండయ్య చెప్పాడు"

"అందరినీ బంధించి ఈరోజే కోర్టులో హాజరుపరిచి వచ్చాను. దాడిచేసిన గూండాలు మీ తోటలోనే మకాం పెట్టారట. ఆ విషయం మీకు తెలుసా? "

"మా తోటలో మకాం పెట్టారని మాకు తెలియదు. ఇది మామిడికాపు సీజన్ కాదుగా. మా పాలేరు కూడా అటు వెళ్లటం లేదు. చందన్ మాకు చెప్పకుండానే పెట్టించి వుంటాడు. తోటలో పాక, బావి వున్నాయిగదా!

అయితే ఒక నిజం మాత్రం నాకు తెలుసు. సారథి అనే యువకుడిమీద దాడికి ప్రయత్నిస్తున్న సంగతి ముందే నాకు తెలుసు. ఎలా చేస్తారో తెలియదు. ఎక్కడ చేస్తారో గూడా తెలియదు. అక్కడికీ ఆ ప్రయత్నంలోవున్న భూపాలరావు తల్లికి హితవు చెప్పాను. వద్దన్నాను. కాని ఆ తల్లి, కొడుకు మానుకోలేదు. నాకు ముందే తెలిసినా ఆ రాఘవేంద్రగారి కుటుంబంతో బ్రహ్మానాయుడుగారితో మాకు సత్సంబంధాలు లేవుగనుక ఉపేక్షించి వూరుకున్నాను.

మీ యువకులిద్దరూ ఏమనుకుంటున్నారో గాని, ఈ దాడి జరగటం వలన మీకు మేలే జరిగింది. మీ ఇద్దరి ప్రతిభ, ప్రతాపం వెలుగులోకి వచ్చింది. మీకు ప్రజాభిమానం, ప్రతిష్ఠ సమకూరింది. కీడులో మేలు అంటే ఇదే" అని నాగరాణి నవ్వింది.

"కీడు జరుగుతుందని తెలిసీ ఉపేక్షించి ఊరుకున్నానన్నారు. మేలు జరిగిందని మెచ్చుకుంటున్నారు" అన్నాడు చిరునవ్వుతో విజయసారథి.

ఈ లోపల వంటగదిలో కొండయ్య భార్య టీ తయారుచేసింది. ఉషాబాల లేచి వెళ్లి రెండు కప్పుల్లో టీ తెచ్చి ఇద్దరికీ అందించింది.

"విజయసారథిగారూ! మీరు వీరవరం వచ్చి మా తాతయ్య గారింట్లో అతిథిగా వున్నారు. అనూహ్యంగా దాడికి గురి అయ్యారు. ఆ దాడికి మా బంధువులే పూనుకోవటం మా అందరికీ అవమానకరంగా వుందండి. మా అందరి తరపున నేను మిమ్మల్ని క్షమాపణ వేడుకుంటు

న్నాను" అంది ఉషాబాల.

"ఉషాబాలా! నువ్వు క్షమాపణ చెప్పట మెందుకు? మీ అమ్మగారన్నట్లు ఈ దాడి వల్ల నిజంగా మేలే జరిగింది" అన్నాడు విజయసారథి.

ఇద్దరు యువకులూ నాగరాణికి చెప్పి వెళ్ళిపోయారు.

"అమ్మా! దాడి విషయం ముందే తెలిస్తే ఎందుకు ఉపేక్షించావు. బ్రహ్మనాయుడు పెదనాన్నతో సన్నిహితంగా వుండేవాళ్ళంతా మనకు శత్రువులా? అసలు పెదనాన్నని మాత్రం శత్రువుగా ఎందుకు చూడాలి?"

"దాసుడి తప్పు దండంతో సరి అన్నట్లుగా అందరి తరపున నువ్వు క్షమాపణ చెప్పావుకదా. అది బాగానే వుందిలే. ఈ విజయసారథి, భార్గవ ఇద్దరూ వినయం, వివేకం, వీరత్వం ఉన్న యువకులే. అభినందనీయులే. ఈ పాటి పరిచయం ముందే వుంటే ఈ దాడిని అడ్డుకునేదాన్నే. కానీ అలా అడ్డుకున్నందువల్ల ఈ యువకుల ప్రతిభ వెలుగులోకి రాకపోగా, పాపారావువంటి పాపాత్ములు జైలుపాలుగావడం తప్పేది. నిజంగా ఈ దాడివల్ల మేలే జరిగింది.

ఇక బ్రహ్మనాయుడితో శత్రుత్వం అంటావా? ఈ నాగరాణి విరాగిణిగా యోగినిగా మారినప్పుడు ఆలోచిద్దాం. ఇప్పుడు చెప్పకు"

"అమ్మా... కన్న తల్లిగా నిన్ను పూజిస్తాను. గౌరవిస్తాను. కానీ కావలసిన వాళ్ళకి దూరంగా ఎల్లకాలం వుండలేను. అనూరాధక్కతో కలిసి తిరుగుతాను. పెదనాన్నగారింటికి వెళ్తాను. ఏకాకిగా వుండడం ఇక నావల్లకాదు. నామీద ఆంక్షలు వద్దు. నన్ను క్షమించు"

నాగరాణి మౌనం వహించింది. అదే అంగీకార సూచకం.



విజయదశమి పండగరోజు ఉదయం ఏడు గంటలకు అనూరాధ, సదానందం ఊరికి పశ్చిమంగా ఉన్న తోటకి పూలు, పండ్లు, కూరగాయలకోసం బయలుదేరారు. అనూరాధ తోట చూడాలని సదానందంతో పాటు బయలుదేరింది. ఊరు వెలుపలికి వచ్చారు. సదానందం సంచి తీసుకుని ముందు నడుస్తున్నాడు. ఏదో ఆలోచిస్తూ తల వంచుకొని నడుస్తున్నాడు.

"నమస్కారం సదానందంగారూ!"

సదానందం తల ఎత్తి చూశాడు. ఎదురుగా సునంద నిలిచివుంది.

"సునందా నువ్వా? బాగున్నావా? నేనేదో ఆలోచనలో పడి నిన్ను చూడనే లేదు"

"బాగానే వున్నాను. ఉదయం ఏడుగంటలకే బయలుదేరారు ఎక్కడికి? మీ తోట ఇటేగా వుంది తోటకేనా?"

"అవును తోటకే" అనూరాధ కూడా తోట చూడక చాలారోజులయిందని చూడడానికి వస్తానని బయలుదేరింది.

"సునందా! చాలాకాలానికి మామీద దయ కలిగిందే. బాగున్నావా?"

"నీ దయతో, మీ నాన్నగారి సహాయంతో

బి.ఏ. బి.యిడి చేసినదాన్ని. అనూరాధా! నేను మీమీద దయ చూపటమేమిటే. జీవితాంతం మీకు నేను రుణపడి ఉంటాను"

"ఏడిశావ్‌లే నీ కబుర్లూ నువ్వూను. రుణంలేదు పణంలేదుగానీ మాతోపాటు తోటకి రావే. పూలు, పండ్లు, కూరగాయలు కోసుకొని పోదాం"

"నేను వచ్చిందే నీకోసం. నువ్వు కలిశాక ఇంకెక్కడికి పోతాను? "

ముగ్గురూ మాట్లాడుకుంటూ తోటవైపు నడుస్తున్నారు.

"సునందా... అసలే అప్సరసలా ఉంటావు. అలంకరించుకుని ఒంటరిగా బయలుదేరావేంటే భయం లేకుండా" అంది అనూరాధ నవ్వుతూ.

"ఆపదలో ఆదుకునే ఆపద్బాంధవులు తిరిగే నేలగదా ఇది. అందుకే భయం లేకుండా బయలుదేరాను" సదానందంవైపు చిరునవ్వుతో చూస్తూ అంది.

"ఆరోజు నేను టవల్ అందించాను. అది మళ్ళీ నాకివ్వనేలేదు. నన్ను ఆపద్బాంధవుడు అని పొగుడుతున్నావు"

"ఆ టవల్ ఇప్పటికీ నాదగ్గరే వుంది. అయినా ఇవ్వను"

"విన్నావా అనూరాధా. కృతజ్ఞత అంటే ఇదేనా? ఏడేళ్ళనుంచి నా టవల్ దాచుకుని ఇవ్వననడం న్యాయంగా వుందా? "

"అదేంటే సునందా? ఇవ్వనంటావెందుకని? "

"అది ఒక ఆపద్బాంధవుడు ఆపద సమయంలో కాపాడుతూ అందించింది. ఆరోజు నేను పైన కప్పుకొని పరువు కాపాడుకున్నది. ఆరాధ్యుడైన ఆ వ్యక్తి అందించిన దాన్ని గుర్తుగా దాచుకున్నాను"

"ఓసి పిచ్చిమొఖమా... పెళ్ళి కావాల్సిన దానివి ఎవరినో ఆరాధ్యుడు అన్నావంటే నిన్నెవడూ చేసుకోడే"

"ఎవరో నన్ను చేసుకోకపోవడంగాదు. నేనే ఎవర్నీ చేసుకోను"

"అదేంటే... అసలు పెండ్లే చేసుకోవా? "

"అనూరాధా అసలు విషయం దాచకుండా తరవాత చెబుతాలే. నాకు నీకంటే ఆప్తులెవరున్నారు. నీకు చెబుదామనే వచ్చాను"

"అదేంటో ఇప్పుడే చెప్పు. అన్నయ్య విన్నా ఫరవాలేదు. ఎవరితోనూ అనడు. ఆపద్బాంధవుడని అన్నావుగదా"

"ఆరోజు నాశనం కాబోతున్న నా శీలాన్ని కాపాడి, నేను ఆత్మహత్య చేసుకోకుండా నా ప్రాణాల్ని కాపాడినవారికే జీవితం అంకితం. మరొకరిని చేసుకోను. అది జరగకపోతే పెళ్ళి మానుకొని సంఘసేవ చేస్తాను"

"అంటే సదానందం అన్నయ్యని తప్ప మరొకర్ని చేసుకోవన్నమాట"

"అంతే అనూరాధా!"

"సునందా, మీ అమ్మానాన్న, అసలొప్పుకోరు. వారు సాంప్రదాయవాదులు. ఆ సంగతి నాకు తెలుసు. వారికి నువ్వు ఒక్కగానొక్క కూతురివి. వారి మనసు నొప్పించటం, క్షోభ పెట్టటం మంచిదికాదు" అన్నాడు సదానందం.

"ఆ సంగతి నాకు తెలుసు. అమ్మానాన్నల ఇష్టాలతో పనిలేదు. మీకు ఇష్టమో కాదో చెప్పండి. మీరు కాదన్నా నేను బాధపడను. అలా బాధపడకూడదు. ఎందుకంటే ఇంతకుముందే మీకు మరొక అమ్మాయి నచ్చి వుండొచ్చు మీరు ఆ అమ్మాయిని చేసుకోవాలని నిర్ణయించుకొని వుండొచ్చు. కానీ నా నిర్ణయం మారదు. ఒకటి మీరు అంగీకరిస్తే పెళ్ళి, లేకపోతే సంఘసేవ"

"ప్రాణంకంటే విలువైన శీలాన్ని కాపాడిన వ్యక్తి భర్త కావాలని కోరుకోవడం భారతీయ సంస్కృతికి అనుగుణమే. ఎవరూ కాదనలేరు.

ఇక కులమంటారా? గుణహీనుడు బ్రాహ్మణుల ఇంట్లో పుట్టినా బ్రాహ్మణుడు

కాజాలడని గౌతమబుద్ధుడు చెప్పాడు వివే కానందుడు చెప్పాడు.

నేను బి.ఏ. తరువాత బి.యిడి. చేస్తూ కొందరు మహాకవుల భావాలు పరిశీలించాను. వారి సూక్తులు నన్నెంతో ప్రభావితం చేశాయి.

"పాపవర్తనుండు బ్రాహ్మణుండయ్యును
నిజము శూద్రుకంటె నీచతముడు.
సత్య, శౌచ, ధర్మ, శాలి శూద్రుండయ్యు
అతడె బ్రాహ్మణుండు అనిరి బుధులు"

అని కవిత్రయంలోని మహాకవి ఎర్రాప్రెగడ అన్నాడు. ఆయన బ్రాహ్మణుడైనా నిష్పాక్షికంగా, మొగమాటం లేకుండా చక్కని సూక్తులు చెప్పాడు.

"తండ్రి బ్రాహ్మణుడైన మాత్రంబుచేత
బ్రాహ్మణుండు కాడు తత్తనూభవుడు పుత్ర!
అమల గుణకర్మ పరిహీనుడయ్యెనేని"

అని కవిరాజు త్రిపురనేని రామస్వామి గారు పలనాటి 'భగవద్గీత'లో చెప్పారు.

ఈ విషయాలు నేనెందుకు చెబుతున్నానంటే మా నాన్న పెళ్లిసంబంధాలు నాకు తెలవకుండానే చూశారట! ఆ బ్రాహ్మణ యువకులు నిజానిజాలు తెలుసుకోకుండానే నా శీలం కళంకితం కాకుండా వుందా అని శంకించారట! వ్యంగ్య ప్రశ్నలేశారట! తరువాత మా అమ్మ నాతో చెప్పి ఎంతో బాధపడింది. ఆ కుబుద్ధులమీద మండిపడింది.

నా నిర్ణయాన్ని మా నాన్న అంగీకరించడు. కాని మా అమ్మ కాదనదు!

చదువు, సంస్కారం వున్న వ్యక్తిని, అనూరాధ అన్నగా భావించిన వ్యక్తిని, నేను భర్తగా స్వీకరిస్తే తప్పా? "

"సునందా! నీ ఆలోచన, నీ నిర్ణయం ప్రశంసనీయం! నువ్వు బాగా ఎదిగిపోయావు! అన్నయ్యా ఆలోచన ఎలా వుందో మరి? "

"అంత గొప్పగా సునంద ఆలోచిస్తున్నపుడు నాకేమీ అభ్యంతరంలేదు. అందం, ఆత్మసౌందర్యం వున్న సునందని నేను మాత్రం ఎందుకు కాదంటాను? అయితే అనూరాధ పెళ్లి తరువాత నాన్నగారి అంగీకారంతో చేసుకుంటాను. అంతవరకు ఈ విషయం మన ముగ్గురి మధ్యనే వుండాలి".

"అన్నయ్యా! ఈ విజయదశమి పండుగ రోజున మీ ఇద్దరూ ఆదర్శవంతమైన నిర్ణయం తీసుకున్నారు. నాకెంతో ఆనందంగా వుంది"

"సునందా! మరొక్కమాట. నేను బ్రహ్మానాయుడుగారికి దత్తపుత్రుణ్ణి అని నువ్వనుకోవద్దు! నేను వారి పాలేరునే! వారి సంపదలో నాకేమీ వాటా రాదు! ఇచ్చినా నేను తీసుకోదలుచుకోలేదు. అది అనూరాధదే! నా తండ్రి కూడా ఆ కుటుంబంలో పాలేరుగానే వుండేవాడు. బ్రహ్మానాయుడుగారికి నా తండ్రి సమవయస్కుడు. పాలేరుగా వున్నా స్నేహితుల్లా వుండేవారట! ఆ సన్నిహితంతో తల్లిదండ్రుల్ని కోల్పోయిన నన్ను సాదరంగానే చేరదీశారు. ప్రేమగా చూశారు. వారు నాకు దైవసమానులు. వారికోసం నా ప్రాణాలైనా అర్పించటానికి వెనుకాడను! ఆ దంపతుల్నే తల్లిదండ్రులుగా ఆరాధిస్తాను"

"ఆ విషయం నాకు తెలుసు! నాకు కావల్సింది సంపద కాదు. మీ సంస్కారం, గుణసంపద. అదే ఎవరికైనా తరగని సంపద"

ముగ్గురూ తోటకి వెళ్లారు. నందనవనంలాంటి ఆ తోటలో కొంతసేపు గడిపారు. పూలు, పండ్లు, కూరగాయలు, ఆకుకూరలు తీసుకొని ఇంటికి వచ్చారు. తనని సాదరంగా ఆహ్వానించిన భారతీదేవికి, బ్రహ్మానాయుడుగారికి సునంద పాదాభివందనాలు చేసింది.

★ ★ ★

"తాతయ్యా! నమస్కారం" అంటూ భార్గవ రాఘవేంద్రగారి ఇంట్లో అడుగుపెట్టారు.

"రా బాబూ!" అంటూ రాఘవేంద్రగారు

సాదరంగా ఆహ్వానించారు. అప్పుడు వైదేహిగారు ఇంట్లోలేదు. విజయసారథి .గది నుండి బయటికి వచ్చాడు.

"తాతయ్యా! ఈరోజు రాత్రి పోలీసుస్టేషను ముందు జరిగే సభలో, మీ పెద్దల ప్రసంగాల అనంతరం హరికథ ఏర్పాటు చేయించాను. తెనాలి నుండి త్యాగరాజు అనే హరిదాసు వచ్చాడు. అసలు పండగ సందర్భంగా నాటకం వేయించుదామనుకున్నాను. కాని త్యాగరాజ భాగవతార్ మంచి హరి కథా కళాకారుడు. నాకు మిత్రుడు కూడా! వీరవరం రావాలని ఉత్సాహం చూపాడు. ఆహ్వానించాను! హరికథ గురించి మీ అభిప్రాయం ఏమిటి? "

"భార్గవా! నాకు నాటకాలు, హరికథలు, బుర్రకథలు వంటి సాంస్కృతిక ప్రదర్శనలంటే బాగా యిష్టం! నేనూ వయసులో వుండగా నటుణ్ణే! నాటకాల్లో నారద పాత్ర ఎక్కువగా ధరించేవాణ్ణి! అనేక నాటకాల్లో, కావ్యాల్లో, పురాణాల్లో వచ్చే ఆ నారద పాత్ర నాకెంతో యిష్టం!

హరికథ గురించి జనానికందరికీ తెలియటానికి చాటింపు వేయించు. తప్పెట వాయించుతూ చాటింపు వేసే ఒక హరిజన మాదిగ ప్రతి ఊళ్లోనూ వుంటాడు. ఈ వీరవరంలో కోటయ్యా అనే అతను కోటయ్యని పిలిపించి చాటింపు వేయించు"

"అలాగే చేస్తాను తాతయ్యా! చాలా విషయాలు మీనుంచి తెలుసుకున్నాను. మీరు అనుభవజ్ఞులు!" అన్నాడు భార్గవ.

"ఇంత విషయ పరిజ్ఞానం తాతయ్యకి వుందని నాకూ ఇప్పుడే తెలిసింది. వయసులో పెద్దవారు. జీవితానుభవం వున్నవారు గదా" అన్నాడు విజయసారథి.

★ ★ ★

కోటయ్యా తప్పెట నిప్పులమీద వేడిచేశాడు. దెబ్బవేసి చూశాడు. ఖంగున మోగింది. తప్పెట చంకకి తగిలించుకున్నాడు. దరువులు పలికిస్తూ ఒక సెంటరుకు వచ్చాడు. అక్కడ నిలిచి తప్పెట ఢమఢమలాడించాడు. కంచుకంఠంతో చెయ్యి పైకెత్తి ఎలుగెత్తి.

"మన వీరవరం గ్రామంలో ఈరోజు రాత్రి తొమ్మిది గంటలకి పోలీసుస్టేషన్ దగ్గర సభ జరుగుతుంది. తరువాత త్యాగరాజు భాగవతార్‌గారు 'విరాటపర్వం' హరికథ చెబుతారు. కనుక అందరూ రావాల్సిందిగా పోలీసువారు కోరుతున్నారొహో"

రాత్రి తొమ్మిది గంటలకి వీరవరం ప్రజలు వేదిక దగ్గరకు చేరారు. అందంగా పోలీసుస్టేషన్‌కి ముందు నిర్మించిన వేదిక పక్కన స్త్రీలకోసం ప్రత్యేక విభాగం ఏర్పాటు చేశారు. ఆ విభాగంలో వేదిక సమీపంలో నాగరాణి కూర్చుంది. ఆమెకి దగ్గరలో ఉషాబాల, అనూరాధ, సునంద కూర్చున్నారు.

భార్గవ ఆహ్వానాన్ని మన్నించి ఎస్.పి. భరత్‌కుమార్ వీరవరం వచ్చాడు. భరత్‌కుమార్‌కి వీరవరం అంటే ప్రత్యేకాభిమానం వుంది.

ఎస్.పి. భరత్‌కుమార్, ప్రెసిడెంటు జగదీష్‌ప్రసాదు, రాఘవేంద్రగారు, బ్రహ్మానాయుడు భార్గవ కోరికపై వేదికపైన ఆసీనులయ్యారు.

ముందుగా జగదీష్‌ప్రసాదు క్లుప్తంగా మాట్లాడుతూ ఇనస్పెక్టర్ భార్గవని, విజయసారథిని, వీరభద్రయ్యని, గూండాలపై వీరోచితంగా పోరాడి బంధించినందుకు ప్రత్యేకంగా అభినందించాడు.

ఎగ్గుసిగ్గులేకుండా గూండాలకి అండగా నిలిచిన ఎం.ఎల్.ఏ. బాలాజీని నిర్భయంగా ఎదిరించి బుద్ధిజెప్పినందుకు భార్గవని అభినందించాడు.

"భార్గవగారూ! అరాచకశక్తుల్ని అణచివెయ్యటానికి, అక్రమ కాపుసారా వ్యాపారాన్ని అరికట్టటానికి, పట్టుదలతో పూనుకున్న మీకు ఈ వీరవరం గ్రామ ప్రెసిడెంటుగా నా పూర్తి సహకారాన్ని అందిస్తాను. మన వీరవరం పరిసర గ్రామాలన్నింటినీ శాంతి

మండలంగా తీర్చిదిద్దుదాం" అని తన ప్రసంగం ముగించాడు.

సభకి వచ్చిన ప్రజలు విజయసారథిని, భార్గవని చూడాలని వేదికపైకి రమ్మని కోరారు. నిన్నటిదాకా అజ్ఞాతంగా సాధారణ పౌరుల్లాగా తిరిగి, గూండాల దాడితో ఒక్కసారి వెలుగులోకి వచ్చిన యువకులిద్దరినీ చూడాలని ఆబాలగోబాలం ఆసక్తితో సభకి వచ్చారు.

ఇద్దరూ వేదికపైకి వచ్చి చేతులు జోడించి ప్రజలకు వందనాలు చేశారు.

విజయసారథిని, భార్గవని విడివిడిగా పేర్లు చెప్పి జగదీష్ ప్రసాదు ప్రజలకు పరిచయం చేయగానే సభ కరతాళధ్వనులతో మారుమోగింది.

తరువాత బ్రహ్మానాయుడు ప్రసంగించాడు.

తరువాత భార్గవ కోరికపై విజయసారథి ప్రసంగించాడు.

"గౌరవనీయులైన పెద్దలకు, సోదరులకు, సోదరీమణులకు, నా వందనాలు. నా పేరు విజయసారథి. సారథి అనే సగం పేరుతో, మీ వూళ్లో, నిన్నటిదాకా మీలో ఒకడుగా తిరిగాను. బండి తోలి, అరక దున్ని, బ్రహ్మానాయుడుగారిని మెప్పించాను. అలా మీలో ఒకడుగా తిరగటం నాకు ఆనందానుభూతిని కలిగించింది. బ్రహ్మానాయుడుగారు నన్ను మెచ్చుకోవటం సహించనివారు ఈర్ష్యతో నన్ను ఈ వూరునుండి తరిమివేయాలని దాడిచేయించారు. నేను దేశదిమ్మరిని అనుకున్నారు. అదృష్టవశాత్తు భార్గవగారు నాకు పరిచయమై తోడుగా వున్నారు.

అసలే మేమిద్దరం కొరకరాని కొయ్యలం! సామునేర్చిన వాళ్లం ఆపైన మాకంటే మొనగాడు వీరభద్రయ్య తాతయ్య తోడయ్యాడు. అందరినీ పడగూల్చాం. పక్కనే వుండి మా పై దాడిచేయించి, భంగపాటు గమనించి పారిపోతున్న పాపారావుని, గోపాల్‌ని సదానందం, కొండయ్యా పట్టి బంధించారు.

అందరూ ఇప్పుడు జైలుపాలయ్యారు.

ఆర్.డి.వో.గా వీరవరం సిండికేటు బ్యాంకులో చేరిన నేను ఇక్కడి కర్షకులకు మంచి మిత్రుడిగా వుంటూ, వ్యవసాయాభివృద్ధికి నిరంతరం కృషిచేస్తాను. సహృదయులైన కర్షకులందరూ నాకు సహకరిస్తారని ఆశిస్తాను"

అని విజయసారథి తన ప్రసంగం ముగించాడు.

తరువాత రాఘవేంద్రగారిని మాట్లాడమని భార్గవ కోరాడు.

వక్తలందరిలో వయోవృద్ధులైన రాఘవేంద్రరావుగారు సభకి వందనాలు చేసి ప్రసంగం ప్రారంభించారు. "సోదరీసోదరులారా... నేనూ సంక్షిప్తంగా ప్రసంగిస్తాను. విజయదశమి పండగ సందర్భంగా ఇన్‌స్పెక్టర్ భార్గవ పోలీసు స్టేషన్ తరపున ఈ సభ ఏర్పాటు చేసి గ్రామపెద్దల్ని ఆహ్వానించడం, ప్రసంగాలు చేయించడం, ఒక ప్రయోజనకరమైన సరికొత్త సాంప్రదాయం. పోలీసులకి, ప్రజలకి మధ్య చక్కటి సమన్వయం ఏర్పడడానికి ఇటువంటి సభ మంచి సాధనం.

మన గ్రామంలో ప్రజలందరూ సమభావంతో సమైక్యంగా నిలిచి, అక్రమ కార్యకలాపాల్ని అంతం చేయడానికి పూనుకున్న ఇన్‌స్పెక్టర్ భార్గవకి సహకారం అందించుదాం. ఈ వీరవరాన్ని శాంతివనం చేద్దాం" అని రాఘవేంద్రగారు ప్రసంగం ముగించారు.

తరువాత జగదీష్ ప్రసాదు నాగరాణిని మాట్లాడమని కోరాడు. భార్గవ, విజయసారథి కూడా నాగరాణిని మాట్లాడమని కోరారు.

నాగరాణి వేదికపైకి వచ్చి మైక్ ముందు నిలిచింది.

ఇంతకుముందు రాఘవేంద్రగారి ప్రసంగం కొంత నాగరాణికి హితబోధ చేసినట్లుగానే వుంది. అసలే గడుసుగా

వుండే తన తల్లి ఆవేశంతో యేమి విసురు విసురుతుందోనని ఉషాబాలకి కంగారుగా వుంది.

"గౌరవనీయులైన సభాసదులందరికీ నా వందనాలు.

నాకు ఉపన్యాసాలు చెప్పే అలవాటు లేదు. గుంటూరులో బి.ఏ. చదివేటప్పుడు విద్యార్థి సమావేశాల్లో క్లుప్తంగా మాట్లాడే దాన్ని.

ఇంతకుముందు మాట్లాడిన పెద్దలందరూ వీరవరం గ్రామ విశిష్టత గురించి, ఈనాటి పరిస్థితి గురించి, ఇకముందు జరగాల్సినదాన్ని గురించి చక్కగా మాట్లాడారు. "పూర్వోదంతముల్ నేటి సంకటముల్ దీర్పవు" అన్నాడొక కవి.

అయినా మనం మన పూర్వవైభవాన్ని, విశిష్టతని గుర్తు తెచ్చుకోవడం స్ఫూర్తిదాయకమే. ప్రస్తుతం మనకెదురైన సమస్యల్ని పరిష్కరించుకోడానికి ఆ స్ఫూర్తి ఉపయోగపడుతుంది.

విజయసారథి, భార్గవ, ఇద్దరూ కార్యదక్షులు, వీరత్వంతోపాటు వివేకం, వినయం కలిగిన యువకులు.

అధికారుల మధ్య అహంకారం లేకుండా సవినయంగా గ్రామప్రజల సహకారం కోసం ఈ సభ ఏర్పాటు చేయడమే అందుకు నిదర్శనం.

వీరవరం రావడంతోనే ఈ యువ అధికార్లిద్దరూ సంచలనాత్మకమైన విజయం సాధించారు. విజయసారథి మీద దాడి తలపెట్టడం వీరవరం గ్రామానికి కూడా మేలే అయింది. దుండగులందరూ ఈ అఖండుల చేతుల్లో పడి చట్టానికి చిక్కి కటకటాలపాలయ్యారు.

ఈ దాడి మీమీద జరగడం 'కీడులో మేలు' అని ఈ యువకులతో నిన్ననే అన్నాను. ఇప్పుడూ అదే అంటున్నాను.

మన వీరవరం గ్రామశ్రేయస్సుకోసం ఇకనుండి మన గ్రామప్రజలందరం హృదయపూర్వకంగా సహకరించుకుందాం. గ్రామాభివృద్ధికోసం ఇకముందు నీవు, నేను, నీది, నాది అనుకోకుండా, మనం, మనది అనుకుందాం. ఐక్యంగా వుందాం" అని నాగరాణి తన ప్రసంగం ముగించింది.

తన తల్లి నాగరాణి ఆవేశానికి లోనుగాకుండా, ఎవరిమీదా విరుచుకుపడకుండా ప్రశాంతంగా, విజ్ఞతతో ప్రసంగించినందుకు ఉషాబాల ఊపిరి పీల్చుకుని హమ్మయ్య అని ఆనందించింది.

చివరగా భార్గవని మాట్లాడమని జగదీష్ ప్రసాద్ కోరాడు.

భార్గవ తాను, విజయసారథి అజ్ఞాతంగా వూళ్లో తిరుగుతూ సేకరించిన అన్ని విషయాలను ప్రజలముందుంచాడు. అటు తరువాత సారా వ్యాపారస్తుల్ని, గూండాల్ని వ్యభిచారుల్ని ఇలా హెచ్చరించాడు.....

"ఇప్పుడు నేను ఇదే వేదికనుండి కాపు సారా వ్యాపారులకి, జూదగృహాలవాళ్ళకి, జూదగాళ్ళకి, వ్యభిచారులకి, గూండాలకి తీవ్ర హెచ్చరిక చేస్తున్నాను. రేపటినుండి అన్నీ ఆగిపోవాలి. ఆపకపోతే సంకెళ్ళు వేసి కటకటాల వెనక్కి పంపుతాను. ఎదురు తిరిగితే మెడలు విరుస్తాను. ఇదే చివరి హెచ్చరిక.

మాపై అభిమానంతో సభకి వచ్చిన ప్రజలకు, సందేశాత్మక ప్రసంగాలు చేసిన పెద్దలకు మా కృతజ్ఞతాభివందనాలు.

ఇప్పుడు మా మిత్రుడు త్యాగరాజ భాగవతార్ హరికథ వినిపిస్తాడు",

అని భార్గవ తన ప్రసంగం ముగించాడు. సభ ముగిసింది.

లేత ఎరుపురంగు ధోవతి కట్టుకొని, అదే రంగు ఉత్తరీయం నడుముకు చుట్టుకొని, కాళ్ళకు గజ్జెలు కట్టుకొని, చేతిలో చిరుతలు పట్టుకొని, 'గానగంధర్వ' బిరుదాంకితుడు త్యాగరాజు వేదికమీదకు వచ్చాడు.

త్యాగరాజ భాగవతార్ వేదికపైకి రాగానే ఒక చిన్నారి బాలిక రకరకాల పూలతో

తయారుచేసిన పూలదండ తెచ్చి హరిదాసు మెడలో వేసింది.

ఆ పూలదండని అనూరాధ, ఉషాబాల, సునంద తయారుచేశారు. అందంగా కూర్చిన పూలదండ మెడలో వేయగానే త్యాగరాజు ఆనందంగా సభకి వందనాలు చేసి కథా ప్రారంభం చేశాడు.

మంచి సాంస్కృతిక కార్యక్రమం ఏర్పాటు చేసినందుకు జనం, గ్రామపెద్దలు, భార్గవని కొనియాడారు.

నాగరాణి భార్గవని, త్యాగరాజుని అభినందించి త్యాగరాజుకు ఐదు వందల రూపాయిలు బహుమతిగా అందించింది.

ఒక ఉత్తమ కళాకారుడికి కళాభిమానంతో బహుమతి అందించిన తన తల్లి ఔదార్యానికి ఉషాబాల ఆనందించింది.

విజయసారథి, ఇనస్పెక్టర్ భార్గవల విజయంతో విజయదశమి పండుగ విజయవంతంగా ముగిసింది.

★ ★ ★

నారాయణరావు, రాజ్యలక్ష్మీదేవిగారు, బ్రహ్మానాయుడు ముగ్గురూ హైదరాబాదులో ముఖ్యమంత్రి నివాసానికి వెళ్లారు.

ముఖ్యమంత్రి వారిని సగౌరవంగా ఆహ్వానించాడు. సముచితంగా ఆసీనుల్ని చేశాడు.

"బ్రహ్మానాయుడుగారూ! మీరు ఇంతకు ముందు వచ్చినపుడు మీ గ్రామ సమస్య, మీ పరిసర గ్రామాల పరిస్థితి చెప్పారు. దానికి నేను తగినవిధంగా చర్య తీసుకున్నాను. పరిష్కారం అయిందా"

"ముఖ్యమంత్రిగారూ! మా గ్రామ సమస్య చెప్పుకోవటానికి మేము మళ్లీ మీదాకా రావాల్సి వచ్చిందండీ! మీరు చర్య తీసుకున్నారు. కొత్త ఎస్.పి, కొత్త ఎస్.ఐ వచ్చారు. ఎస్.పి. భరత్‌కుమార్ అండతో ఇనస్పెక్టర్ భార్గవ అక్కడి పరిస్థితి సమర్ధవంతంగా చక్కదిద్దుతున్నాడు. కాని అది ఎం.ఎల్.ఏ బాలాజీకి కంటగింపుగా వుంది. ఆ ఇద్దరినీ హోంమినిస్టరుతో చెప్పి అక్కడినుండి ట్రాన్స్‌ఫర్ చేయించే ప్రయత్నంలో వున్నాడట. తన పలుకుబడి వినియోగించి మళ్లీ తనకు అనుకూలమైనవాళ్లనే అక్కడికి వేయించుకొనే ప్రయత్నం చేస్తున్నాడని మాకు తెలిసింది. ఆ విషయం మీకు చెబుదామని వచ్చామండీ" అన్నాడు బ్రహ్మానాయుడు.

"మేము ఉద్యోగరీత్యా పట్టణాల్లో వున్నా పుట్టి పెరిగిన వూరు కలుషితమవుతుంటే పట్టించుకోకుండా వుండలేం గదండీ. అందుకే మళ్లీ మీకు చెప్పటం మంచిదని వచ్చాం" అన్నారు నారాయణరావుగారు.

"నారాయణరావుగారూ! గ్రామాల్లో ఇలాంటి సమస్యలు తలయెత్తినపుడు మీబోటి పెద్దలు మా దృష్టికి తేవటం మంచిదే! ప్రభుత్వం కొన్ని విషయాల్లో మొద్దుయెద్దులాగా నడుస్తుంది. ముల్లుకర్రతో పొడిస్తేగాని దానికి చురుకుపుట్టదు. ఇక మీ వీరవరం విషయంలో ఎస్.పిని గాని, ఎస్.ఐనిగాని మార్చటం జరగదు. నేను హోంమినిస్టరుకు చెబితేనే ఆ ఇద్దరినీ అక్కడికి వేశారు. మార్చవద్దని మళ్లీ చెబుతాను. నాకు తెలియకుండా ఏమీ జరగదు. మీకు హామీ ఇస్తున్నాను"

"చాలా సంతోషమండీ మన నాయకులంతా గతంలో దశాబ్దాల తరబడి తెల్లదొరల మీద పోరాడి, లాఠీ దెబ్బలు తిని, జైళ్లకి వెళ్లి తుపాకి గుండ్లకి బలి అయి ఉరిశిక్షలకు గురి అయి అష్టకష్టాలుపడి స్వాతంత్ర్యం సంపాదించుకున్నది ఇందుకేనా? గ్రామ రాజ్యం రావాలనీ, క్షేమ రాజ్యం కావాలనీ కలలు గన్నాం. చివరికి ఈ అవినీతి, అక్రమాలు, హత్యలు, అత్యాచారాలు చూస్తుంటే ఇందుకేనా మనం పోరాడింది? అని బాధ కలుగుతున్నదండి. బాలగంగాధరతిలక్, బాపూజీలాంటి నాయకులు కలలుగన్న క్షేమరాజ్యం మనం చూస్తామా! అనిపిస్తోందండీ" అన్నారు రాజ్యలక్ష్మీదేవిగారు.

"మీరన్నది నిజమే! స్వాతంత్ర్య సమర యోధులుగా మీకా బాధకలగటం సహజమే. కాని మనం నిరాశపడకూడదు. మంచి రోజులు వస్తాయి. ప్రజలు ఇంకా చైతన్యవంతులు కావాలి. ముందు ముందు మార్పు వస్తుంది. ఎం.ఎల్.ఎలు తమ బాధ్యత గుర్తించేలాగా ప్రజలు నిలవేసి నిగ్గదీసేరోజు వస్తుంది" అన్నారు ముఖ్యమంత్రి.

"తన అక్రమ సంపాదన ఆగిపోయిందన్న కసితో బాలాజీ మీకు వ్యతిరేకంగా ఓ గ్రూపును శాసనసభలో తయారుచేస్తాడేమోనండీ" అన్నాడు బ్రహ్మానాయుడు.

"అది అతనికి సాధ్యంకాదులెండి. కృష్ణా జిల్లా పార్టీలోనే అతనికి కొంత బలంవుంది. ఆ బలంతోనే రెండోసారి కూడా పార్టీ టిక్కెట్టు సంపాదించి ఎం.ఎల్.ఏ అయ్యాడు. మంత్రి పదవికోసం ప్రయత్నించాడు. అవకాశం దొరకలేదు. ఇంతకు ముందు ఇరవై ఎకరాల రైతు. ఇప్పుడు వంద ఎకరాల ధనికరైతు అయ్యాడు. నైతిక విలువలు పోగొట్టుకున్నాడు. నన్ను అతడేమీ కదిలించలేడు. ఎవరి బెదిరింపులకూ నేను బెదరను.

"నేనూ మీలాగే రైతు కుటుంబంలో పుట్టినవాణ్ణి. అక్రమంగా అడ్డదారుల్లో సంపాదించేవాళ్లంటే నాకు అసహ్యం. ఎంత సంపాదించినా కట్టుకుపోతామా? మన తరువాత తరంవాళ్లు వాళ్ల సంపాదనమీద వాళ్లు బతకాలిగాని వాళ్లకోసం మనం అడ్డమైనపనులు చేసి కూడబెట్టి అప్పగించి వాళ్లని చేతగాని దద్దమ్మల్ని చెయ్యాలా? జనంతో ఛీ అనిపించుకోవాలా?

"నారాయణరావుగారిని చూడండి! పెద్ద ఉద్యోగంలో వుండి కూడా కిందజనంలో ఎంత మంచి సంపాయించుకున్నారో. ఎంత గౌరవం పొందారో!

"సంపన్నదేశమైన అమెరికాలో కోటీశ్వరుడి కొడుకైనా ఏదో ఒక ఉద్యోగంలో చేరి సంపాదించుకోవాల్సిందే! ఆదర్శం అంటే అదే!

"పదవి కాపాడుకోవటం కోసం నేనెవరికీ దాసోహం అనను. నేను అరక దున్నేవాణ్ణి. పంటలు పండించినవాణ్ణి. అవసరమైతే మళ్లీ వ్యవసాయంలో దిగుతాను. పదవి కోసం దిగజారను.

"రాష్ట్రంలో మంత్రివర్గం ఏర్పాటయ్యేవరకే పార్టీబలం కావాలి. తరువాత పార్టీకోసం గాక ప్రజలకోసం, రాష్ట్ర సంక్షేమంకోసం మంత్రులు కట్టుబడి పని చేయాలి. అసెంబ్లీలో స్పీకరు ఎలాగో అలాగే మంత్రులు నిష్పాక్షికంగా వుండాలి. అది మంచి పద్ధతి.

"ప్రతిపక్షంవారు చెప్పింది మంచిదనుకుంటే వారు వారి పార్టీ ప్రయోజనం కోసం గాకుండా ప్రజాక్షేమం కోసం చెప్పిందైతే దాన్నీ ఆమోదించాలి. అప్పుడే ఏ పార్టీకైనా విలువ, ప్రజల్లో బలం వుంటుంది. నేను అనుసరించేపద్ధతి అదే. సౌశీల్యం, సదాశయం కలిగిన శాసనసభ్యులు ఏపార్టీవారైనా నేను గౌరవిస్తాను. వారు చెప్పింది ఆలకిస్తాను. ఆమోదయోగ్యమైనదైతే ఆచరిస్తాను. నా విధానంవల్ల పార్టీ బలహీనపడదు. బాలాజీవంటి వాళ్ల వల్లనే పార్టీ బలహీన పడుతుంది. పార్టీని నాశనం చేసేదివాళ్లే.

"అసలు అవినీతి పుట్టుకొచ్చేది అధికార యంత్రాంగం నుంచే. అవినీతిని అరికట్టాల్సింది అధికారయంత్రాంగమే. దాన్ని అరికట్టకపోతే అది అంటురోగంలాగా అంతటా వ్యాపించి ప్రజాజీవితాన్ని దుర్భరం చేస్తుంది. అన్యాయానికి గురి అయిన జనం ఆగ్రహం కట్టలుతెంచుకుంటుంది. అప్పుడే విప్లవాలు పుట్టుకొస్తాయి. అధికార యంత్రాంగం నిజాయితీగా వుంటే అవినీతికి తావు దొరకదు. జనజీవనం సజావుగా సాగుతుంది.

"గతంలో రాజుల పాలనలో యథారాజా తథా ప్రజా అనేవారు. ఇప్పుడు యథా

ప్రభుత్వం తథా ప్రజా అనటం సమంజసం" అన్నారు ముఖ్యమంత్రి.

★ ★ ★

బాలాజీ ఎత్తులు భరత్‌కుమార్ దగ్గర పారలేదు. కాలుగాలిన పిల్లిలాగా హైద్రాబాదు వచ్చి హోం మంత్రి వామనరావును కలిశాడు.

"వామనరావుగారూ! మన కార్యకర్తలు అన్యాయంగా జైళ్లలో మగ్గుతున్నారు. మనం పట్టించుకోకపోతే అక్కడ మన పార్టీ మనుగడకే ప్రమాదం! ఎస్.పి భరత్‌కుమార్ నామాట పెడచెవిన పెడుతున్నాడు. వెంటనే మీరు జోక్యం చేసుకోవాలండీ! లేకపోతే అక్కడ మనపార్టీ ఏం మిగలదు"

"బాలాజీగారూ! ముఖ్యమంత్రిగారి సలహాతోనే భరత్‌కుమార్‌ని కృష్ణాజిల్లాకి వేయించాను. దాన్ని మార్చటానికి ఇక కుదరదు. మీరు ముఖ్యమంత్రిని కలిసి మాట్లాడండి. మీరు చెప్పేదేదో ఆయనకే చెప్పండి"

బాలాజీ పాచిక ఇక్కడా పారలేదు. చివరి ప్రయత్నంగా ముఖ్యమంత్రి నివాసానికి వచ్చాడు. బాలాజీని చూడగానే ముఖ్యమంత్రి,

"రండి బాలాజీగారూ" అని ఆహ్వానించి కూర్చోబెట్టి "ఏదో ముఖ్యమైన పని మీదే వచ్చినట్లున్నారు? ఊరికే రారుగదా మీరు! వచ్చిన పనేమిటో చెప్పండి" అన్నాడు.

బాలాజీ ముఖ్యమంత్రి మాటల్లో ధ్వనించిన వ్యంగ్యాన్ని పట్టించుకోలేదు. ఆ వ్యంగ్యం తనకు అర్థం కానట్లే నటిస్తూ,

"అయ్యా! మీరన్నట్లు ముఖ్యమైన పనిమీదనే వచ్చాను. ఇది మన అధికార పార్టీ ప్రతిష్టకి సంబంధించిన అతి ముఖ్యమైన పని. అందుకే మీ దాకా రావాల్సి వచ్చింది. అది మీతోనే అవుతుంది.

కృష్ణాజిల్లా ఎస్.పి. భరత్‌కుమార్, వీరవరం పోలీసుస్టేషన్ ఇనస్పెక్టర్ భార్గవ, ఇద్దరూ మన అధికార పార్టీకి వ్యతిరేకంగా ప్రత్యర్థివర్గానికి తోడ్పడుతూ మన పార్టీ కార్యకర్తలపై కేసు బనాయించి జైల్లో పెట్టారు. అన్యాయంగా నిర్దోషులపై తప్పుడు కేసు పెట్టారు. దొంగసాక్ష్యాలు చెప్పిస్తున్నారు. వీరవరం ఎస్.ఐ భార్గవ మన పార్టీ కార్యకర్తల్ని ముగ్గుర్ని అక్రమంగా కేసులో ఇరికించాడు. అక్కడ మన ప్రత్యర్థి బ్రహ్మనాయుడు చెప్పుచేతల్లో వుంటున్నాడు. ఎస్.పి కూడా వాళ్లకి వంత పాడుతున్నాడు. ప్రజాప్రతినిధిగా నా మాటకు అణుమాత్రం విలువ ఇవ్వటం లేదు. ఎవరికి చెప్పుకుంటావో చెప్పుకో! అని ఎస్.పి ధిక్కారాన్ని ప్రదర్శిస్తున్నాడు. మీరు కల్పించుకొని ఎస్.పికి, ఎస్.ఐకి బుద్ధి చెప్పి మన పార్టీ కార్యకర్తల్ని విడిపించకపోతే అక్కడ మన పార్టీ మిగలదు. మన పార్టీ అధికారంలో వున్నట్లు కాదు. మన కార్యకర్తలకు ఘోరమైన అన్యాయం జరుగుతుంది"

"ఆహా! బాలాజీగారూ! ఎంత బాగా కథ అల్లారు. ఎంత బాగా నటిస్తున్నారు. పార్టీ ప్రతిష్టకోసం మీరు పడుతున్న పాట్లేమిటో నాకు బాగా తెలుసు. నా చెవులకు తాటాకులు కడదామని వచ్చారా? ఈ యుగంధర్ పిచ్చిపుల్లయ్యకాదు.

అక్రమ కాపుసారా వ్యాపారులకీ అపర కీచకులకీ అవినీతి అధికారులకీ అండగా నిలవటం పార్టీ శ్రేయస్సుకేనా? మీ స్వంత లాభం కోసం నిజాయితీపరులైన అధికారుల విధి నిర్వహణకు అడ్డుతగలటం పార్టీ ప్రతిష్ట పెంచటానికేనా?

పచ్చిగూండాల్ని నేరం చేస్తున్న చోటే పట్టివేస్తే, అరెస్టు చేస్తే అధికార పార్టీ కార్యకర్తల్ని అరెస్టు చేశారని నాతో అబద్ధాలు చెబుతున్నారా? అటువంటి గూండాలు పార్టీ కార్యకర్తలైతే ఆ పార్టీకి పుట్టగతులుండవు. మీరే పార్టీని, ప్రభుత్వాన్ని కూడా అప్రతిష్టపాలు చేస్తున్నారు"

"ముఖ్యమంత్రిగారూ! మీరు నన్ను మరీ తీసివేసి మాట్లాడుతున్నారు. నేనంటే గిట్టని

వాళ్లు చెప్పే మాటలు మీరు నమ్ముతున్నారు. ఇది చాలా అన్యాయం! నా గురించి కృష్ణాజిల్లా పార్టీ వాళ్లని అడగండి"

"జిల్లా పార్టీలో ఎక్కువమంది మీ శిష్యగణమేనని నాకు తెలుసు. అది మీ జేబు సంస్థలాగా తయారయింది. దాన్ని పునర్నిర్మాణం చేయాల్సివుంది. మీ సంగతి నాకు అంతా తెలుసు. ఎవరో చెప్పిన మాటలు నేను నమ్మను. మీరు చేసిన నిర్వాకం చాలు! ఇంకేం చెప్పొద్దు"

బాలాజీ తెల్లమొహం వేసి బయటికి వచ్చాడు.

★ ★ ★

అక్రమ కార్యకలాపాలన్నీ వీరవరంలో ఒక్కసారిగా ఆగిపోయాయి.

విజయదశమి పండుగ సభలో భార్గవ హెచ్చరిక వీరవరం నలుమూలలకి పాకింది. గూండాలను పడగొట్టి బంధించిన ఘటనతో భార్గవ అంటే గుండెదడ పుట్టి ఎక్కడి దొంగలక్కడే గప్‌చిప్ అయ్యారు.

"మబ్బుకింద పుట్టినోడు మా అమ్మకాలు ఆపలేడు" అన్న కాపుసారా కొట్టువాడు. ఆనవాలు లేకుండా దుకాణం ఎత్తివేసుకున్నాడు.

అమాయకుల జేబులు ఖాళీ చేసే జూద గృహాలు అదృశ్యమయ్యాయి.

అలంకారాల ఆకర్షణలతో అందాలు చిందిస్తూ సాయం సంధ్యా సమయంలో సరసులకోసం ఎదురుచూసే తరుణ వారకామినులు తలుపులు మూసుకున్నారు.

"అమ్మమ్మా! బాగున్నావా?" అంటూ విజయసారథి, భార్గవ సత్యవాణి ఇంటి ముందుకు వచ్చి పలకరించారు. భార్గవ యూనిఫాంతో వున్నాడు.

"రండి బాబులూ! మీ ఇద్దరినీ సభ దగ్గర చూసి గుర్తుబట్టాను. పలకరిద్దామనుకున్నాను. మీ పేరు భార్గవగారు, ఆయన పేరు విజయసారథిగారు అని సభలో తెలుసుకున్నాను. మీ ఇద్దరూ ఆఫీసర్లు అని తెలిసి ఆశ్చర్యపోయాను. ఆనందంతో పొంగిపోయాను"

"అమ్మమ్మా! మా ఇద్దరికీ గారు అని తోకలు తగిలించవద్దు. పెద్దదానివి. బాబూ అని పిలువు! అది చాలు. మమ్మల్ని గారూ అన్నావంటే నువ్వు మాకు అమ్మమ్మవి కాలేవు. మేము నీకు మనవళ్లుగా వుండలేము. అప్పుడు నువ్వు సత్యవాణిగారు అవుతావు" అన్నాడు భార్గవ.

"అమ్మమ్మా! మమ్మల్ని నువ్వు మనవళ్లుగానే వుండనివ్వు. ఎప్పటిలాగా బాబూ అని పిలిస్తే బాగుంటుంది. లేదా విజయసారథీ, భార్గవా అని పేర్లతో పిలువు. మాకు సత్యవాణిగారు కాదు. అమ్మమ్మే కావాలి. నీ ఆశీస్సులు మాకు కావాలి" అన్నాడు విజయసారథి.

"అయ్యా! నాకూ మీరు మనవళ్లుగానే వుండాలనే వుందయ్యా! కాని మీరు ఆఫీసర్లుగదా అని సందేహించాను. ఈ పూట నా చేత్తో మీకు టీ పెట్టియిస్తాను. మీరు కాదంటే నేనొప్పుకోను" అని వెంటనే గ్యాస్ స్టవ్ వెలిగించింది. ఇద్దరికీ చెరి రెండు అరటిపళ్లు తెచ్చి చేతుల్లో పెట్టింది. ఇద్దరూ చిరునవ్వుతో సోఫాలో కూర్చొని తిన్నారు.

"అయ్యా! మీరీ వూరు రావటాన వూరుకెంత మేలు జరిగిందో! సారా అమ్మేవాళ్లు, తాగేవాళ్లు, పేకాటరాయుళ్లు అందరూ అన్నీ మానేసరికి వ్యవసాయ కూలీల ఇండ్లలో ఆకలితో పస్తులుండే అవస్థ తప్పింది. ఆ ఇళ్లల్లో ఆడవాళ్లు చల్లనివేళ నీకు చేతులెత్తి మొక్కుతున్నారు భార్గవ బాబూ! మీ ఇద్దరూ చల్లగా నూరేండ్లు వర్థిల్లండి బాబూ! మీరు రత్నాలలాంటివాళ్లు"

"అమ్మమ్మా! ఒంటరిగా వుంటున్నావేం? మీ వాళ్లెవరూ లేరా?"

"నాకు ఒక కూతురువుంది విజయసారథి బాబూ! ఎం.ఏ చదివింది. పెళ్లి చేశాం. అల్లుడికి అమెరికాలో ఉద్యోగం వచ్చింది. అతను ఇంజనీరు. వెళ్లిపోయారు. నా జీవి

త భాగస్వామి గుండె జబ్బుతో అయిదేళ్ల క్రితం పోయారు. ఇది నా పుట్టిన వూరు కావటాన ఇక్కడ స్థిరపడ్డాను. పెన్షను వస్తుంది. అది నాకు చాలు. కావాలంటే అల్లుడు పంపుతాడు. ఇంకా నాకెందుకు? తిరగగలిగినన్నాళ్లు ఇక్కడే వుంటా! చివరలో కూతురు, అల్లుడు చూసుకుంటారు"

ఇంతలోనే టీ తయారైంది. కప్పుల్లో పోసి అందించింది.

"అమ్మమ్మా! మళ్లీ కలుస్తాం" అని చెప్పి ఇద్దరూ బయటికి వచ్చారు.

★ ★ ★

ఆరోజు విజయసారథి ఉదయం ఆలస్యంగా నిద్రలేచాడు.

"ఏం బాబూ! ఈ రోజు ఆదివారమనా! ఆలీసెంగా నిద్రలేసినావ్? పెద్దాయన, అమ్మ శాంతమ్మకి జ్వరం వచ్చిందని చూడటానికి బొయ్యారు. బాత్‌రూంలో ఏడి నీలు బెడతా! టవల్ తెచ్చుకోండి" అంది పనిమనిషి రాజమ్మ.

విజయసారథి స్నానం చేసి పాంటు, షర్టు వేసుకుని హాల్లో గోడకు వున్న నిలువుటద్దం ముందు నిలబడి తల దువ్వుకుంటున్నాడు.

పనిమనిషి రాజమ్మ వంట ఇల్లు శుభ్రం చేస్తూ ఉంది.

అద్దం ముందు నిలిచివున్న విజయసారథికి వెనుక నుండి హాల్లోకి వస్తున్న అనూరాధ ప్రతిబింబం కనబడింది.

అద్దంలో కనబడిన అనూరాధని చూసి విజయసారథి వెనక్కి తిరిగాడు.

చిరునవ్వుతో చేతులు జోడించి నిలిచి వుంది అనూరాధ.

ఇద్దరూ హాల్లో కుర్చీల్లో కూర్చున్నారు.

"విజయసారథిగారూ! ఇంతవరకు మీకు క్షమాపణ చెప్పేందుకు అవకాశం చిక్కలేదు. ఈ రోజు మీకు సెలవుగదా అని ఉదయమే ఇలా వచ్చాను.



నా కారణంగానే మీ మీద దాడి జరిగింది. అందుకు మమ్మల్ని క్షమించండి"

"అదేంటి అనూరాధా! నువ్వెందుకు క్షమాపణ చెప్పాలి? నువ్వేం చేశావ్! పైగా కలిసిపోబోతున్న మీ కుటుంబాల్లో కల్లోలం రావటానికి కారణం నేనే అయ్యాను. అతిధిగా మీ తాతయ్యగారింట్లో వుండేసరికి కమలాంబగారికి అనుమానం పెరిగింది. తన కొడుకుతో జరగాల్సిన నీ పెళ్లికి నేను పోటీగా వున్నానేమోనని కమలాంబ దాడి చేయించిందట. నాగరాణిగారు నాతో చెప్పారు. నేను మీ తాతయ్యగారింట్లో వుండకుండా వేరే వుంటే ఇదంతా జరిగేది కాదు. చివరికి మీ సంబంధాలకు నేను అడ్డుపడినట్లయింది. అందుకు నేనే మీకు క్షమాపణ చెప్పాలి. తమ్ముణ్ణి జైలుకు పంపినందుకు మీ పిన్ని, మీ అమ్మ ఎంత బాధ పడుతున్నారో గదా!"

"మీ మూలంగా మా కుటుంబాల్లో కల్లోలాలేం లేవు. ఇక ముందు రావు. మా పిన్ని, మా అమ్మ తమ్ముణ్ణి గురించి బాధ పడటంలేదు. తగిన శాస్తి జరిగిందనుకుంటున్నారు. మీమీద దాడి జరిగిందనే ఆ ఇద్దరూ బాధపడుతున్నారు

"మా సంబంధాలకు మీరు అడ్డుపడటమేంటి? మాకు సంబంధాలు కుదిరివున్నాయని మీరనుకున్నారా? నేను భూపాలరావు కాబోయే భార్యననుకున్నారా?"

"అవును, అలాంటి నిర్ణయం జరిగి వుంటుందనే నేననుకున్నాను. హైద్రాబాదు నుండి నువ్వు వస్తుంటే అతను అరుణాలయం రైల్వే స్టేషనుకు ఎదురు వచ్చాడు గదా! అప్పుడు నేను అనుకున్నాను నువ్వు భూపాలరావుకు కాబోయే భార్యవని. అలా అనుకునే అవకాశం వుంది"

"అదేంలేదు. అంతులేని దురాశతో వాళ్లే అన్యాయంగా మీమీద దాడిచేశారు. అభాసుపాలయ్యారు, ఫలితం అనుభవిస్తున్నారు. ఆ కమలాంబ మిమ్మల్ని సూటిపోటి మాటలంటున్నప్పుడే ఆమెకు గట్టిగా మేమే బుద్ధి

చెప్పాల్సింది. మేము ఉపేక్షించటం తప్పయింది. అందుకే మీకు క్షమాపణ చెప్పాను. నేను భూపాలరావుకోసం పుట్టలేదు"

"అలాగా! అయితే అంతగా వాళ్లని ఆశకి గురిచేసిన ఈ అందాలబాల ఎవరికోసం పుట్టినట్లు? ఆ అదృష్టవంతుడెవరో తెలుసుకోవచ్చా? "

"మీకు చూడాలని వుందా? కావాలంటే చూపెడతాను"

"ఓహో ఫొటో దగ్గరేవుందన్న మాట! ఇస్తే చూస్తాను"

"అయితే కుర్చీలో నుంచి లేవండి ఫొటో చూపెడతాను"

"చేతికిస్తే చూస్తాగా! దానికోసం కుర్చీలో నుంచి లేవటమెందుకు? "

"కుర్చీలో నుంచి లేవాల్సిందే! అదేమన్నా మామూలు ఫొటోనా? "

"అబ్బా! అంత విశేషం వుందా? అయితే తప్పకుండా చూడాల్సిందే. ఈ విజయసారథి ఈ రోజు ఒక అసాధారణ సుందర మూర్తిని చూస్తాడు" అని కుర్చీలో నుంచి లేచి "ఇక చూపెట్టు" అన్నాడు.

"ఇటురండి! ఇక్కడ నిలబడండి" అని గోడకి వున్న నిలువుటద్దానికి ఎదురుగా నిలబెట్టి "ఎదురుగా వున్నారు చూడండి" అంటూ

విజయసారథి వైపు చిలిపిగా చూస్తూ "ఎలా వుంది ఫొటో? " అంది.

ముందు కొంత ఆశ్చర్యం, ఆపైన అనిర్వచనీయమైన ఆనందం!

విజయసారథి చేయి అనూరాధ చేతిని అందుకుంది. ఆ పాణిగ్రహణ బంధమే విజయసారథి, అనూరాధల అనురాగబంధం.

వంటగది శుభ్రంచేసి రాజమ్మ బయటికి రావటం చూసి, ఇద్దరూ కుర్చీల్లో కూర్చున్నారు.

"మీరిద్దరూ సెయ్యి, సెయ్యి బట్టుకోనుంటే సూసిన. సిలకగోరింకలల్లె వుండారు" అంది రాజమ్మ చిరునవ్వుతో.

"చూడనే చూశావా రాజమ్మా నువ్వు చూసినా పరవాలేదుగాని ఇప్పుడే ఎవరితోను అనకు. మేం పెండ్లి జేసుకుందామని అనుకున్నాం. అమ్మమ్మకి, తాతయ్యకి నేను చెబుతాలే" అన్నాడు విజయసారథి.

"రాజమ్మా! నేనూ మా అమ్మకి, నాన్నకి చెబుతాను. మేము పెండ్లి జేసుకుందామని చెయ్యి చెయ్యి బట్టుకుని ప్రమాణం చేసుకున్నాం. అంతే. ఇది పెద్ద రహస్యమేమీ కాదుగాని మేం పెద్దవాళ్లకి చెప్పేదాకా నువ్వు ఎవరికీ చెప్పొద్దు"

"అట్టాగే అనూరాధమ్మా! ఈ రాజమ్మ గుట్టుగల మడిసేనని నీకు తెలుసుగదమ్మా. అయినా మీరు పెళ్లి చేసుకోవాలనుకోవటంలో తప్పేంటమ్మా. సక్కదనాల జంట. మీరిద్దరూ సెయ్యి సెయ్యి బట్టుకోనుంటే నాకు కళ్లపండగయింది" అంది నవ్వుతూ. తిరిగి రాజమ్మ పనిలో మునిగిపోయింది.

"అనుకోకుండా చేతికి అందినదాన్నే అదృష్టం అంటారు అనూరాధా. హైదరాబాదు నుండి నేను బయలుదేరేటప్పుడు ఒక అందాలబాల చేతికి అందుతుందని అనుకోలేదు. అదృష్టం అంటే ఇదే" అన్నాడు.

"ఇష్టమైనది చేతికి అందటమే అదృష్టం. విజయసారథి అనే సుందరుడు వీరవరం వస్తాడనీ, నా చేయి అందుకుంటాడనీ, నేనూ అనుకోలేదు. మొదటిసారి చూడగానే మీరు నాకు నచ్చారు. అదృష్టం అంటే ఇదే"

'అదృష్టం అంటే ఇదే' అన్న అనూరాధ చివరిమాట అప్పుడే లోపలికి వస్తూ వైదేహి విన్నది. "ఏమిటి? అదృష్టం గురించిన చర్చ? " అంది.

"నాయనమ్మా! ఇష్టమైనది చేతికి అందటమే అదృష్టం అని నేనన్నాను. అంతేనా? "

"అమ్మమ్మా! అనుకోకుండా చేతికి అందిందే అదృష్టం అని నేనన్నాను.

ఇందులో ఏది సరైంది?" అన్నాడు విజయ సారథి.

"విజయసారథి అన్నదే అదృష్టం అన్నదా నికి సరైన మాట. అనూరాధ అన్నమాట కూడా వాడుకలో వుంది. సందర్భాన్ని బట్టి వాడొచ్చు"

"అనూరాధా! అమ్మమ్మ ముందుగా నన్నే బలపర్చారు"

"నాయనమ్మా అమ్మా మీ పార్టీలో చేరా రని నేను ఎప్పుడో చెప్పాను"

"అమ్మమ్మా మీకు నేను ఒక విషయం చెప్పాలనుకుంటున్నాను"

"చెప్పు బాబూ! ఏమిటది?"

"ఇప్పటివరకూ అతిథిగా మీ ఇంట్లో వున్నా గదా! ఇక వేరే ఇల్లు అద్దెకు తీసుకొనివుం టాను. నాకు వంట చేసుకోవటం వచ్చు"

"ఏమిటీ! వేరే ఇల్లు తీసుకుంటావా? వంట చేసుకుంటావా? నువ్వు ఒంటరిగా వుంటానికి వీల్లేదు. అంత దుర్ఘటన జరిగాక నువ్వు ఒంటరిగా వుంటానంటే మేం ఒప్పు కుంటామా!"

అంతలో రాఘవేంద్రగారు వస్తూ చివరి మాట విన్నారు.

"ఒంటరిగా వుండేదెవరు వైదేహీ" అన్నారు.

"మన విజయసారథి బాబు వేరే ఇల్లు తీసుకొని వుంటాడట. వంట చేసుకుంటా డట. ఇప్పటిదాకా మీ ఇంట్లో వున్నాగదా అంటున్నాడు"

"విజయసారథిబాబూ! మాది లంకంత ఇల్లు. ఈ ఇంట్లో వుండేది అమ్మమ్మ, నేను ఇద్దరమే. నీకు అన్నం పెట్టలేని పేదవాళ్ళం కాదని మొదటనే చెప్పాను. వారంరోజుల నుండి నువ్వు మా ఇంట్లో వుంటే మాకెంతో ఆహ్లాదంగా వుంది. నువ్వు ఇక్కడే మాకు తోడుగా వుండాలి. ఇంకేం మాట్లాడొద్దు"

విజయసారథి ఇంకేం మాట్లాడలేదు.

ఎక్కడికి వెళ్తావు చిన్నవాడా! అన్నట్లు విజయసారథివైపు ఒక వాలుచూపు విసిరి చిరునవ్వుతో అనూరాధ వెళ్ళిపోయింది.



భారతీదేవి తల్లిదండ్రులు అనసూయ, వాసుదేవరావు, వారితోపాటు వివేకానంద, సుజాత దంపతులు వీరవరం వచ్చారు.

ముందుగా వారు పంపిన టెలిగ్రాం చూసి బ్రహ్మానాయుడు అరుణాలయం రైల్వేస్టేషనుకి బండి పంపాడు. సదానందం రైల్వేస్టేషనుకి బండి తోలుకొని వెళ్ళి వారిని తీసుకువచ్చాడు. దారిలో సదానందం వారికి వీరవరంలో జరిగిన సంఘటనలన్నీ వివ రంగా చెప్పాడు.

తన తమ్ముడి కొడుకు భూపాలరావు చేసిన నీచమైన పనికి వాసుదేవరావు చాలా బాధపడ్డాడు. "మా వంశానికి వీడు మచ్చ తెచ్చాడు" అన్నాడు.

వివేకానంద సుజాత దంపతులకు ఒక కొడుకు, ఒక కూతురు వున్నారు.

కూతురు పెద్దది. పేరు రేణుక. కొడుకు పేరు విజయానంద. ఇద్దరూ అందంగా వుంటారు. కూతురు ఎలక్ట్రానిక్స్ ఇంజనీరిం గులో డిగ్రీ పాసయింది. హైదరాబాదులో కేంద్రప్రభుత్వ సంస్థ డి.ఎల్.ఆర్.ఎల్.లో ఉద్యోగం చేస్తోంది.

వివేకానంద తన మిత్రుడు దయాసాగర్

కొడుకు నాగార్జునతో కలిసి తన కొడుకు విజయానందని చదువుకోసం అమెరికా పంపాడు.

దయాసాగర్‌కి ఒక్కడే కొడుకు. నాగార్జున చురుకైనవాడు. అందగాడు. బుద్ధిమంతుడు. ఆగర్భశ్రీమంతుడైన దయాసాగర్ తన కొడుకు నాగార్జునతో పాటు తోడుగా తన మిత్రుడి కొడుకు విజయానందని తన ఖర్చుతో అమెరికా పంపాడు. ఇద్దరిదీ ఒకటే వయసు, ఒకటే క్లాసు.

నాగార్జున, విజయానంద, అమెరికాలో చదువులు పూర్తిచేసుకొని అమెరికాలోనే ఉద్యోగాల్లో చేరారు.

అనూరాధ విజయానంద కూతురు రేణుక కంటే ఒక సంవత్సరం చిన్న, విజయానందకంటే రెండేళ్లు పెద్దది.

చిన్నప్పుడు విజయానంద ఎక్కువగా వీరవరం వస్తూపోతూ వుండేవాడు. వరసకి వదినె అయినా అనూరాధని అక్కా అని పిలుస్తాడు. అనూరాధతో తమ్ముడిలాగే బాగా చనువుగా వుండేవాడు.

దయాసాగర్ కొడుకు నాగార్జున కూడా అప్పుడప్పుడు విజయానందతో కలిసి వీరవరం వస్తూవుండేవాడు. అతడు 'కూడా విజయానందలాగే అనూరాధని అక్కా అని పిలుస్తూ చనువుగా వుండేవాడు.

అనూరాధ హైదరాబాదులో చదువుతున్నపుడు అమెరికానుండి నాగార్జున, విజయానంద ఫోనుచేసి మాట్లాడుతూ వుండేవాళ్లు.

అమెరికాలోని కాలిఫోర్నియా రాష్ట్రంలో శాన్‌జోస్ అనే సిటీలో ఒక ఫ్లాట్ అద్దెకు తీసుకుని నాగార్జున, విజయానంద ఇద్దరూ వుంటున్నారు.

వివేకానందకి హైదరాబాదులోని దిల్‌సుక్‌నగర్‌లో స్వంత ఇల్లుంది. హైదరాబాదులో ఉద్యోగం చేస్తున్న రేణుకని ఆ ఇంట్లోవుంచి, వివేకానంద తన తల్లిని రేణుకకి తోడుగా వుంచాడు. అప్పుడప్పుడు వివేకానంద, సుజాత కూడా హైదరాబాదులో కూతురు రేణుక దగ్గరుంటారు.

మగ తోబుట్టువులు లేని భారతీదేవి వివేకానందనే స్వంత అన్నలాగా చూసుకుంటుంది. పైగా బ్రహ్మానాయుడికి వివేకానంద పరమ మిత్రుడుగదా

బ్రహ్మానాయుడి ఇంట్లో హాల్లో కూర్చుని అందరూ పెండ్లి సంబంధాల చర్చ ప్రారంభించారు. ఆ సమయంలో అనూరాధ ఇంట్లో లేదు. లైబ్రరీకి వెళ్లింది.

వివేకానంద రేణుకకి పెండ్లి సంబంధాల గురించి బ్రహ్మానాయుడితో మాట్లాడాలని వీరవరం వచ్చాడు.

"బ్రహ్మానాయుడూ! నువ్వు అనూరాధకి పెండ్లి సంబంధాలు చూస్తున్నావా? నీ దృష్టిలో ఏదైనా సంబంధం వుందా?"

"ఇప్పటిదాకా నేను అనూరాధ పెండ్లిగురించి ఆలోచించలేదురా. ఎక్కడా నా దృష్టికి అనుకూలమైన సంబంధం కనపడలేదు. కానీ ఏడురోజుల క్రితమే పరిచయమైన ఈ విజయసారథి సికింద్రాబాదు స్టేషన్‌లో చూడగానే కంట్లోబడ్డాడురా. మనిషి రూపంతోపాటు మాటలు, చేతలు, విద్య, వివేకం, వినయం అన్నీ బాగున్నాయి. అనూరాధకి తగిన వరుడు అనిపించింది. అనూరాధ అభిప్రాయం తెలుసుకోవాలి. భారతీ! నువ్వేమంటావు? విజయసారథి అంగీకరిస్తే మన అనూరాధకి తగిన వరుడే గదా."

ఈ మాట వినగానే భారతీదేవి ముఖం వికసించింది.

"నా మనసులో అదే వుందండీ. నేనే మీతో ఈ విషయం అనాలనుకుంటున్నాను. మీకే ఆ ఆలోచన వచ్చింది. సమయానికి అమ్మ, నాన్న, అన్నయ్య, వదిన కూడా వున్నారు. అనూరాధ ఆనందంగా ఒప్పుకుంటుంది. విజయసారథితో అది మాట్లాడే తీరునిబట్టి దాని భావం తెలుస్తూనే వుంది"

"అయితే అనూరాధ పెండ్లి దాదాపు కుదిరినట్లేరా. అతడంగీకరిస్తాడనే నమ్మకం నాకుంది. ఇక మన రేణుకకి కూడా సంబంధం చూడాలిరా" అన్నాడు వివేకానంద.

"వివేకానందా! మన రేణుకకి ఒక సంబంధం నా మనసులో వుందిరా అది మనకి తగిన సంబంధమేననుకుంటున్నాను. చెప్పమంటావా? "

"చెప్పమంటావా అంటావేంటిరా, మనలో మనకి సందేహాలా? చెప్పు"

"ఇన్‌స్పెక్టర్ భార్గవ రేణుకకి తగిన వరుడు అని నేననుకుంటున్నాను. అతడు చాలా బుద్ధిమంతుడు. అందగాడు. మన రైతు కుటుంబంలో పుట్టినవాడు. నీతి, నిజాయితీ, సంస్కారం వున్నవాడు. మనలో కలిసిపోతాడు. మీరూ చూడండి. మీకు నచ్చితే భార్గవతో నేను మాట్లాడతాను. నాతో చనువుగానే వుంటాడు. నన్ను బాబాయిగారూ! అని సంబోధిస్తాడు"

"బ్రహ్మానాయుడూ! నీకు మంచి ఆలోచనే వచ్చిందిరా భార్గవని గురించి, విజయసారథిని గురించి, రైల్వేస్టేషన్ నుంచి వచ్చేటప్పుడు సదానందం మాకు విపులంగా చెప్పాడు. వీరవరం ప్రజలు ఇద్దరినీ వేనోళ్ల కొనియాడుతున్నారట"

"సుజాతా! నీ అభిప్రాయం చెప్పు" వివేకానంద భార్యని అడిగాడు.

"అన్నయ్య చెప్పింది నాకూ నచ్చిందండీ. మీకిష్టమైతే నాకూ ఇష్టమే"

"బ్రహ్మానాయుడూ! భార్గవది దుగ్గిరాల అని సదానందం చెప్పాడు. ఆ ఊరివాళ్లు కొందరు నాకు తెలుసు. భార్గవతో మాట్లాడితే వివరాలు తెలుస్తాయి. ఒకసారి పరిచయం చేసుకుని మాట్లాడదాం"

ఇంతలో అనూరాధ, ఉషాబాల ఇద్దరూ లైబ్రరీనుండి వచ్చారు. ఉషాబాల బ్రహ్మానాయుడి ఇంటికి రావటం అదే ప్రథమం. భారతీదేవి బ్రహ్మానాయుడు ఇద్దరూ సంభ్రమంతో సాదరంగా 'ఉషాబాలా! రామ్మా' అని ఆహ్వానించారు. బ్రహ్మానాయుడు సోఫాలోనుంచి లేచి, 'ఇటురామ్మా' అని తన పక్కన కూర్చోబెట్టుకున్నాడు.

"వివేకానందా! మా నాగరాణి కూతురు" అని పరిచయం చేశాడు.

ఉషాబాల సోఫాలోనుంచి లేచి చేతులు జోడించి వివేకానందకి అక్కడున్న బంధువులందరికి సవినయంగా నమస్కారాలు చేసింది.

"ఇంటి దగ్గరనుంచి వస్తున్నావా అమ్మా? " భారతీదేవి అడిగింది.

"కాదు పెద్దమ్మా. లైబ్రరీలో అక్క కలిసింది. అమ్మమ్మ, తాతయ్య వచ్చారని చెప్పింది. అత్తయ్య, మామయ్య కూడా వచ్చారని చెప్పింది. చూడాలని అక్కతో కలిసి వచ్చాను"

"మా ఇంటికి రావటానికి మీ అమ్మ అనుమతి ఇచ్చిందా ఉషాబాలా? " బ్రహ్మానాయుడు అడిగాడు.

"మీ ఇంటికి వస్తానని మా అమ్మతో ఇదివరకే చెప్పాను పెదనాన్నా. వద్దనలేదు. పొమ్మనలేదు. మౌనం అంగీకారంగా భావించి వచ్చాను"

"గండిపడిన మన బంధుత్వాన్ని మళ్లీ కలుపుతున్నావు తల్లీ. చాలా సంతోషంగా వుంది" అన్నాడు బ్రహ్మానాయుడు.

"చిన్నతనమైనా ఉన్నతమైన నిర్ణయం తీసుకున్నావు ఉషాబాలా అందుకు నిన్ను అభినందిస్తున్నాను" అన్నాడు వివేకానంద.

"విజయసారథి, భార్గవ అనే అబ్బాయిల్ని ఇద్దరినీ ఒకసారి చూడాలని వుంది" అని భారతీదేవి తల్లి అనసూయ, తండ్రి వాసుదేవరావు అన్నారు.

"అమ్మమ్మా! ఆ ఇద్దరి వీరత్వం విన్నాక మీ ఇద్దరికి ఆ వీరులిద్దరినీ చూడాలనిపించిందా? " అన్నది అనూరాధ నవ్వుతూ.

అంతకుముందు పెండ్లి సంబంధాల చర్చ జరిగిన సంగతి, అమ్మమ్మ, తాతయ్య

చూడాలనుకున్నది అందుకేనన్న సంగతి అనూరాధకి తెలియదు. అప్పుడు లైబ్రరీలో వుంది.

"సదానందం పొలంనుండి రాగానే వాణ్ణి పంపి వాళ్లిద్దరినీ పిలిపిస్తాను. నేను రమ్మంటే తప్పకుండా వస్తారు. ఆ ఇద్దరూ మేమంటే ఎంతో గౌరవంగా వుంటారు" అన్నాడు బ్రహ్మానాయుడు.

అలా సంభాషణ సాగుతూ వుండగానే విజయసారథి, భార్గవ చేయి చేయి పట్టుకుని చిరునవ్వుతో వీధిలోనుండి బ్రహ్మానాయుడి ఆవరణలోకి ప్రవేశించారు.

"నాన్నా! భార్గవన్నయ్య, విజయసారథిగారు వస్తున్నారు. ఆ ఇద్దరిని ముందుగా అనూరాధ చూసి తండ్రికి చెప్పింది.

"ఆహా, వెదకబోయిన తీగలాగా ఇద్దరూ మాటల్లోనే వచ్చారు"అంటూ బ్రహ్మానాయుడు ఎదురువెళ్లి "రండి. ఇప్పుడే మీ ఇద్దరిని గురించి అనుకుంటున్నాం. మాటల్లోనే వచ్చారు. లోపలికి రండి" అని ఆహ్వానించాడు.

అందరూ సంభ్రమంతో లోపలినుంచి ఆవరణలోకి ఎదురు వచ్చారు.

"బాబాయిగారూ! అమ్మమ్మ, తాతయ్య, అత్తయ్య, మామయ్య వచ్చారని అనూరాధ మాకు గ్రంధాలయంలో కనపడి చెప్పింది. విజయసారథిగారు చూసివద్దాం అన్నారు. ఇద్దరం ఇటు వచ్చాం" అన్నాడు భార్గవ.

బ్రహ్మానాయుడు ఆ ఇద్దరినీ బంధువులందరికీ పరిచయం చేశాడు. ఇద్దరూ వారందరికీ సవినయంగా నమస్కారాలు చేశారు.

భార్గవ, విజయసారథి సోఫాలో పక్కపక్కనే కూర్చున్నారు. బంధువులందరూ యువకులిద్దరూ బాగున్నారని లోలోన మెచ్చుకున్నారు.

"బాబూ, భార్గవా! నీది దుగ్గిరాల అని తెలిసింది. మాకు ఆ ఊళ్లో దూరపు బంధువులున్నారు. మీ నాన్నగారి పేరేమిటి? " అన్నాడు వివేకానంద.

"మా నాన్నగారి పేరు నిమ్మగడ్డ రామచంద్రమూర్తి"

"ఓహో! ఆయనా! మనిషితో పరిచయం లేదుగానీ పేరు విన్నాను. మీ అమ్మగారి పేరు సీతాలక్ష్మి. అవునా? "

"అవునండీ... మా అమ్మగారు మీకు తెలుసా? "

"మనుషులు తెలుసు. పరిచయాలు లేవు. దూరపు బంధుత్వం వుంది. మా పూర్వీకులది ఒకప్పుడు దుగ్గిరాలేనట. మా తాతగారు తెనాలి వచ్చి అక్కడే స్థిరపడ్డారట. మీ అమ్మగారి పుట్టింటివారు మాకు వారసులు. ఆ విధంగా దూరపు బంధుత్వం వుంది. మీ నాన్నగారు నాకు బంధురీత్యా పరిచయం లేదు. కానీ దుగ్గిరాలలో జరిగిన ఒక సంఘటన ఆయన్ని అందరూ గుర్తుపెట్టుకునేలా చేసింది.

దుగ్గిరాలలో ఒక దొంగ రోజూ ఏదో ఒక ఇంట్లో దొంగతనం చేస్తూ ఊరందరినీ చికాకు పెడుతున్నాడట. వాడిని పట్టుకోవడం పోలీసులకి, గ్రామస్థులకి సాధ్యం కావడంలేదట. ఎవరికీ దొరక్కుండా ఊరందరికీ వాడొక బెడదగా తయారై నిద్రలేకుండా చేస్తున్నాడట.

మీ నాన్నగారికి అప్పుడు 15-16 సంవత్సరాల వయసేనట. ఎలా పసిగట్టాడో ఆ దొంగని చాకచక్యంగా వెంటాడి సాహసంతో పట్టివేసి, పోలీసులకి అప్పగించాడట. దుగ్గిరాల ప్రజలందరూ ఆయన్ని మెచ్చుకున్నారట. మీ నాన్నగారి సాహసాన్ని మెచ్చుకొని గుంటూరుజిల్లా ఎస్.పి. ఆయనకి ప్రశంసాపత్రాన్ని అందజేశారట. ఆ విధంగా మీ నాన్నగారు మా అందరికీ గుర్తున్నారు" అన్నాడు వివేకానంద.

"మా నాన్నగారు చేసిన ఆ సాహసమే నేను ఈ ఉద్యోగంలో చేరటానికి స్ఫూర్తిదాయకమైంది.

నేను, నా మిత్రులు రవీంద్ర, విక్రమ్ ముగ్గురం గుంటూరులో ఒకే రూమ్‌లో

వుండి బి.ఎస్.సి. చదివాం. మేం ముగ్గురం ఎస్.ఐ.లుగా ఉద్యోగాల్లో చేరాలనుకున్నాం. నేను, విక్రమ్, ఎస్.ఐ. ఉద్యోగాలకు సెలక్టు అయ్యాం. దురదృష్టవశాత్తూ రవీంద్రకి రాలేదు. తరువాత చిన్న ఉద్యోగమని చూడకుండా కానిస్టేబుల్‌గా చేరాడు.

ఇప్పుడు విక్రమ్ అమరావతి పోలీస్ స్టేషన్‌లో చేస్తున్నాడు. రవీంద్ర మన వీరవరం స్టేషన్‌లోనే చేస్తున్నాడు. అయినా మేం పాతమిత్రులుగానే వున్నాం. నేనిప్పుడు రవీంద్ర ఇంట్లోనే వుంటున్నానండి"

"చాలా సంతోషం బాబూ! ఇంతకు ముందు మనకు పరిచయాలు లేకపోయినా ఇప్పుడు దూరపుబంధువులమని తెలుసుకున్నాం. ఈ విజయసారథి, నువ్వు, వీరవరంలో మంచి ఆఫీసర్లుగా పేరు తెచ్చుకున్నారు. వీరవరం రాగానే విజయదశమికి ముందు ప్రథమ విజయం సాధించారు. ఇక మీ ప్రయాణం విజయపథంలోనే"

"ఇక వస్తాం బాబాయిగారూ" అని భార్గవ లేచాడు. యువకులిద్దరూ అందరి దగ్గరా సెలవు తీసుకుని వెళ్ళిపోయారు.

"బ్రహ్మానాయుడూ! భార్గవ మాకు నచ్చాడు. భావాలు, మాటతీరు బాగున్నాయి. అతడు అంగీకరిస్తే రేణుకని ఇద్దాం" అన్నాడు వివేకానంద.

"మన అనూరాధనీ కూడా సలహా అడగండి" అంది సుజాత.

"అనూరాధా! మా రేణుకని భార్గవకి ఇవ్వాలనుకోవడం విన్నావుగా. నువ్వేమంటావు? ఇస్తే బాగుంటుందా? "

"మంచిగా ఆలోచించారు మామయ్యా. భార్గవన్నయ్య మనిషి అందంగా వుంటాడు. మనసు మంచిది. నిజాయితీగల పోలీసు ఆఫీసరు. రేణుకకి తగిన వరుడు. రేణుకకి నచ్చుతాడు"

"ముందుగా రేణుక చూడకపోయినా ఒప్పుకుంటుందంటావా? "

"ఒప్పుకుంటుందనే అనుకుంటున్నాను. మీరు మంచిగానే చూశారుగదా"

"నీకూ ఒక మంచి సంబంధం చూశాం. నువ్వు ముందుగా చూడకపోయినా, మేం చూసిన సంబంధం ఒప్పుకోవాలి. ఏమంటావ్? "

"ముందుగా చూడకపోయినా రేణుక ఒప్పుకుంటుందన్నానేగానీ రేణుకని అడగొద్దన్నానా. అలా అడగకుండా మాట ఇవ్వడం న్యాయంకాదు. రేణుకని అడగకుండా మాట ఇవ్వకండి మామయ్యా"

"మేం మంచిగా చూశామని నువ్వే అన్నావుగా. ఇంకా అడగడమెందుకు? న్యాయం కాదంటావేం? ఎందుకు న్యాయం కాదు? "

"ఎందుకంటే రేణుకకి ఇంతకుముందే ఎవరైనా నచ్చివుండొచ్చు తన పెళ్ళి విషయంలో ఒక నిర్ణయం తీసుకొని వుండొచ్చు. మీరు మంచిగానే చూసినా రేణుకని అడగకుండా మాట ఇస్తే, అప్పుడు పెద్ద చిక్కే వస్తుంది. మీరలా ముందు చూపు లేకుండా మాట ఇస్తారని నేను అనుకోను"

"అనూరాధా మా ముందరి కాళ్ళకి బంధాలు వేశావు. ముందు నీ సంగతి చెప్పు. నిన్నడగకుండా ఒక మంచి సంబంధం చూశాం. నువ్వు ఒప్పుకుంటావనే అనుకున్నాం. ఒప్పుకుంటావా? నిర్మొహమాటంగా చెప్పు"

"మా అమ్మానాన్నా నన్నడగకుండా అలా చెయ్యరు. నాకు నచ్చిన సంబంధం చేసుకుంటాను. నా మాట అమ్మానాన్నా కాదనరు"

"ఆహా! అమ్మానాన్నల కాళ్ళకి కూడా ముందే బంధాలు వేస్తున్నావే"

"అనూరాధ ఎవరికాళ్ళకైనా ముందే బంధాలు వేస్తుంది వివేకానందా. ఇంతకు ముందే నాకు బంధాలు వేసే వుంచిందిరా" అంటూ మురళీకృష్ణ లోపలికి వచ్చాడు.

"రండి మామయ్యా. సమయానికి వచ్చారు. సభ ఇక రక్తిగా సాగుతుంది.

ఇది పెళ్ళి సంబంధాల సభ. మీరా చర్చల్లో అనుభవజ్ఞులు" అంది అనూరాధ.

"విన్నాను. ఇది పెళ్ళి సంబంధాల సభ అని మీ మాటలద్వారా తెలుసుకున్నాను. వివేకానందని నువ్వు విషయం తేల్చకుండా తిప్పలు పెడుతున్నట్లుంది? " అన్నాడు మురళీకృష్ణ సోఫాలో కూర్చుంటూ.

"అవును మురళీ. రవిగాంచనిచోటు కవిగాంచును అన్నారు గదరా. అనూరాధ మనసులో ఏముందో తెలుసుకో నువ్వు కవివి, పండితుడివిగదా" అన్నాడు వివేకానంద.

"ఇంతకీ విషయమేమిటి? అది నాకు తెలియాలిగదరా"

"అనూరాధకి మేమందరం దాన్ని అడగకుండా ఒక మంచి సంబంధం చూశాం. అదేమో నాకు నచ్చిన సంబంధం చేసుకుంటాను అంటున్నది" అదీ విషయం.

"అయితే అనూరాధ మన కాళ్ళకు బంధం వేసినట్లే ఏ అందగాడి మనసుకో బంధం వేసివుంటుంది. అంతేనా అనూరాధా. నీకు నచ్చిన సంబంధం నువ్వే చూసుకున్నావా"

"ఏం చూసుకుంటే తప్పా మామయ్యా... చూసుకున్నాను"

"తప్పని నేనన్నానా నచ్చిందెవరో మాకు చెప్పాలిగా? "

"నాకు విజయసారధిగారు నచ్చారు. ఆయనకి నేను నచ్చాను. సరేనా? "

"అదీ సంగతి. అసలు విషయం అదిరా మురళీ. నువ్వన్నదే నిజం అయింది బ్రహ్మానాయుడూ. మనం ఏది కావాలనుకున్నామో అదే కుదిరింది. భారతీ నువ్వనుకున్నదే అయింది. అనూరాధ అందరికీ శ్రమ తప్పించింది"

"అనూరాధా... మంచి అబ్బాయిని ఎంచుకున్నావమ్మా. వీరవరం వచ్చి ఒక మంచి వార్త విన్నందుకు ఆనందంగా వుంది" అన్నారు అనసూయ, వాసుదేవ రావు దంపతులు.

అనూరాధ నిర్ణయం ఉషాబాలకి ఆనందం కలిగించింది.

"అన్నయ్యా కొండపల్లినుంచి ఎప్పుడొచ్చారు? " అంది భారతీదేవి.

"ఈరోజు ఉదయం వచ్చానమ్మా. పండగముందే వద్దామనుకుంటే అక్కడ స్కూలు వాళ్ళు రానివ్వలేదు" అన్నాడు మురళీకృష్ణ.

"విజయదశమి పండగకి నువ్విక్కడ వుంటావనుకున్నాం మురళీ. ఈ ఏడు కొత్తగా వచ్చిన ఇన్‌స్పెక్టర్ భార్గవ సభ ప్రత్యేకంగా జరిపాడు"

"అన్నీ విన్నాను బ్రహ్మన్నా. నాటకీయంగా వీరవరంలో జరిగిన ఘటనలు నన్ను ఆశ్చర్యంలో ముంచాయి. ఈ వీరవరం ఇక బాగుపడుతుంది. ఇక్కడి విషయాలన్నీ ఈరోజే విజయసారథిని కలుసుకొని తెలుసుకున్నాను. భార్గవని కూడా నాకు పరిచయం చేశాడు. విజయసారథి మీ ఇంటి అల్లుడు కాబోతున్నందుకు నాకెంతో సంతోషంగా వుంది" అని అక్కడున్న ఉషాబాలని చూసి ఆశ్చర్యంగా మురళీకృష్ణ,

"ఉషాబాలా నువ్విక్కడికెలా వచ్చావు? " అన్నాడు.

"ధైర్యంగా నడిచి వచ్చాను మామయ్యా" అంది ఉషాబాల నవ్వుతూ.

"మా చెల్లెలి మనసు మారుతూ వుందన్న మాట. సంతోషం"

బ్రహ్మానాయుడు, మురళీకృష్ణ, వివేకానంద, ముగ్గురూ కొంతసేపు కుటుంబ విషయాలు మాట్లాడుకున్నారు.

"మురళీ, భార్గవ కూడా మన రేణుకను చేసుకోవడానికి ఒప్పుకుంటే మనకెంతో ఆనందంరా. పరిచయమైన దగ్గరనుండి భార్గవ బాబాయిగారూ అని నన్ను ఆత్మీయంగా పిలుస్తూ సన్నిహితంగా వుంటాడు. ఇప్పుడు వరసలు కూడా సరిగానే కలిశాయి. నామాట మీద భార్గవకి గౌరవం వుంది.

ఒప్పుకుంటాడని నమ్మకం నాకుంది. మొన్న జరిగిన దాడి కేసు ఇంకా విచారణకు రాలేదు. ముద్దాయిలు రిమాండులో వున్నారు. నేను నిదానంగా అతనితో మాట్లాడతాను. ఇప్పుడతను పనివత్తిడిలో వున్నాడు" అన్నాడు బ్రహ్మానాయుడు.

"సరే అన్నయ్యా... అలాగే మాట్లాడండి. మేం కూడా రేణుక అభిప్రాయం తెలుసుకుంటాం. అనూరాధ అన్నదీ నిజమే" అంది సుజాత.

★ ★ ★

వివేకానంద, సుజాత, తెనాలి బయలుదేరారు. అనూరాధ కోరికపై అనసూయ, వాసుదేవరావు, వీరవరంలో కొన్నాళ్ళుండాలని ఆగిపోయారు.

అనూరాధ కూడా హైద్రాబాదు బయలుదేరింది. బ్రహ్మానాయుడు ఎప్పుడూ కూతురుని ఒంటరిగా హైద్రాబాదు పంపడు. తోడుగా వెళ్ళి వుమెన్స్ హాస్టల్లో దించి వస్తాడు. అనూరాధ ఒక్కతే వెళ్ళగలదు. కాని తండ్రి మాత్రం అలా పంపడు.

సదానందం సవారి కట్టి బండిని తయారుచేశాడు.

సుజాత, అనూరాధ, వివేకానంద, బ్రహ్మానాయుడు బండ్లో కూర్చున్నారు. సదానందం బండికి ఎడ్లని కట్టాడు.

"సదానందం! బండ్లో బాణాకర్రలు పెట్టావా?"

"ఆ రెండు కర్రలు పెట్టాను"

"బండ్లో బాణా కర్రలెందుకురా? సదానందం, నువ్వు దారిలో సాము చేస్తారా?" అన్నాడు వివేకానంద నవ్వుతూ.

"కర్రలేనివాణ్ణి గొర్రె కరిచిందని సామెత వుందిగదరా! ఎప్పుడేమి జరుగుతుందో తెలియకుండా వుంది. విజయసారథి మీద దాడి ఊహించకుండానే జరిగింది. కాలం అలా వుంది. అసలు మేము ఎప్పుడైనా బండ్లో బాణాకర్రలు లేకుండా ప్రయాణం చెయ్యం! అది మాకు అలవాటే! అను మానం వున్నపుడు ఆత్మరక్షణ విషయంలో ఎవరూ అశ్రద్ధ చేయకూడదు"

శరవేగంతో బండి అరుణాలయం రైల్వే స్టేషన్‌కి చేరింది.

విజయవాడవైపు వెళ్ళే రైలులో వివేకానంద, సుజాత, వెళ్ళిపోయారు. అనూరాధ, బ్రహ్మానాయుడు హైద్రాబాదు వెళ్ళే రైలులో వెళ్ళిపోయారు. సదానందం బండి వీరవరానికి బయలుదేరింది.

★ ★ ★

పాపారావుని, గోపాల్‌ని సదానందం, అతని మిత్రబృందం అడ్డం తిరిగి పట్టుకొని జైలుపాలు చేశారని పాపారావు గూండాలు పగబట్టారు. ముఖ్యంగా పాపారావుని సదానందం ధనిక రైతు అని కూడా చూడకుండా అడ్డుకొని పట్టివేశాడు. వాడిని వేటాడమని పాపారావు తన అనుచరులకు కబురు చేశాడు. అవకాశం చూసి చంపి ఆనవాలు లేకుండా చేయమన్నాడు.

దుర్గన్న, రంగడు, కాళయ్య, భీముడు అనే నలుగురు గూండాలు పాపారావు ముఖ్య అనుచరులు. పచ్చినెత్తురు తాగే పరమకిరాతకులు.

సదానందం కదలికల్ని గమనించడానికి వాళ్ళు ఒక అనుచరుణ్ణి ప్రత్యేకంగా నియమించారు. ఆరోజు సదానందం రైల్వే స్టేషన్‌కు బండి తోలుకుపోవడం ఆ అనుచరుడు తెలుసుకున్నాడు. వచ్చేటప్పుడు బండితో ఒంటరిగానే వస్తాడని వార్త వాళ్ళకి అందించాడు.

వీరవరంనుండి రైల్వేస్టేషన్‌కు వెళ్ళేదారిలో రెండు కిలోమీటర్లు వెళ్ళాక డొంక ఒక మలుపు తిరుగుతుంది.

ఆ మలుపునుండి దేవనగరానికి వెళ్ళేదారి చీలుతుంది. ఆ మలుపుకి పక్కనేవున్న ఒక బీడు భూమికి దట్టంగా వున్న తాడిచెట్ల కంచె వుంది.

వార్త తెలిసిన గూండాలు నలుగురూ అక్కడికి చేరి ఆ కంచె చాటున పొంచి

వున్నారు. డొంకలో తమ మనిషిని కాపలా వుంచారు. సదానందం బండి రావడం గమనించి ముందుగా సంకేతం అందించమన్నారు.

నలుగురూ మొహాలకి నల్లని ముసుగులు ధరించారు. కళ్ళ వరకూ రంధ్రాలున్నాయి. కర్రలు పట్టుకొని కంచెచాటున కూర్చున్నారు.

సదానందం బండి కనుచూపుమేరలోకి వచ్చింది. కాపువేసి వున్న మనిషి గూండాలకు వినిపించేలా ఈలవేశాడు. అదే సంకేతం.

నలుగురూ కర్రలు పట్టుకొని కదిలారు. డొంకకి వచ్చారు. బండి ఇంకా రెండు వందల గజాల దూరంలో వుంది. బాటకి ఆ పక్కన ఇద్దరు, ఈ పక్కన ఇద్దరు కర్రలతో కాచుకొని వున్నారు. పొంచి కూర్చుని వున్నారు.

బండి దగ్గరకు రాగానే బండి తొట్లో సందానందాన్ని రెండు పక్కలనుండి ఒక్కసారే విరుచుకుపడి పడగొట్టాలి. ఇదీ గూండాల పథకం.

బాటకి ఆ పక్కన ఈ పక్కన మనుషులు కర్రలతో వున్నట్లుగా లీలామాత్రంగా సదానందానికి కనిపించారు. బండి ఆపి పరిశీలనగా చూశాడు. మనుషులు కూర్చొని వున్నారు కనుక స్పష్టంగా కనబడడంలేదు. నిలువుగా కర్రలు కనపడుతున్నాయి.

ఎవరబ్బా వీళ్ళు? కర్రలతో దారిపక్కన ఎందుకున్నారు. అనుమానంగా వుందే. ఎందుకైనా మంచిదని బాణాకర్రతీసి పక్కన పెట్టుకున్నాడు. బండి తోలుతూ జాగ్రత్తగావున్నాడు. బండి దగ్గరకు వచ్చిన కొద్దీ ఇరువైపులా వున్న మనుషులు కొద్దిగా జరుగుతూ వుండడం గమనించాడు.

సందేహంలేదు. నా కోసమే కాపువేశారు. అని తెలుసుకున్నాడు. బండివాళ్ళకి యాభై గజాల దూరంలో వుండగానే బండి ఆపి బాణాకర్ర పట్టాడు.

బాణా కర్ర పట్టగానే సదానందం జాగ్రత్తగా వున్నాడని వాళ్ళకి తెలిసింది. కర్రలతో వేగంగా నలుగురూ కదిలారు.

వాళ్ళు బండిదాకా రాకముందే సదానందం బండిపోలుముందు నుండి బాణా కర్రతో గుభిల్లున దూకి వీరావేశంతో వాళ్ళపై విరుచుకుపడ్డాడు.

చిచ్చరపిడుగులా విచిత్రగతులతో విజృంభించి క్షణాల్లో ఇద్దరిని నేలకూల్చాడు. మూడవవాడి చేతిలో కర్ర ఎగిరిపోయి దూరంగాపడింది. నాలుగోవాడి కర్ర విరిగింది. పడిపోయిన ముఠా నాయకుడు దుర్గన్న ఎలుగెత్తి 'పారిపొండిరా' అని తన సహచరులను హెచ్చరించాడు.

కాశయ్య, భీముడు అనే ఇద్దరూ ఆ కేక విని కాలికొద్దీ పరుగుతీస్తూ, ఆ ఇద్దరినీ వదిలి దేవనగరంవైపుగా పలాయనమయ్యారు.

"కదిలారా కాళ్ళు విరగ్గొడతాను" అని పడిపోయి వున్న ఇద్దరినీ సదానందం గర్జిస్తూ హెచ్చరించాడు. ఒకడి రొమ్ముమీద కాలుపెట్టి వాడి ముసుగులాగి చూశాడు. వాడు దుర్గన్న. పక్కవూరి వాడే కనుక వాడు సదానందానికి తెలుసు.

"ఒరే దుర్గన్నా. నువ్వంట్రా... నన్ను చంపడానికి వచ్చావా? నన్ను పడగొట్టటం మీ తరంగాదురా. ఏడుగురు దొంగల్ని ఒంటరిగా వెంటాడి తరిమికొట్టిన వీరభద్రయ్యగారు నాకు గురువురా. నన్ను మీరేం చేస్తారు? "

రెండవవాడి ముసుగు తొలగించాడు. వాడు రంగడు.

సదానందం బండిలో వున్న పగ్గం తీశాడు. ఇద్దరినీ ఒక చోట చేర్చాడు. వాళ్ళిద్దరి చేతుల్నీ కట్టి లంకె పెట్టాడు. బండి వెనక భాగంలో చట్రానికి కట్టేశాడు.

"దుర్గన్నా... మీ పాపం పండిందిరా. పదండి బండివెనకే నడవండి. మిమ్మల్ని మీ గురువు పాపారావు దగ్గరకి పంపు

తాను" అంటూ తాను వాళ్ళవెనక నడుస్తూ, ఎడ్లని అదిలించాడు. బండ్లో వుండి తోలక పోయినా ఎడ్లు చక్కగా బండిని ఊరివైపుకు తీసుకుపోతున్నాయి.

గూండాలిద్దరూ బండివెనక కుక్కల్లాగా ఏడ్పు మొహాలతో నడవలేక నడవలేక నడుస్తున్నారు. బండి వీరవరం ముందుకు వచ్చింది. ఊరుముందు నాగరాణి పాలేరు కొండయ్య పొలంవెళ్తూ బండికి ఎదురుపడ్డాడు.

"ఇదేంటన్నయ్యా... ఈ ఇద్దరినీ బండికి కట్టి తోలుకొస్తున్నావ్? ఏం జేశారు? " ఆశ్చర్యంగా అడిగాడు.

"కొండయ్యా! బండి ముందుకు వచ్చి పగ్గాలు చేతికి తీసుకో. బండిని పోలీసు స్టేషనుకు తీసుకుపోదాం. వీళ్ళ కథ అక్కడ చెపుతాలే"

కొండయ్య బండిముందుకు వచ్చి పగ్గాలు తీసుకున్నాడు. బండి పోలీస్‌స్టేషన్‌కి వచ్చింది. భార్గవ పోలీస్ స్టేషన్‌లోనే వున్నాడు.

"సదానందం... ఎవరీ బంధువులు? బంధించి తోలుకొచ్చావు? ఎక్కడ దొరికారు? ఏం చేశారు? " అన్నాడు.

సదానందం జరిగిన కథ అంతా చెప్పాడు.

"ఓహో! ఇది పాపారావు ముఠా అన్నమాట. అతగాణ్ణి మూసేసినా వీళ్లింకా పిచ్చి వేషాలు మానలేదన్నమాట. రవీంద్రా... వీళ్ళని లోపల పడెయ్యి" రవీంద్ర, కృష్ణమూర్తి వచ్చి ఇద్దరికీ కట్లు విప్పి లోపల వేశారు.

కొండయ్య, సదానందం బండితో వెళ్ళిపోయారు.

భార్గవ గూండాలిద్దరినీ బయటికి పిల్చి "ఏంరా... మిగతా ఇద్దరి పేర్లూ, వివరాలు మంచిగా చెబుతారా? లేక మర్యాద చేయించుకొని చెబుతారా? మంచిగా చెబితే మీ వంటికే మంచిది" అన్నాడు.

భార్గవ సంగతి ఆ ఇద్దరికీ తెలుసు గనుక గడగడలాడుతూ చెప్పారు.

★ ★ ★

రవీంద్రని, కృష్ణమూర్తిని వెంటపెట్టుకుని భార్గవ ఆ పూటే దేవనగరం వెళ్ళాడు. కృష్ణమూర్తికి ఆ ఊరి పెద్దలందరూ తెలుసు. వీరవరం పోలీస్‌స్టేషన్‌లో కృష్ణమూర్తి ఏడాదినుండి చేస్తున్నాడు. రవీంద్రకి కూడా చాలామంది తెలుసు. భార్గవకంటే మూడు నెలలు ముందే వీరవరం వచ్చాడు.

రామయ్య, లక్ష్మీనర్సయ్య, సంగయ్య, దేవనగరం పెద్దలు. భార్గవ ముందు ఆ గ్రామ పెద్దల్ని పరిచయం చేసుకున్నాడు. ఇన్‌స్పెక్టర్ భార్గవని వారు సగౌరవంగా రామయ్య గారింటికి ఆహ్వానించారు. భార్గవ ఆ పెద్దలతో మాట్లాడాడు.

"రామయ్యగారూ... మీ ఊళ్ళో పాపారావు అతడి ముఠా కిరాతకంగా చేయకూడని పనులు చేస్తుంటే, మీ పెద్దలెందుకు సహిస్తున్నారు? స్త్రీల శీలానికి రక్షణలేని గ్రామానికి విలువేముంటుంది చెప్పండి. పాపారావు సావిత్రి అనే యువతిని భ్రష్టురాలిని చేసి వదిలేశాడని మాకు తెలుసు. సాటి సంసారుల కుటుంబంలోని ఒక పేద యువతి జీవితం అలా అత్యాచారానికి బలి అయితే మీరంతా సంఘటితులై వాళ్ళని శిక్షించలేరా? "

"యస్సైగారూ! ఇంతకుముందు మాకు మీ పోలీస్ అధికార్ల సహకారం అసలే లేదండి. పైగా ఎమ్మెల్యే బాలాజీకి పాపారావు శిష్యుడు. ఇక మేం ఏమీ చేయలేక పోయాం. ఇప్పుడు మీరు కొత్తగా వచ్చారు. మీ గురించి తెలుసుకున్నాం. పాపారావు మా వూరు రైతు కుటుంబాల్లో చెడబుట్టాడు. వాడిమీద మాకు సానుభూతి లేదండి. మీకు మా సహకారం పూర్తిగా వుంటుంది.

వీరవరం బ్రహ్మానాయుడుగారంటే మా వూరు రైతులకు ఎనలేని అభిమానం. వారి

మనిషిమీద హత్యా ప్రయత్నం జరగడం మాకెంతో బాధాకరంగా వుంది. వాళ్ళకి కఠి నశిక్షలు పడేలా చెయ్యండి. కావాలంటే మేం సాక్ష్యం చెప్పి మీకు సహకరిస్తాం" అన్నారు ముగ్గురు పెద్దలూ.

"సదానందం మీద హత్యాప్రయత్నం చేసిన గూండాలు నలుగురిలో కాళయ్య, భీముడు అనే ఇద్దరు తప్పించుకొని పోయారండీ. వాళ్ళు ఈ దేవనగరంలోనే వున్నారు. మేం వాళ్ళకోసం వచ్చాం రామ య్యగారూ"

"కోటమ్మా... వీరికి మంచినీళ్ళు తెచ్చి ఇచ్చి టీ పెట్టి ఇవ్వు"

"వద్దండీ... టీ పెట్టించకండి. మంచి నీళ్ళు తెప్పించండి. ఇది టీ తాగేవేళ కాదుగా. మీ ఇంట్లో ఆడవారికి శ్రమ ఎందుకు? "

"అయ్యో... అదేంటి యస్సైబాబు గారూ... వీరవరంనుంచి నడిసి వచ్చారు మీరు. పాడి, పంట వున్న ఈ పల్లెటూళ్ళో మీకింత టీ పెట్టి ఇవ్వలేమంటారా? ఆపాటి మర్యాద చెయ్యలేకపోతే ఈ దేవన గరం ఒక ఊరనిపించుకుంటుందా బాబూ" అంటూ కోటమ్మ వారికి ముందుగా మంచి నీళ్ళు ఇచ్చి, తరువాత టీ పెట్టి ఇచ్చింది. అందరూ టీ తాగారు.

"దుగ్గిరాల్లో మా ఇంట్లో మా అమ్మగారు పెట్టిన టీలాగే చాలా బాగుంది. కోటమ్మ గారు బాగా పెట్టారు" అన్నాడు భార్గవ.

"మా కోటమ్మ టీ పెడితే వంకే వుండ దండి. మాకు దూరపు బంధువు. ఆర్థిక బాధల్లో వున్న కుటుంబం. మేం కొంచెం అండగా వున్నాం. ఈమధ్య వీరవరంలో జరిగిన దాడి కేసులో వున్న సావిత్రి ఈ కోటమ్మ కూతురే"

"అలాగా రామయ్యగారూ... మేం సావి త్రితో మాట్లాడాలి. కోటమ్మగారూ సావిత్రి ఇంట్లో వుందా? "

"వుంది బాబుగారూ! ఇక్కడికి పిలవమం టారా? "

"ఇక్కడికి పిలవటమెందుకు? మేమే మీ ఇంటికి వస్తాం పదండి. రామయ్యగారూ! మళ్ళీ మిమ్మల్ని కలుస్తాం"

ముగ్గురూ కోటమ్మతో కలిసి సావిత్రి ఇంటికి వచ్చారు.

అది చిన్న ఇల్లు. ముందు వసారాలో మంచంవేసి వుంది. మరొక పక్క అరుగు మీద ఈతాకుల చాప పరచి వుంది.

సావిత్రి సంభ్రమంతో ఎదురువచ్చి భార్గ వకి నమస్కారం చేసింది.

కోటమ్మ వారిని లోపలికి ఆహ్వానిం చింది.

"అయ్యా! బాబుగారూ! రాండయ్యా! యస్సైగారూ! మీరు ఈ మంచం మీద కూరుసోండి. మీ ఇద్దరూ అరుగుమీద కూర్చోండయ్యా! పేదోళ్లం మా ఇంట్లో కుర్చీ ల్లేవు. ఏవీ అనుకోవద్దు"

"పరవాలేదులే కోటమ్మగారూ! ముగ్గురం అరుగుమీదనే కూర్చుంటాం. అరుగు చాలా బాగుంది" అని ముగ్గురూ అరుగుమీద కూర్చున్నారు.

"సావిత్రీ బాగున్నావా? తమ్ముడి చదు వుకు బ్రహ్మానాయుడుగారు డబ్బు పంపారు. అందిందా? " అన్నాడు భార్గవ.

"అందిందండి! మీ దయవల్ల ఒక నరకం నుండి బయటపడి ప్రశాంతంగా బతుకుతు న్నాను. మీ మేలు, బ్రహ్మానాయుడు బాబా యిగారి మేలు మర్చిపోలేను. నన్ను రక్షిం చారు" అని కంట తడిబెట్టింది.

"బాధపడకు సావిత్రీ! ధైర్యంగా వుండు. మేం నీకు అండగా వుంటాం"

"సల్లగా నూరేండ్లు వర్ధిల్లండయ్యా" అంది చేతులు జోడించి కోటమ్మ.

"సావిత్రీ! సదానందం మీద దాడి చేసిన గూండాల్లో కాళయ్య, భీముడు అనేవాళ్లు తప్పించుకు వచ్చారు. మేం వాళ్లకోసం వచ్చాం. దాడి విషయం నీకు తెలుసుగా. వాళ్ల జాడ తెలుసుకోవాలి"

"దాడి చేసింది తెలుసు. ఇప్పుడు ఆ ఇద్దరూ ఎక్కడుందీ తెలుసు. ఊరి చివరలో ప్రయిమరీ స్కూల్లో వుంటారు. స్కూలుకు సెలవులుగదా! ఖాళీగా ఉన్నప్పుడు అక్కడే మకాం పెడుతూ వుంటారు"

"ఆ స్కూలు నాకు తెలుసు" అన్నాడు కృష్ణమూర్తి.

"మంచి వార్త చెప్పావు సావిత్రీ! ఇప్పుడే వాళ్లని పట్టేస్తాం" అని భార్గవ, రవీంద్ర, కృష్ణమూర్తి బయలుదేరారు. స్కూలు దగ్గరకు వచ్చారు.

తలుపులు దగ్గరకు వేసి వున్నాయి. మెల్లగా తలుపులు నెట్టారు.

కత్తులు పక్కన పెట్టుకుని కాశయ్య, భీముడు పడుకొనివున్నారు. తలుపు నెట్టగానే ఇద్దరూ దిగ్గున లేచి కత్తులు పట్టుకొని నిలిచారు.

"కదిలారంటే కాల్చేస్తాను.కత్తులు పడెయ్యండి ముందు"అని పిస్టల్ గురిపెట్టి గర్జించాడు భార్గవ.

గూండాలిద్దరికీ పిస్టల్ గురిపెట్టిన భార్గవని చూసి గుండెలవిశాయి. కత్తులు కింద పడేసి, చేతులెత్తేశారు. రవీంద్ర, కృష్ణమూర్తి ఇద్దరికీ బేడీలు వేశారు. వాళ్ళ కత్తుల్ని జాగ్రత్తగా గుడ్డలో చుట్టి పట్టుకున్నాడు. ఇద్దరినీ బేడీలతో పెద్ద బజారున నడిపించుకుంటూ రామయ్యగారింటికి వచ్చారు. వీధి గుండా గూండాలు బేడీలతో నడుస్తుంటే భార్గవని, గూండాల్ని జనం వాకిళ్ళలో నిలబడి చూశారు. వీళ్ళ పాపం ఈనాటికి పండిందిగదా అని ఆనందించారు.

"రామయ్యగారూ! ఈ కిరాతక గూండాల కత్తుల్ని అందరూ చూశారుగదా! మీరందరూ చూసినదాన్నే కోర్టులో చెప్పండి. మాకు సహకరించండి. అబద్ధపు సాక్ష్యం చెప్పమని నేను అడగటంలేదు" అన్నాడు భార్గవ.

"తప్పకుండా కోర్టుకు వచ్చి సాక్ష్యం చెబుతామండీ! మేం మాట తప్పం" అని హామీ ఇచ్చాడు రామయ్య.

గూండాల్ని వీరవరం తీసుకువచ్చి లాకప్‌లో పడేశారు. ఆ రాత్రి ఆ ఇద్దరినీ, ఈ ఇద్దరినీ బాగా మర్దించి వాళ్ళు చేసిన నేరాలన్నీ వాళ్ళ నోటనే కక్కించి రికార్డు కెక్కించారు.

ఆ తెల్లవారే నలుగురిమీదా కేసు నమోదు చేసి, అరెస్టు చేసిన ఇరవై నాలుగు గంటలలోపే ముద్దాయిలు నలుగురినీ కోర్టులో హాజరుపరిచారు. కోర్టులో ప్రాథమిక విచారణ జరిపి, ముద్దాయిల్ని రిమాండుకు పంపారు.

★ ★ ★

విజయసారథిమీద దాడి జరిపిన కేసు విచారణకు వచ్చింది. ఎనిమిదిమంది తెనాలినుండి వచ్చిన గూండాలు, భూపాలరావు కోర్టులో నేరం అంగీకరించారు. చందన్, గోపాల్, పాపారావు కోర్టులో నేరం అంగీకరించకపోయినా తోటి ముద్దాయిలు చెప్పినదాన్ని బట్టి సావిత్రి, గ్రామంలోని ప్రత్యక్షసాక్షులు చెప్పినదాన్ని బట్టి ఆ ముగ్గురినీ నేరస్థులుగా నిర్ధారించారు.

మొత్తం పన్నెండుమందికి ఐ.పి.సి. 363 సెక్షను కింద న్యాయమూర్తి రెండేసి యేళ్లు కఠిన కారాగార శిక్ష విధించాడు.

తరువాత సదానందం మీద దాడిచేసిన గూండాలమీద కేసు విచారణకు వచ్చింది. కాశయ్య, భీముడు, రంగడు, దుర్గన్న అనే నలుగురినీ విచారించారు. దేవనగరం కర్షకులు రామయ్య, లక్ష్మీనర్సయ్య కోర్టుకి వచ్చి సాక్ష్యం చెప్పారు. సదానందం మీద హత్యాప్రయత్నం చేసిన నేరస్థులుగా ఆ నలుగురినీ నిర్ధారించి, న్యాయమూర్తి ఐ.పి.సి. 307, సెక్షనుకింద ఏడేసి యేళ్ళు కఠినకారాగార శిక్ష విధించాడు.

సాహసంతో నేరస్థుల్ని నిర్బంధించి, సాక్ష్యాధారాలు బలంగా చూపించటమే గాకుండా కొందరు నేరస్థులతో నేరాన్ని అంగీకరింపజేసినందుకు న్యాయమూర్తి ఇనస్పెక్టర్ భార్గవని అభినందించారు.

★ ★ ★

భార్గవ, విజయసారథి ఎక్కువగా బ్రహ్మానాయుడితో చర్చలు జరుపుతూ అవసరమైన సలహాలు తీసుకుంటూ వుంటారు.

"భార్గవా! మా అనూరాధతో విజయసారథికి పెళ్లి కుదిరింది" అన్నాడు బ్రహ్మానాయుడు. విజయసారథి చిరునవ్వుతో వింటున్నాడు.

"విజయసారథిగారు ఇంతకుముందే నాకు చెప్పారు బాబాయిగారూ! మీ నోటి వెంట వినాలని నేను మిమ్మల్ని అడగలేదు. మీరే చెప్పారు. మంచి నిర్ణయం తీసుకున్నారు. మీ పరిచయం బంధుత్వంగా మారాలని మా కోరిక భార్గవా! నీకు ఒక మంచి సంబంధం వుంది. మాట్లాడమంటే మాట్లాడతాను"

"పెళ్లి విషయంలో మీ సలహా తప్పకుండా పాటిస్తాను. చెప్పండి"

"నీకు మా వివేకానందతో పరిచయం అయిందిగదా! ఆయనకి ఒక కూతురు, ఒక కొడుకు వున్నారు. కూతురు పేరు రేణుక. ఎలక్ట్రానిక్సు ఇంజనీరింగులో డిగ్రీ పాసయింది. హైద్రాబాదులో ఒక కేంద్రప్రభుత్వ సంస్థలో ఉద్యోగం చేస్తోంది.

కొడుకు పేరు విజయానంద. వాడు అమెరికాలో ఎం.ఎస్. పూర్తిచేసి అక్కడే ఒక కంపెనీలో ఉద్యోగం చేస్తున్నాడు.

నీకు అంగీకారమైతే రేణుకని నీకు ఇవ్వాలని అనుకున్నాం. ఆలోచించుకొని నీ అభిప్రాయం చెప్పు"

"బాబాయిగారూ! మీ సూచన బాగుంది. నాకు అంగీకారమే. వివేకానందగారు, మీరు ఒకసారి దుగ్గిరాల వెళ్లి మా అమ్మనాన్నలతో మాట్లాడండి. నేను వాళ్లకి చెబుతాను. వాళ్లు తప్పకుండా అంగీకరిస్తారు"

"చాలా సంతోషం బాబూ! నేను, వివేకానంద మీ వూరు వెళ్లి మీ అమ్మానాన్నలతో మాట్లాడి వస్తాం. తరువాత నువ్వు హైదరాబాదు వెళ్లి రేణుకని చూడు. అడ్రసు ఇస్తాను"

"అలాగే బాబాయిగారూ"

"విజయసారథిబాబూ! మేము మీ అమ్మానాన్నలతో మాట్లాడి వస్తాం. నువ్వు వాళ్లకి ఉత్తరం రాసి తెలియజెయ్యి. మాకు వారి అడ్రసు ఇవ్వు"

"అలాగేనండి. వెంటనే ఉత్తరం రాస్తాను"

★ ★ ★

ఇన్స్పెక్టర్ భార్గవ తండ్రి రామచంద్రమూర్తి సామాన్య కర్షక కుటుంబంలో జన్మించాడు. సౌమ్యుడుగా, నిజాయితీపరుడుగా పేరు తెచ్చుకున్నాడు. ఆయన కర్షక కుటుంబంలో పుట్టినా, వ్యాపారం అంటేనే ఎక్కువ ఆసక్తి చూపేవాడు.

మార్కెట్ ఒడుదుడుకులు, లాభాలు, నష్టాలు చవిచూశాడు. వ్యాపారంలో అనుభవం సంపాదించాడు కాని డబ్బు సంపాదించలేకపోయాడు.

వ్యాపారం ఎత్తివేసి, అక్కడ ఒక వ్యాపార సంస్థలో ఉద్యోగంలో చేరి కుటుంబాన్ని పోషించారు. భార్గవ పట్టుదలగా చదివి ఫస్టుక్లాసులో బి.ఎస్.సి. పాసై, ఎస్.ఐ. ఉద్యోగంలో చేరాడు.

వివేకానంద, బ్రహ్మానాయుడు దుగ్గిరాల వెళ్లి భార్గవ తల్లిదండ్రులతో పెళ్లి సంబంధం విషయం మాట్లాడారు. వారు వివేకానందతో వియ్యం అందుకోవటానికి ఆనందంగా అంగీకరించారు.

★ ★ ★

బ్రహ్మానాయుడి దగ్గర అడ్రసు తీసుకుని భార్గవ హైదరాబాదు బయలుదేరాడు. వీరవరంనుండి బస్‌లో హైదారాబాదు వచ్చాడు. వనస్థలిపురం దగ్గర బస్సు దిగి సెక్రటేరియట్ కాలనీలోవున్న తన మేనమామ కొడుకు నాగేశ్వరరావు ఇంటికి వచ్చాడు.

నాగేశ్వరరావు సెక్రటేరియట్‌లో ఉద్యోగం చేస్తున్నాడు. భార్గవ, నాగేశ్వరరావు చిన్నప్పటినుండి సహపాఠులు, సమవయస్కులు, సన్నిహితులు.

నాగేశ్వరరావు భార్య పార్వతి, భార్గవని చూడగానే "అన్నయ్యా! రండి" అని సగౌరవంగా ఆహ్వానించింది.

"భార్గవా! దుగ్గిరాలనుంచేనా రావటం? " నాగేశ్వరరావు అడిగాడు.

"కాదురా. వీరవరంనుండి వస్తున్నాను" అని తాను వచ్చిన పని ఏమిటో వివరంగా చెప్పాడు. వివేకానంద ఇంటి అడ్రసు చూపెట్టాడు. "ఈ ఇల్లు తెలుసుకుని మనం అక్కడికి వెళ్లాలిరా" అన్నాడు భార్గవ.

"ఈ ఇల్లు దిల్‌సుక్‌నగర్‌లో పి. అండ్. టి. కాలనీలో వుంటుంది భార్గవా. మనం ఈపూట అక్కడ దిగి ఇల్లు వెదికి నంబరు గుర్తుపెట్టుకుందాం. నువ్వు వెనక్కి వచ్చేసెయ్. నేను ఆఫీసుకు వెళ్లిపోతాను. నువ్వు సాయంత్రం అక్కడికి వచ్చెయ్. నేను ఆఫీసునుండి అక్కడికే వస్తాను. ఇప్పుడు మనం వారింటికి వెళ్లినా ఆ అమ్మాయి ఇంట్లో వుండదు. ఆఫీసుకు వెళ్లివుంటుంది"

"నీ ఆలోచన బాగుందిరా. అలాగే చేద్దాం"



దిల్‌సుక్‌నగర్ సిటీ బస్‌స్టాపులో ఒక బస్సునుండి అయిదుగురు అమ్మాయిలు దిగారు. రోడ్డు దాటి లోపల కాలనీవైపు నడుస్తున్నారు. అందరి భుజాలకు బ్యాగులు తగిలించుకుని వున్నారు. సందడిగా మాట్లాడుకుంటూ నడుస్తున్నారు.

ఆ యువతులు బస్సు దిగిన దగ్గర్నుండి ఒక యువకుడు వాళ్ల వెనకే అదే రోడ్డున నడుస్తున్నాడు. మార్గమధ్యంలో ఆ యువతులు ఒక్కొక్కరూ చీలి తమ తమ ఇళ్లున్న గల్లీల్లోకి వెళ్లిపోయారు. చివరకు ఒక అమ్మాయే మిగిలింది. ఆ యువతి అందంగా, చురుగ్గా వుంది.

బస్సు దిగిన దగ్గర్నుండి తమ వెనకాలే నడుస్తున్న యువకుణ్ణి అనుమానంతో చూస్తూ నడుస్తున్నది.

చూపులకు ఆకర్షణీయంగా వున్న ఆ యువకుడు తనను వెంటాడుతున్నాడేమోననుకుంది.

ఈ అమ్మాయి ఎవరో తనని అనుమానంగా చూస్తున్నట్లుంది. నేను వెంటాడుతున్నాననుకుంటోందేమో అనుకుని ఆ యువకుడు కొంచెం వెనక్కి తగ్గి నడుస్తున్నాడు. కొద్ది దూరంలోనే ఆ యువతి ఇల్లు వచ్చింది.

ఆ ఇంటిగేటు తీస్తూవుండగానే హాయ్ రేణుకా అంటూ అనూరాధ ఎదురువచ్చింది. రేణుక వెనకే గేటు దగ్గర నిలిచి వున్న యువకుణ్ణి చూసి "భార్గవన్నయ్యా! మీరిప్పుడే వస్తున్నారా? " అంది అనూరాధ.

రేణుక వెనక్కి తిరిగి చూసి తెల్లబోయి ఈయన భార్గవగారా, ఎవరోనని అనుమానించానే అని లోలోన అనుకుంది.

"ఇప్పుడే వస్తున్నాను అనూరాధా" అన్నాడు భార్గవ.

"మామయ్యా! భార్గవన్నయ్య వచ్చారు" అని అనూరాధ పిలిచింది.

"రండి. లోపలికి వచ్చి కూర్చోండి" అని రేణుక సవినయంగా భార్గవని ఆహ్వానించింది.

వివేకానంద కూడా ఎదురొచ్చి సాదరంగా ఆహ్వానించాడు.

"భార్గవన్నయ్యా! రాత్రి మా నాన్నగారు నాకు హాస్టలుకు ఫోనుచేసి మీరు హైదరాబాదు వస్తున్నట్లు చెప్పారు. మీ పెళ్లిచూపుల వ్యవహారం చూడాలని హాస్టలునుండి వచ్చాను. మీరేమో అది ముందే పూర్తిచేసుకుని బయటినుండి ఇద్దరూ కలిసే వచ్చేశారు" అంది అనూరాధ నవ్వుతూ.

"నేను వస్తున్న సంగతి వివేకానందగారికి తెలియజేయవద్దని మీ నాన్నగారికి చెప్పాను. వారికి తెలియకుండానే వారింటికి రావాలనుకున్నాను"

ఇంతలో సెక్రటేరియట్ నుండి నాగేశ్వరరావు వచ్చాడు. భార్గవ వారికి నాగేశ్వరరావును పరిచయం చేశాడు. రేణుక నాగేశ్వరరావుకు సవినయంగా నమస్కారం చేసింది. కొంతసేపు వివేకానందతో భార్గవ, నాగేశ్వరరావు మాట్లాడారు.

"ఇక వెళ్లివస్తామండీ. నేను ఈ రాత్రికే వెళ్లిపోవాలి" అన్నాడు భార్గవ.

"అన్నయ్యా! నేనూ ఈ రాత్రికే వీరవరం బయలుదేరుతున్నాను. బస్సు టికెట్టు రిజర్వేషన్ చేయించుకున్నాను రాత్రి పదిన్నర బస్సుకి. మీరూ ఆ బస్సుకే రండి"

"సరే అనూరాధా. గౌలిగూడా బస్‌స్టేషన్‌లో కలుద్దాం"

భార్గవ, నాగేశ్వరరావు వారి దగ్గర సెలవు తీసుకుని బయలుదేరారు. అందరూ బయటికి వచ్చి హార్దికంగా వీడ్కోలు చెప్పారు.

★ ★ ★

వీరవరం పొలాల్లో యేవైపు చూసినా పసుపుపచ్చగా వికసించిన పొద్దుతిరుగుడు పైర్లు ఏపుగా, గుబురుగా పెరిగి విరగబూసిన కందిపైర్లు పచ్చదనంతో కనువిందు చేసే వేరుశనగపైర్లు అరుణకాంతులు విరజిమ్మే పండుకాయలతో మిరపతోటలు, పొలాలన్నీ నేత్రానందంగా వున్నాయి.

కొండపల్లి నుండి వారంరోజులు సెలవు పెట్టి వీరవరం వచ్చిన మురళీకృష్ణ విజయసారథితోను, భార్గవతోను కలిసి పొలాలు చూడటానికి వచ్చాడు. పొలాలలో పంటపైరుల శోభచూసి పరవశం చెందాడు.

"విజయసారథీ! నీ రాకతో ఈ వీరవరం తీరే మారిపోయింది"

"గొడ్డు వచ్చిన వేళ బిడ్డ పుట్టిన వేళ" అని మన గ్రామీణుల్లో ఒక లోకోక్తి వుంది బాబూ! నేనసలే తెలుగు పండితుణ్ణి. నానోరు ఊరుకోదు విజయసారథి వచ్చిన వేళ పల్లవించిన పంటలహేల. అంటాను.

అంతేకాదు. అరాచకశక్తుల భరతంపట్టి, అక్రమ వ్యాపారాలన్నీ అరికట్టి వీరవరం ప్రజల్ని ఏకమార్గంలో నిలబెట్టి అందరి ప్రశంసలు అందుకున్న భార్గవ కూడా అభినందనీయుడే. మీ ఇద్దరినీ ప్రజాబంధువులు అనాలి. మీ ఇద్దరికీ కుదిరిన వివాహాలమూలంగా బంధువులు కాబోతున్నారు.

బావ, మరుదులుగా మీకు బంధుత్వం ఏర్పడింది. మిమ్మల్ని సత్యవాణి పంతులమ్మ కృష్ణార్జునులు అన్నదట గదా. అది సత్యం అయింది"

"బాపూజీ! మీరు మమ్మల్ని మరీ పొగుడుతున్నారు. మేము మా ఉద్యోగవిధుల్ని నిర్వహిస్తున్నాం. అంతే" అన్నాడు విజయసారథి.

"అంతేనండీ. మా డ్యూటీ మేం చేస్తున్నాం" అన్నాడు భార్గవ.

"అందరూ మీలాగ విధులు నిర్వహిస్తే ఈ భారతదేశం సుందర నందనోద్యానం అవుతుంది బాబూ"

★ ★ ★

అనూరాధ స్నానం చేసి, డ్రెసింగ్ టేబుల్ ముందు కూర్చుని తిలకంతో బొట్టు దిద్దుకుంటున్నది. అప్పుడే ఉషాబాల వచ్చి పక్కనే మాట్లాడుతూ కూర్చుంది. బ్రహ్మానాయుడు పొలం వెళ్లాడు. భారతీదేవి శేషాద్రి నాయుడి ఇంటికి వెళ్లింది. ఉదయం తొమ్మిది గంటలయింది. ఇంట్లో ఫోన్ మోగింది.

"ఉషాబాలా! ఫోన్ తీసుకో. ఎవరో అడుగు"

ఉషాబాల రిసీవర్ తీసి 'హలో' అంది

"ఇది బ్రహ్మానాయుడిగారి ఇల్లే గదా? "

"అవునండీ. ఆయన ఇంట్లో లేరు. మీరెవరు? "

"అనూరాధ వుందా? వుంటే పిలువు"

"ఉందండి" అని రిసీవరు చేత్తో మూసి పట్టుకుని "అక్కా! నిన్ను పిలుస్తున్నారు. నువ్వే రా"

"చేసిందెవరో అడగవే" అంది బొట్టు దిద్దుకుంటూ.

"మీరెవరండీ? ఎక్కడినుంచి చేస్తున్నారు? "

"పసిఫిక్ మహా సముద్రం పక్కనున్న భూగోళం మీదనుండి చేస్తున్నాను. అనూరాధని పిలువు. వుందన్నావుగా"

ఉషాబాల మళ్లీ రిసీవరు చేత్తో మూసి "అక్కా! ఆయనెవరో చెప్పటంలేదు. పసిఫిక్ మహా సముద్రం పక్కనున్న భూగోళం మీదనుండి చేస్తున్నారట. నిన్నే రమ్మంటున్నారు"

"ఓహో వాడా? " అని వచ్చి రిసీవరు తీసుకుని "హలో! విజయానందా! బాగున్నావా? నువ్వు చేశావనుకోలేదురా. ఎవరో ఇక్కడి వాళ్లనుకున్నా"

"ఆ బాగున్నాను. అక్కా! ఆ అమ్మాయి ఎవరు? నిన్ను పిలవమంటే పిలవకుండా రెండుసార్లు మీరెవరని అడిగింది"

"నేనే అడగమన్నాలే. ముందే అమెరికా నుండి చేస్తున్నానని నీ పేరు చెప్పి యేడవ కూడదూ. పసిఫిక్ మహాసముద్రం పక్క నుండి చేస్తున్నానంటావా? ఆడపిల్లగదా అని అలుసు చేస్తావంట్రా శుంఠా? అది ఉషాబాల, మా బాబాయి కూతురు. నీకు తెలుసుగా"

"అబ్బా ఆ అమ్మాయి ఎదుటే నన్ను శుంఠా అన్నావా? చిన్నప్పటి తిట్టు గుర్తుపెట్టుకున్నావా. ఇప్పుడు నేను ఇంజనీరుని శుంఠను కాను"

"మిడికావులేవోయ్. ఇంజనీరువైనా, సైంటిస్టువైనా మా విజయానందవే. నాగార్జున బాగున్నాడా? "

"అక్కా! బాగానే వున్నాను. పక్కనే వున్నాను. నువ్వు నన్ను అడుగుతావో లేదోనని మీ మాటలు వింటున్నాను. ఇది స్పీకరు ఫోను"

"మీరు వంటచేసుకుంటున్నారా? హోటళ్లలో తింటున్నారా? " అని అడిగి మళ్లీ గంభీరంగా "భారతీయ యువకులారా! ఆ ఖండాంతర దేశంబున మీరు గోమాంస భక్షణము చేయుదురా? మద్యపానాసక్తి కలిగియుందురా? "

"అపచారంబు, అపచారంబు. పాపంబు శమించుగాక. మేమిరువురము పరమ నిష్ఠాగరిష్టులము. భారతీయ సాంప్రదాయంబు మా ప్రాణ సమానంబు. గోమాంస భక్షణము సేయుటయా? మధుపానాసక్తులమగుటయా? అది యసంభవంబు"

"విజయానందా! అక్క పెళ్లి కుదిరింది, నీకు తెలుసా? "

"అక్క పెళ్లి కుదిరిందీ తెలుసు. నీ పెళ్లి కుదిరిందీ తెలుసు. మా నాన్న ఫోను చేసి అన్ని సంగతులూ చెప్పారు"

"మీ ఆరోగ్యాలు జాగ్రత్త. ఇద్దరూ పెళ్లికి తప్పకుండా రండి"

"అలాగే అక్కా. ఇద్దరం తప్పకుండా వస్తాం. ఇక వుంటాం"

★ ★ ★

విజయసారథి తల్లిదండ్రులతో పెళ్ళి విషయాలు మాట్లాడటానికి బ్రహ్మానాయుడు, భారతీదేవి బయలుదేరారు.

విజయసారథి వారికి అడ్రసు ఇచ్చాడు.

వీరవరంనుండి ముందుగా తెనాలి వచ్చాడు. వివేకానంద, సుజాత అప్పుడు తెనాలిలోనే వున్నారు.

బ్రహ్మానాయుడు, భారతీదేవి ఇద్దరూ

దయాసాగర్ ఇంటికి వెళ్ళి దయాసాగర్‌కి, అతని సతీమణి భవానికి అనూరాధ పెళ్లి కుదిరిన విషయం చెప్పారు.

"దయాసాగర్! మా అనూరాధ పెళ్లికి ముందే మాకు ఒక కారు కొనాలిరా! నీ కారు చూడు! మా పెళ్ళిముందే కొన్నావు. ఇంకా చెక్కు చెదరలేదు. కార్ల సంగతి మాకంటే నీకే బాగా తెలుసుగదా! మాకు నుంచి కారు నువ్వే కొని డ్రైవర్ని కూడా మాట్లాడి వుంచు"

"అయితే ఇక్కడొక మంచి కారు బేరానికి వచ్చివుందిరా. రేపు కొని వుంచుతాను. అందాకా నా కారు వాడుకో"

ఆ రోజు దయాసాగర్ భార్య భవాని బ్రహ్మానాయుడిని, భారతీదేవిని, వివేకానం దని, సుజాతని భోజనానికి ఆహ్వానించింది.

ఆ రాత్రి భోజనాల తర్వాత అందరూ ఇష్టాగోష్టి జరుపుకున్నారు. ముగ్గురు మిత్రులూ కాలేజీ చదువులనాటి కబుర్లు చెప్పుకున్నారు.

"దయాసాగర్! మన మహర్షి ధర్మపాల కలవక చాలాకాలం అయిందిరా. వాడు తెనాలి వస్తున్నాడా?" అన్నాడు బ్రహ్మానా యుడు.

"మొన్న విజయదశమికి ఇక్కడికి వచ్చి వెళ్లాడురా. నిన్ను అడిగాడు. ఈసారి వచ్చి నపుడు వీరవరం వెళ్దాం అన్నాడు. మురళీ కృష్ణని కూడా ఒకసారి కలవాలంటున్నాడు. అనూరాధ పెళ్లి వచ్చిందిగా. అప్పుడందరం కలుసుకోవచ్చు ఈమధ్యలో రేణుక పెళ్లి కూడా వుందిగదా"

"అనూరాధ పెళ్ళి సంస్కరణ పద్ధతిలో జరపాలనుకుంటున్నానురా. ఆ పెళ్ళికి ఆచార్యుడిగా ధర్మపాలనే వుండి చేయ మందాం"

"చాలా మంచి ఆలోచన. వాడు తెలుగు లెక్చరర్ కూడా. భార్గవ ఒప్పుకుంటే మా రేణుక పెళ్ళి కూడా అలాగే చేద్దాం" అన్నాడు వివేకానంద.

★ ★ ★

ఉదయం ఏడుగంటలకు బ్రహ్మానా యుడు, భారతీదేవి, విజయసారథి ఊరు బయలుదేరారు. దయాసాగర్ కారు, డ్రైవర్ని ఇచ్చాడు. తెనాలినుండి గుంటూరు వచ్చి అక్కడినుండి గుంటూరుకు అమరావ తికి మధ్యనున్న ఆ ఊరు వచ్చారు. ఆ ఊరిపేరు గోపాలపురం. చిన్నవూరు.

అడ్రసు చూపితే ఒక యువకుడు వారికి ఇల్లు చూపించాడు. అది మధ్యరకం డాబా. మరీ పెద్దది కాదు, చిన్నది కాదు. అందంగా వుంది.

ఇంటి ముందుకు కారు రావటం చూసి విజయసారథి తల్లి, తండ్రి లోపల్నుండి బయటికి వచ్చారు. కారు దిగి ఆవరణలోకి వచ్చిన అతిథుల్ని రండి అంటూ ఆ దంప తులిద్దరూ ఎదురొచ్చారు.

ఎదురుగా వచ్చిన విజయసారథి తల్లిని, తండ్రిని చూసి భారతీదేవి ఆశ్చర్యంతో నిలి చిపోయింది. అదే రూపం. అదే రంగు. అదే జంట.

మరపురాని జంట. ఇది మరపురాని క్షణం.

బ్రహ్మానాయుడు కూడా పోల్చుకున్నాడు. అవును. అదేజంట. ఇరవై ఐదు సంవత్సరా లనాడు ఇదే కారులో అమరావతి వచ్చిన పుడు ఆలయప్రాంగణంలో పెళ్ళి జరిగిన వధూవరులు ఆ అందాల జంట వీళ్లే. ఇపుడు విజయసారథి తల్లితండ్రులై తమకు వియ్యాలవారయ్యారు.

"భారతీ! నీ అమరావతి ఆడపడుచు"

"ముందు మీ అమరావతి చెల్లెలు. తర్వాతే నాకు ఆడపడుచు"

"ఏమిటండీ, ఆడపడుచు అంటున్నారు? మీరు నన్నెప్పుడైనా చూశారా? నాకూ మిమ్మల్ని ఎప్పుడో చూసినట్లు గుర్తు వస్తు న్నది" అని ఆమె కూడా అంది.

"నాకూ వీరిని ఎప్పుడో చూసినట్లుగా వుంది" అన్నాడు ఆమె భర్త కూడా.

"ఇరవై అయిదేండ్లనాడు అమరావతిలో

మీ పెళ్ళి చూశాం. మా భారతి నీకు పసుపు కుంకుమలతో చీరె పెట్టింది. శిరస్సుపై అక్షతలు వేసింది. నీకు గుర్తుందా? ఆమెకు నువ్వు అమరావతి ఆడపడుచువి"

"ఆరోజు మీ అందాల జంటని మెచ్చి నాతోపాటు ఆయనా మీ శిరస్సులపై అక్షతలు వేశారు. ఆయనకు నువ్వు అమరావతి చెల్లెలివి"

ఆనాడు, ఈనాడు ఆ దంపతులనోట అదే మాట.

"అన్నయ్యగారూ! లోపలికి రండి. మాటల్లోపడి ఇంతవరకు బయటే నిలబెట్టాం" అంది రత్నప్రభ. అతడు ప్రభాకరరావు.

విజయసారథి ఇచ్చిన అడ్రసులో తల్లిదండ్రులపేర్లు ఇద్దరివీ రాశాడు.

"నన్ను అన్నయ్యా అని పిలువమ్మా. గారూ ఎందుకు? ఇరవై అయిదేళ్లనాటి విచిత్రానుబంధం మనది. మళ్లీ వియ్యాల వారుగా కలిశాం" అంటూ బ్రహ్మానాయుడు లోపలికి నడిచాడు.

అందరూ హాల్లో కూర్చుని కుశలప్రశ్నలు వేసుకున్నారు. రత్నప్రభ లేచి వంటింట్లోకి వచ్చి అతిథులకి టీ, ఫలహారాలు తయారు చేస్తున్నది.

"ఆడపడుచుగారూ! వంటింట్లో ప్రవేశించారా" అంటూ భారతీదేవి కూడా వంట ఇంట్లోకి వచ్చింది.

"వదినా! నన్ను గారూ అనకండి. మీకంటే వయసులో కొంచెం చిన్నదాన్నే. రత్నప్రభా అనండి. గతంలో మీ ఆశీస్సులు పొందిన ఆడపడుచును కూడా గదా. నన్ను గారూ అంటే ఆత్మీయంగా వుండదు"

"అలాగే రత్నప్రభా నువ్వన్నదీ నిజమే. నువ్వు మాకు ఆడపడుచుగా వుంటేనే బాగుంటుంది"

అరగంటలోనే ఆత్మీయులై ఫలహారాలు, టీలు సేవిస్తూ ఇష్టాగోష్టి చర్చలు జరుపుకున్నారు.

"ప్రభాకరరావన్నయ్యా, మీ పెళ్ళిరోజున రత్నప్రభ వాళ్లన్నని నిందించటం విన్నాను.

'బానకడుపు, గూనిమూపు, బొల్లిమొకం, పిల్లికండ్లు ఆ అనాకారి ధనరాజుకు నన్ను అమ్ముకుందామనుకున్నావు.' అంది ఆ ధనరాజు ఎవరు? ఆ కథ నాకు చెప్పండి" అంది భారతీదేవి.

"వదినా! ఆ మాటలు మీకు బాగా గుర్తున్నాయే" అని నవ్వింది రత్నప్రభ.

"నువ్వు అంత బాగా వర్ణిస్తే మాకు గుర్తుండవూ మరి. అందుకే ఆ కథ వినాలని ఆసక్తిగా వుంది" అంది భారతీదేవి నవ్వుతూ.

"ఆ మాటలే కాదమ్మా. అమరావతి ఆడపడుచుగా, అమరావతి చెల్లెలుగా నేను, భారతి అప్పుడప్పుడు గుర్తు చేసుకునేవాళ్లం" అన్నాడు బ్రహ్మానాయుడు.

"బావగారూ! ఆరోజున మీరిద్దరూ మా వధూవరుల శిరస్సులపై అక్షతలు వేశారు గదా. అది రత్నప్రభకెంతో ఆనందానుభూతి కలిగించింది. తర్వాత మీరు అక్కడి వాదోపవాదాలు వింటూ కారు దగ్గర నిలిచి వుండటం రత్నప్రభ గమనించింది. మీ దగ్గరికి వచ్చి భక్తితో ప్రణామాలు చేసింది. నేనూ అలాగే చేశాను. తర్వాతే బండి ఎక్కాం" అన్నాడు ప్రభాకరరావు.

"అవునన్నయ్యా. అయితే మీరూ మమ్మల్ని మర్చిపోలేదు. ఆరోజు అక్కడ జరిగిన వాదోపవాదాలనుబట్టి రత్నప్రభ వాసిరెడ్డివారి అమ్మాయి అనిమాత్రం తెలుసుకున్నాం. ఇతర వివరాలేవీ మాకు తెలియవు. మీకూ వివరాలు తెలియవు. మీరు నాకు ఆ ధనరాజు కథ చెప్పండి అన్నయ్యా"

ప్రభాకరరావు తన అంధకపురం బంధుత్వకథ అంతా వారికి చెప్పాడు.

"ప్రభాకరరావుగారూ! మీ పెళ్ళికథ బాగుంది. మళ్లీ మీలాగే విజయసారథి, అనూరాధ పరస్పరం ఇష్టపడి భార్యాభర్తలు కాబోతున్నారు. అయితే వీళ్లకి ధనరాజులు, రాజారావులు అడ్డులేరు" అన్నాడు బ్రహ్మానా

యుడు నవ్వుతూ.

భోజనాలు చేసి కొంతసేపు విశ్రాంతి తీసుకున్న తర్వాత ఆ దంపతులు, ఈ దంపతులు కారులో అమరావతి క్షేత్రానికి వచ్చారు. బౌద్ధారామం, కృష్ణాతీరం, అమరేశ్వరాలయం అన్నీ సందర్శిస్తూ సంతోషంగా, సరస సంభాషణలతో గడిపి, సాయంత్రానికి. గోపాలపురం చేరారు. ఉభయులూ పెళ్ళి విషయాలు చర్చించారు.

"బావగారూ! మీరు మన్నిస్తామంటే నాకూ రత్నప్రభకి ఒక కోరికుంది" అన్నాడు ప్రభాకరరావు.

"అదేంటి ప్రభాకరరావుగారూ! మీ కోరిక కాదంటామా? మనలో మనకు మన్నించక పోవటాలుంటాయా? చెప్పండి"

"మా పెళ్ళి అమరావతిలో జరిగిందిగదా. అలాగే మా అబ్బాయి పెళ్ళి గూడా అమరావతిలోనే జరగాలని మా దంపతులకి కోరికుంది. అది మీరు అంగీకరిస్తే ఆనందిస్తాం. అదీ మీకు ఇష్టమైతేనే. మీ అమ్మాయి పెళ్ళి మీ ఇంటిముందే జరగాలన్న కోరిక మీకుంటే బలవంతం చెయ్యం. మీకూ ఒక్కతే కూతురు కనుక ఇంటి ముందు వైభవంగా చెయ్యాలని అనుకుని వుండొచ్చు. భారతీదేవిగారు ఒప్పుకుంటే, అవకాశంవుంటే మా కోరిక మన్నించండి"

"అన్నయ్యా! మీరు నన్ను భారతీదేవిగారు అన్నారు. నన్ను గారు అని సంబోధించకండి. నాకన్న పెద్దవారు. అన్నయ్య స్థానంలో వున్నవారు. భారతీ అని పిలవండి. అదే నాకు సంతోషం"

"సరేనమ్మా. అలాగే పిలుస్తాను. నేను అడిగిన విషయం మాత్రం ఆలోచించండి. అది నీకు కూడా ఇష్టమైతేనే"

"అన్నయ్యా, పెళ్ళి ఎక్కడ జరగాలనే విషయంలో మీ బావగారేది అంటే నాది అదే మాట. నాకేమీ కోరికలు, అభ్యంతరాలు లేవు"

"ప్రభాకరరావుగారూ! మేం ధనవంతులం కనుక మా అమ్మాయికి మహా వైభవంగా పెళ్ళి చెయ్యాలన్న కోరిక మాకేం లేదు. అసలు ధనవంతులే తమ పిల్లలకి నిరాడంబరంగా పెళ్ళిళ్ళు చేసి అందరికీ ఆదర్శంగా నిలవాలి. అప్పుడు సామాన్య కుటుంబాల వారు కూడా అప్పులు చేసి శక్తికి మించిన ఆడంబరాలకి పోకుండా వుంటారు. ఆర్థిక బాధలకు గురికాకుండా వుంటారు.

అట్టహాసంగా, అతి వైభవంగా పెళ్ళి చెయ్యటం గొప్పకాదు. ఆపైన అన్యోన్యంగా, ఆదర్శంగా జీవితం గడపటంలోనే గొప్పతనం వుంది.

మీ కోరిక నాకు సంతోషాన్ని కలగజేసింది. మా భారతీ కాదనదు. మీ దంపతుల ఇష్టప్రకారమే చేద్దాం!"

"బావగారు చెప్పింది నీకూ సమ్మతమే గదా భారతీ!"

"అన్నయ్యా! ఆయన మాటే నా మాట అని ఇంతకుముందే అన్నా గదా! ఇటువంటి చరిత్రాత్మకమైన పుణ్యక్షేత్రంలో పెళ్ళి జరగటం నాకు మరీ ఇష్టం!

"వదినా! మన పిల్లల మనసులు కలిసిపోయినట్లే మన మనసులు కూడా ఏకాభిప్రాయంతో వున్నాయి. మీ ఇద్దరివీ అమృత హృదయాలు. ఇరవై అయిదేండ్ల నాడే మాకు ఆశీస్సులందించిన మీరు మాకు ఆరాధనీయులు" అని రత్నప్రభ చేతులు జోడించి నమస్కారాలు చేసింది.

"మనమధ్య మాట్లాడుకోవలసినది మరొకటి వుంది ప్రభాకరరావుగారూ! ఈ పెళ్ళి నిరాడంబరంగా, సంస్కరణ పద్ధతిలో చేద్దాం! కవిరాజు త్రిపురనేని రామస్వామి గారు సంస్కృత మంత్రాలనుండి తేట తెలుగులోకి అనువాదం చేసిన వివాహ ప్రమాణాలతో స్వసంఘ పౌరోహిత్యంతో చేద్దాం! మీరేమంటారు? "

"ఆహా! మీ ఆలోచనలన్నీ ఆదర్శంగా, హర్షణీయంగా వున్నాయి. వధూవరులకి, పెళ్ళి పెద్దలకి ఒక్కముక్క కూడా అర్థంకాని

ఆ సంస్కృతమంత్ర ప్రమాణాలకంటే అంద రికీ తెలిసే భాషలో చేసుకొనే ప్రమాణాలే మనకు కావాలి! అవి జీవితాంతం గుర్తుం చుకోవచ్చు! బావగారూ! మీ సూచన నాకు చాలా సంతోషాన్ని కలిగించింది"

"సరే! మన చర్చలు ఉభయుల సంపూర్ణ ఆమోదంతో సంతృప్తిగా జరిగాయి. పెళ్ళి ముహూర్తం వీరవరం వెళ్ళి ఆలోచించి నిర్ణ యించి మీకు తెలియజేస్తాం. ప్రభాకరరావు గారూ! పెళ్ళి ఖర్చంతా మేమే భరిస్తాం! ఆ విషయంలో మీరేమీ అభ్యంతరం చెప్పొద్దు! ఇప్పుడు మీ డబ్బు, మా డబ్బు అనే భేదం లేదు. ఎవరు ఖర్చుపెట్టినా మన డబ్బే అనుకుందాం.

మేము ఈ పూటే భోజనాలు చేసి తెనాలి వెళ్ళిపోతాం!"

"అన్నయ్యా రాత్రిపూట వెళ్తారా" అంది రత్నప్రభ.

"కారు ప్రయాణమేగా రత్నప్రభా! గంట న్నరలో వెళ్ళిపోతాం!"

భోజనాలు చేసి బయలుదేరారు. ప్రభాక రరావు, రత్నప్రభ వీడ్కోలు చెప్పారు. రాత్రి పది గంటలలోపునే తెనాలి చేరారు.

అక్కడ దయాసాగర్ కారు కొని డ్రైవర్ని మాట్లాడి వుంచాడు.

మరునాడు ఉదయం బ్రహ్మానాయుడు "వివేకానంధా! నువ్వు, సుజాత మాతో వీర వరం రండి! అక్కడ భార్గవని, విజయసార థిని సంప్రదించి, పెళ్ళి తేదీలు నిర్ణయిం చుదాం" అన్నాడు.

సుజాత, వివేకానంద కూడా వారితో బయలుదేరారు.

★ ★ ★

వీరవరంనుండి ఉదయం ఎనిమిది గంట లకే స్కూటరు మీద చిదంబరం నందిగామ ఎం.ఎల్.ఏ బాలాజీ ఇంటికి చేరాడు. ఇద్దరూ వీరవరంలో పరిణామాలు, విశే షాలు మాట్లాడుకుంటున్నారు.

"ఏమిటోరా! చిదంబరం! ఈ ఏడు మనకు అన్నీ ఎదురు దెబ్బలే తగులుతు న్నాయిరా! బ్రహ్మానాయుడి కోట బద్దలు కొడదాం అనుకున్నాం. అది అడ్డం తిర గింది. మనవాళ్ళని ముగ్గురిని జైలు పాలు చేసుకున్నాం. విశ్వప్రయత్నం చేసి విడిపిం చుకోబోయి తిక్క ముఖ్యమంత్రితో ముక్క చివాట్లుతిన్నాం!

ఎస్.పి. మారి కొత్త ఎస్.పి. వచ్చేసరికి ఎస్.ఐ.గాళ్ళు, కానిస్టేబుళ్లు కూడా మనకి ఎదురుతిరిగారు. ఇప్పుడు మన పవరు మారిపోయింది. ఈసారి మనం ఎన్నికల్లో పోటీచెయ్యటం దండగేమోననిపించు తోంది.

చిదంబరం! ఇప్పుడు మనం నాగరాణిని రెచ్చగొట్టి, పదవి ఆశ చూపెట్టి, ఎం.ఎ ల్.ఏ.గా పోటీకి నిలబెట్టి, బ్రహ్మానాయుణ్ణి దెబ్బతీద్దాం ఏమంటావురా! సలహా చెప్పు"

"ఆలోచన బాగానేవుంది బాలాజీగారూ! ఎత్తులు వెయ్యటంలో అనుభవం వున్న వారు, రాజకీయాల్లో ఆరితేరినవారు గదా! 'గాలికి పోయే పేలపిండి కృష్ణార్పణం' అన్నట్లు మన గెలుపు కష్టం అనుకున్న సీటుని మనకు అనుకూలమైన వాళ్లకిచ్చి శత్రువును దెబ్బతీసే ఆలోచన మీది. చాలా బాగుంది"

"అది సరే చిదంబరం! నాగరాణిని గూర్చి నీ అభిప్రాయమేంటిరా! ప్రయత్నిస్తే మనదారికి వచ్చే మనిషేనా? ఆవిడ తత్వం ఎలాంటిది? ఆ వూరివాడివిగదా! నీకు తెలిసే వుంటుంది గదా! పదవి ఆశ చూపె డదాం! దారికివస్తే పడదాం! ఎలావుంది మన ప్లాను? "

"ఆహాహా! బాలాజీగారూ! మీ బుర్రలోకి అమూల్యమైన ఆలోచన వచ్చిందే! ఇప్పుడు తమరి మనసు నడివయసులో వున్న నాగ రాణిమీదకి మళ్ళిందా? అందులో బాగా డబ్బున్న మనిషని గూడా ఆలోచించారా!

నడివయసులో వున్నా మంచి పలుకుమీ దనే వుందిలే! ఎన్నికలప్పుడు చూశా! మనకి

అనుకూలంగా చేసింది. వోటు మనకే వేసింది. అది నీకు తెలుసుగదరా!"

"బాలాజీగారూ! వోటు మనకే ఏసింది. ప్రచారం మనకే చేసింది. ఎందుకు? బ్రహ్మానాయుడు ఆమెకు శత్రువు. బ్రహ్మానాయుడికి మీరు శత్రువు. శత్రువుకి శత్రువు మిత్రుడు అంటారు గదా! అందుకు మీకు వోటువేసింది. మీ వాగ్ధాటి, వాగ్దానాల జోరు చూసి జనం కూడా మీకు వోట్లేశారు. ఇప్పటి వాతావరణం అలా లేదు.

ఇక ఆమె మీదారికి రావటం గురించి అడిగారుగదా! నిప్పులాంటి మనిషి! చిల్లరవేషాలు ఆమె దగ్గర వేస్తే చెప్పులతో సత్కరిస్తుంది. నేను బి.ఏ. దాకా చదివి అఘోరించాగా. ఆమె నాక్లాసుమేటే! భర్తపోయినా, విలువపోకుండా నిలుపుకుంది. నిజాయితీ గల మనిషి. మర్యాదగా ఆమె దగ్గర మసలుకోండి! ఎం.ఎల్.ఏ.గా నిలబెట్టండి! డబ్బుంది చదువుంది మచ్చలేని మహిళ"

"అయితే అంతే చేద్దాం చిదంబరం! ఇప్పటికీ జిల్లా పార్టీ నా నాయకత్వం కిందనే వుంది. అధికారపార్టీ వాళ్లంతా నా మాటేవింటారు. అందరికీ ముఖ్యమంత్రి మీద మంటగానే వుంది. ఈ సీటు నేను ఎవరికి అంటే వారికే అవుతుంది. నాగరాణిని నిలబెడదాం! ఫోన్‌చేసి నాగరాణితో మాట్లాడతా! ఈ పూట పల్లవపురం నుండి పాపయ్యశాస్త్రి వస్తానన్నాడు. ఎదురు చూస్తున్నానురా!"

"పాపయ్యశాస్త్రితో మీకు పనేంటండీ!"

"ఆయనకి సునంద అనే కూతురుంది గదరా! ఆ పిల్ల నీకు తెలుసుగా! మన చందన్, గోపాల్, కేసు పరిష్కారం చేసినప్పుడు ఉద్యోగం ఇప్పిస్తానన్నాను. కేసుకు డబ్బు కూడా మనం యిచ్చాంగదా! ఆ డబ్బు నీద్వారానే అందిందిగదా!"

"అవునండి కేసు ఎత్తివేసుకుంటానంటే ఇచ్చాం! ఇప్పుడేం పని? "

"ఆ సునంద ఇప్పుడు బి.ఏ.బి.యిడి పాసై వుంది. ఉద్యోగం ఇప్పించమని తిరుగుతున్నాడు. పెళ్ళి సంబంధాలు కూడా చూడమంటున్నాడు. వచ్చినప్పుడల్లా వంద రూపాయిలిచ్చి పంపుతున్నాను. వర్థి డబ్బు కరువు మనిషి"

"పాపం బడుగు బ్రహ్మణ కుటుంబం లెండి! ఉద్యోగం చూశారా? పెళ్ళి సంబంధాలు చూస్తున్నారా? "

"ఉద్యోగం నేనే ఇస్తా! పర్సనల్ అసిస్టెంటుగా వేసుకుంటా! పెళ్ళి సంబంధం తరువాత చూస్తా!"

"ఆహా! గురువుగారూ! ఇక ఆ అమ్మాయికి పెళ్ళి అయినట్లే! పెళ్ళి సంబంధాలు కూడా రావు"

"ఏంరా! పెళ్లెందుకు కాదు? పెళ్ళి సంబంధాలెందుకురావు? "

"ఎందుకా? సావిత్రికి పెళ్ళెందుకుకాలేదు? ముందు పాపారావు, తరువాత మీరు పుణ్యంకట్టుకోబట్టేగదా! ఇప్పుడీ సునంద పనీ అంతేకాకుండా వుంటుందా! ఇక సంబంధాలేం వస్తాయి? "

"ఎందుకు రావురా! ఈమధ్య ఒకటి మంచి సంబంధమే వచ్చింది. ఆ అబ్బాయి ఇంటర్‌మీడియట్ చదివాడు. ఈ నందిగామలోనే వుంటాడు. చుట్టుపట్టు వూళ్లు తిరిగి పౌరోహిత్యం చేసి రెండు చేతులా సంపాదిస్తున్నాడు. మనిషి అందంగా వుంటాడు. లూనామీద తిరుగుతుంటాడు.

ఆ సునంద వాళ్ళ నాన్నతో కలిసి నందిగామ వచ్చినపుడు చూశాడట! వచ్చిందట! నా దగ్గరికి వచ్చి మాట్లాడమని అడిగాడు"

"ఇంకేం! అన్నీ బాగానే వున్నాయిగా! మాట్లాడారా? "

"ఆ అమ్మాయికి పెళ్ళి అయినట్లేనని నువ్వే అన్నావుగదరా! మనలో మనకి దాపరికాలెందుకు? నువ్వన్నది నిజమే! మనసు విప్పి చెబుతున్నా విను!

ఆ వచ్చిన కుర్రాడితో అబ్బాయీ! ఆ సునంద మీద ఒకసారి అత్యాచారం జరి

గింది. ఆ కేసు నా దగ్గరికే వచ్చింది. పాప య్యశాస్త్రికి కొంత డబ్బు పరిహారంగా ఇచ్చి పరిష్కారం చేశాను అన్నా!" అంతే వాడు మళ్లీ కనబడితే ఒట్టు!

"ఇప్పుడు పాపయ్యశాస్త్రి నా దగ్గరికి రాగానే రెండువేలు ఉద్యోగం అడ్వాన్సు పేరుతో అతడి చేతులో పెడతా! ఇక ఆ పిల్ల మన దగ్గర చేరాక నాతోపాటు కారులో తిప్పుకుంటూ మెల్లమెల్లగా నగలు, చీరెలతో నిగనిగలాడించి మంచిగా లాలించి యుక్తిగా నా దారికి తెచ్చుకుంటా! ఆ శక్తి నాకుంది"

"బాలాజీగారూ! అపరకృష్ణులండీ మీరు. పాపపు డబ్బుందిగా! ఎలాగైతేనేం. తరగ నంత సంపాయించారుగా! తగలేసి అనుభ వించండి! తరించండి!

అయితే మీరనుకున్న ఆ సునంద మాత్రం మీకు దక్కదు. ఈఏడు అన్నీ ఎదురుదెబ్బలే అన్నారుగా! ఇదీ అంతే!"

"అదేంటిరా చిదంబరం! శాపం పెడతు న్నావా? "

"గురువుగారూ! నిన్ననే సునందకి, సదా నందానికి, వీరవరం హైస్కూల్లో పెద్దల సమక్షంలో పూలదండల పెళ్ళి జరిగింది. అట్టహాసంగా వూరి జనం అంతా వచ్చారు. పాపయ్యశాస్త్రికి ఇష్టంలేకపోయినా సునంద సదానంధాన్నే చేసుకుంటానన్నదట. భార్గవ, విజయసారథి, ప్రెసిడెంటు జగదీష్ ప్రసాదు పట్టుబట్టి పెళ్ళి చేశారు. బ్రహ్మనా యుడు వూరందరికీ గొప్ప విందు చేశాడు. తెలుగు పండితుడు మురళీకృష్ణ పూలదం డల పెళ్ళి జరిపించాడు.

ఎస్.పి. భరత్‌కుమార్ కూడా పెళ్ళికి వచ్చి ఆశీస్సులందించాడు"

"అయితే ఇందాకటినుంచి ఈ సంగతి చెప్పవేంరా చిదంబరం! నేనేదో వాగుతుంటే తమాషాగా వింటున్నావా? నన్ను ఆటప ట్టించాలనుకుంటున్నావా? అంతా విని నాకు వ్యతిరేకపు కబురు అందిస్తున్నావా? "

"మీరే అన్నారుగా గురువుగారూ! మనలో మనం అని! మనసువిప్పి చెబుతున్నా విను! అన్నారుగా. మీ మనసులో ఏముందో తెలు కోవాలనుకున్నా! మీ దగ్గర నాకున్న చనువు అట్లాంటిది. కాసేపు సస్పెన్సులో పెట్టాలే!"

"సరేలే! ఇంతకీ నాగరాణితో మాట్లాడ దామా? సలహా చెప్పు? "

"ఆమెతో జాగ్రత్తగా మాట్లాడండి! ఇదిగో ఫోన్ నెంబరు"

బాలాజీ డయల్ చేశాడు. అవతల హలో అని మగ గొంతు పలికింది.

"నేను ఎం.ఎల్.ఏ బాలాజీని మాట్లాడు తున్నాను. ఎవరు మాట్లాడేది? "

"నేను కొండయ్యని. ఇది నాగరాణిగారి ఇల్లు"

"ఓహో! నువ్వు కొండయ్యవా! సదానం దంతో కలసి గోపాల్‌ని, పాపారావుని పట్టు కున్నారట! గోపాల్ మా మనిషని నీకు తెలియదా? వాణ్ణి నువ్వెందుకు పట్టుకు న్నావ్! నాగరాణిగారు, మేము ఒకే పార్టీవా ళ్లమని నీకు తెలుసుగదా! పెద్ద వీరుడిలాగా మన మనిషినే ఎందుకు పట్టుకున్నావ్!"

"ఆ గోపాల్‌గాడి సంగతి నాకు తెలియద నుకుంటున్నావా? వాణ్ణేగాదు అట్లాంటి సీనులో వుంటే నిన్ను గూడ పట్టుకుంటా! నాకేం భయంలేదు. నీ మనిషి అట్లాంటి ఎదవ పనికెందుకొచ్చాడు? మా అమ్మగారు అట్లాంటి పన్లకి అసలొప్పుకోరు తెలుసా!"

"అబ్బో! మాటలు జోరుగా వున్నాయే! సరేలే మీ అమ్మగారిని పిలువు"

నాగరాణి వచ్చి ఫోన్ అందుకొని హలో అంది.

"నాగరాణిగారూ! నమస్కారమండీ! నేను బాలాజీని మాట్లాడుతున్నాను"

"నమస్కారం! ఏమిటో చెప్పండి!"

"మీతో మాట్లాడక చాలా రోజులయిం దండీ! మీరు ఫోన్ పెట్టించుకున్నారని తెలి సింది. చిదంబరం నెంబరు చెప్పాడు. ఫోన్ చేశాను"

"సంతోషం!"

"నాగరాణిగారూ! మనకి అసెంబ్లీ ఎన్నికలు దగ్గరపడుతున్నాయండీ! మన రాష్ట్రానికి ఒక పిచ్చి తుగ్లక్ ముఖ్యమంత్రిగా వున్నాడు. నాకూ, అతనికి పడటంలేదు. ఈసారి నేను ఎన్నికల్లో పోటీ చెయ్యాలనుకోవటంలేదు. మన నియోజక వర్గానికి అధికార పార్టీతరపున మీరు పోటీ చెయ్యండి! మీ పేరు జిల్లా పార్టీలో ప్రతిపాదించి ఆమోదింపజేస్తాను. జిల్లా అధికారపార్టీకి నేనే నాయకుడినని మీకూ తెలుసు! మీకు సీటు రావటం ఖాయం! మహిళల ఓట్లు మీకు బాగా పడతాయి. ఆపైన ఈ బాలాజీ బలం వుంది. అధికారపార్టీ బలం వుంటుంది. మీరు తప్పకుండా గెలుస్తారు. మన చిదంబరం కూడా ఇప్పుడు నా దగ్గరే వున్నాడు. మీరేమంటారు? పోటీ చేస్తారుగా!"

"నేను పోటీ చెయ్యను"

"అదేంటండీ! పోటీ చెయ్యనంటారేం? గెలిచే అవకాశం, వున్న సీటు. అటువంటి సీటుకోసం అందరూ ఎగబడతారు. మీరు వద్దంటారేం? అందునా అధికార పార్టీ తరపున పోటీ చెయ్యటం! ఎం.ఎల్.ఏ. అయితే ఎంత విలువో మీకు తెలుసుగా! మీరు చదువుకున్నవారు. ధన బలం వున్నవారు. ఎం.ఎల్.ఏ. అయితే మహిళా ప్రాతినిధ్యం రూపంలో మీకు మంత్రిపదవి కూడా రావచ్చు! అదేవస్తే మీరు మహారాణిలా వెలిగిపోతారు. మీ వైభవం చూసి బ్రహ్మనాయుడికి తలవాలిపోవాలి! మీ పగ తీరుతుంది. నాగరాణిగారూ! పోటీ చేయండి! నా మాట వినండి"

"నేను పలనాటి నాగమ్మని కాను. నాగరాణిని! పగ ఇప్పుడు నా కెవరిమీదాలేదు. పదవి పిచ్చి అసలే లేదు"

అని ఫోన్ పెట్టేసింది.

"అరె! ఇదేంటిరా చిదంబరం! ఈమె ఇలా మారిపోయిందేంరా! ఎం.ఎల్.ఏ. సీటు ఇప్పించి, ఎన్నికల పిచ్చి ఎక్కించి, ముగ్గులోకి దించి, మూడులక్షలు పిండుదామనుకున్నానురా! నేను అన్ని విషయాలు వివరించి చెబితే విని అన్నిటికీ పొట్టి సమాధానాలే చెప్పింది. చివరికి కవితా ధోరణిలో ఆవేశంగా నాలుగు మాటలు విసిరేసింది. ఫోన్ పెట్టేసింది"

"ఆమె బి.ఏ. స్పెషల్ తెలుగు గురువుగారూ! అంత చదువు మీకేదీ!"

"మీ వూరు మనిషని పొగుడుతున్నావా చిదంబరం!"

"పొగడటంకాదు అది నిజం! మీకూ తెలుసు! నిజం ఒప్పుకోవాలి"

"సరేలే! చిదంబరం! ఇంతకీ నువ్వు నందిగామ వచ్చిన పనేమిటి? నువ్వు చెప్పలేదు. నేను అడగలేదు. ఇప్పుడు చెప్పు!"

"చందన్‌ది, మాది ఉమ్మడి కుటుంబమేనని మీకూ తెలుసు! వాడేమో జైల్లో కూర్చున్నాడు. వాడు అప్పుడప్పుడు మీ అనుచరుడుగా తిరిగినా, వ్యవసాయపు పనులు చూసేవాడు. ఇప్పుడు వాడి స్థానంలో కూలి మనిషిని పెట్టాల్సివచ్చిందండీ! లేకపోతే వ్యవసాయం కుంటుబడుతుంది. అయిదువేలు డబ్బు కావాలి! పంటలు అమ్మినపుడు సర్దుతాను"

"మళ్ళీ నువ్వు సర్దేది ఏముందిలేరా? కమలాంబ చందన్‌కి ఇచ్చిన డబ్బు వుందిలే! వాణ్ణి జైలుకు పంపి నిన్ను ఇబ్బంది పెడతామా? తీసుకెళ్లు!"

★ ★ ★

అనూరాధ ఉషాబాలతో కలిసి నాగరాణి ఇంటి ఆవరణలో అడుగుపెట్టింది. ఆ ఇంటికి అనూరాధ రావటం అదే ప్రథమం.

నాగరాణి సంభ్రమంతో "అనూరాధా! రా అమ్మా!" అంటూ సాదరంగా ఆహ్వానించింది. ముగ్గురూ సోఫాలో కూర్చున్నారు.

"అనూరాధా! ఇంటిదగ్గరనుంచేనా రావటం?"

"గ్రంథాలయంనుంచి వస్తున్నాం పిన్నీ!

అక్కడ ఉషాబాల కలిసింది. ఇద్దరం కలిసి ఇటు వచ్చాం!"

"అనూరాధా! విజయసారథితో నీ పెళ్ళి కుదిరిందటగా! ఉషాబాల చెప్పిందమ్మా! చాలా సంతోషంగా వుంది. మనిషి చక్కని వాడు. మనసు నిర్మలమైనది. విద్యావంతుడు. నీకు తగిన వరుడు"

పెళ్ళి కుదిరిందని చెప్పటానికే నీ దగ్గరికి వచ్చాను పిన్నీ!"

"అదే నాకు అమితానందాన్ని కల్గించిందమ్మా! ఎంత మంచిగా ఆలోచించావు! నీదెంత మంచి మనసు! అనూరాధా! భార్గవకి కూడా వివేకానందగారి అమ్మాయితో పెళ్ళి కుదిరిందటగదా! అమ్మాయి బాగుంటుందా? పేరేమిటి? "

"అమ్మాయి అందంగా వుంటుంది పిన్నీ! పేరు రేణుక"

"అనూరాధా! విజయసారథి, భార్గవ ఇద్దరూ వీరవరానికి పట్టిన జాడ్యాన్ని ప్రక్షాళనం చేశారు. ప్రజల్లో ఐక్యత పెంపొందించారు. ఇద్దరూ వీరులు, కార్యశూరులు. వీరవరం ప్రజల అభిమానం చూరగొన్నారు"

విజయసారథి, భార్గవ అప్పుడే నాగరాణి ఆవరణలోకి వచ్చారు. ఇద్దరూ నాగరాణికి నమస్కారాలు చేసి సోఫాలో కూర్చున్నారు.

"పిన్నిగారు మా గురించే ఏదో అంటున్నారు" అన్నాడు భార్గవ.

"మాటల్లోనే వచ్చారు బాబూ! మీ ఇద్దరికి నూరేండ్లాయుష్షు! ఇప్పుడే మీ మాట వచ్చింది. మీ ఇద్దరికీ వివాహాలు కుదిరాయని తెలిసింది.

విజయసారథిబాబూ! మా అల్లుడివి కాబోతున్నావుగదా! సంతోషం! భార్గవ కూడా కొడుకు వరసతో మాకు బంధువుకాబోతున్నందుకు మరీ సంతోషం!"

"అత్తయ్యగారూ! మీరు పెద్దవారు, చదువుకున్నవారు, విజ్ఞతగలవారు, మీకు మాపట్ల వున్న సదభిప్రాయం మాకు మరింత మనోబలాన్ని సమకూరుస్తుంది. నేను, భార్గవగారు మాకు కుదిరిన వివాహాలను గురించి మీకు చెప్పటానికి వచ్చాం" అన్నాడు విజయసారథి.

"పిన్నిగారూ! మీబోటి సహృదయుల సహాయ సహకారాలుంటేనే మా ప్రయత్నాలు సఫలమవుతాయి. బ్రహ్మానాయుడు బాబాయిగారి వంటి పెద్దలు మాకెంతో అండగా నిలిచారు. పట్టుదలతో మేము పనిచేశాం! అనుకున్నది సాధించాం" అన్నాడు భార్గవ.

యువకులిద్దరూ వరసలుపెట్టి పిలుస్తూ, నమ్రతగా, సన్నిహితంగా, మాట్లాడుతుంటే, నాగరాణి హృదయం ఆనందంతో పొంగిపోయింది.

"భార్గవా! మీ ఇద్దరూ ఈ వూరు వచ్చి నాకు పరిచయమైన తరువాత నా మనసు తీరే మారింది బాబూ! మీ ఇద్దరిలో ఏదో వశీకరణశక్తి వుంది. మీరు వివేకవంతులు. మీవల్లనే నాకు మా బ్రహ్మానాయుడు బావపట్ల వున్న ద్వేషం తొలగిపోయింది. మీరిద్దరూ ఆయనకి అతి సన్నిహితులుగా వుంటూనే, ఆయనకి బద్ధవిరోధిగా వుంటున్న నాతో కూడా సన్నిహితంగా వున్నారు. నన్ను గౌరవిస్తూ నాలోని మార్పుకు కారణమయ్యారు.

నేను ఆత్మ పరిశీలన చేసుకున్నాను. నన్ను నేను జయించుకున్నాను. ఇప్పుడు నాకెవరిమీదా ద్వేషంలేదు. ఎవరిని వారు జయించుకోవటం అంటే గొప్ప శత్రువును జయించినట్లేనని బుద్ధ భగవానుడు చెప్పాడు"

"పిన్నిగారూ! మీరు మమ్మల్ని మరీ పొగుడుతున్నారు. అసలు విషయం ఏమిటంటే మిమ్మల్ని చూడగానే మా ఇద్దరికి మీలో ఏదో విశిష్టత వుందనిపించింది. మాటల్లో విజ్ఞత ధ్వనించింది. మీలోని ద్వేషం సకారణమైంది కాదనీ, బ్రహ్మానాయుడుగారి దోషం ఏమీలేదని, విజయసారథిగారు నాకు చెప్పారు. ఇద్దరం ఆలోచించాం!

మీలో మార్పు తేవాలనుకున్నాం. మీతో సన్నిహితం పెంచుకున్నాం. మీలో విజ్ఞత, విశిష్టత వుండబట్టే ఆత్మపరిశీలన చేసుకున్నారు. ఆ గొప్పతనం మీలోనే వుంది" అన్నాడు భార్గవ.

"పిన్నీ! నేను మీ ఇంటికి రావటం ఇదే ప్రథమం. మీ పరివర్తన చూసి జీవితంలో ఎప్పుడూ పొందలేని ఆనందాన్ని ఈ రోజు పొందాను" అంది అనూరాధ.

"అనూరాధా! మీ పెళ్ళి అమరావతిలో జరుగుతుందని ఉషాబాల నాతో చెప్పింది. అమరావతిలో ఎందుకు జరపాలనుకున్నారు? "

"అది మా అత్తయ్య, మామయ్య కోరిక అన్నారు పిన్నీ! వారి పెళ్ళి అమరావతిలోనే జరిగిందట! అలానే కొడుకు పెళ్ళి కూడా అక్కడే జరగాలని వారికి కోరికవుందట! మా అమ్మానాన్నా సరేనన్నారు. మా పెళ్ళి అమరావతిలో జరిగితే అది మరొక విశేషం కూడా అవుతుంది వినండి!

ఇరవై అయిదేండ్లనాడు మా అమ్మానాన్నా నవదంపతులుగా విహారయాత్రకు అమరావతి వెళ్లారట! అక్కడ ఆ రోజే మా అత్తయ్య మామయ్యల పెళ్ళి జరుగుతుంటే చూశారట. వారెవరో తెలియకపోయినా ఆ వధూవరుల సాటిలేని సౌందర్యానికి మెచ్చి బహుమతి ఇచ్చి, అక్షంతలు వేశారట! అలా చేసినా, వారి వివరాలు వీరికిగాని, వీరి వివరాలు వారికిగాని తెలియవట! తెలియజేసుకోలేదట! మా అమ్మానాన్నా అప్పుడప్పుడు అమరావతి ఆడపడుచు అంటూ పేరు కూడా తెలియని ఆనాటి పెళ్ళి కూతుర్ని గుర్తుచేసుకోవటం నాకు తెలుసు. ఆ వధూవరులది మరపురాని సౌందర్యం అనేవారు.

మొన్న మా పెళ్ళి విషయాలు మాట్లాడుకోవటానికి మా అమ్మానాన్నా వారి వూరు వెళ్లారుగదా! తీరా చూస్తే వారేవీరు. ఇరవై అయిదేళ్ళనాటి అమరావతి వధూవరులు. వారిని వీరు, వీరినివారు గుర్తుపట్టి ఆశ్చర్యంలో, ఆనందంలో మునిగిపోయారు. అదీ పిన్నీ విశేషం!"

"ఆహా! యాదృచ్ఛికంగా జరిగేవి కొన్ని ఎంత విచిత్రంగా వుంటాయో!" అంది శోగరాణి.

"అత్తయ్యగారూ! హైద్రాబాదునుండి నేను వీరవరం వచ్చేటప్పుడు రైల్లో మీ అన్నయ్యగారు, మురళీకృష్ణగారు కలిశారు. పరిచయం చేసుకొని ఎన్నో విషయాలు మాట్లాడుకున్నాం. ఈ కథ బ్రహ్మానాయుడుగారు చెప్పారని మురళీకృష్ణగారు నాకూ ఆ కథ చెప్పారు"

"ఎవరో అపరిచిత వ్యక్తులు అమరావతిలో తమ పెండ్లి రోజున బహుమతి ఇచ్చారని, అక్షింతలు వేశారని మా అమ్మానాన్నా చెబుతూ వుండేవారు. నేను మురళీకృష్ణగారు చెప్పింది విన్నాక ఆ అపరిచిత వ్యక్తులు బ్రహ్మానాయుడుగారు, భారతీదేవిగారేనని తెలుసుకున్నాను. అప్పుడప్పుడు వారు గుర్తుచేసుకొని వారు అమరావతి ఆడపడుచు మా అమ్మేనని తెలుసుకున్నాను.

నాకు తెలిసిన ఆ విషయం నేనెవరితోను చెప్పలేదు. మా అమ్మానాన్నలకు కూడా చెప్పలేదు. బ్రహ్మానాయుడుగారిని నా అపరిచిత మేనమామగా ఊహించుకున్నాను. అదేవిధంగా వరస కలిపి శాంతమ్మగారిని, వైదేహిగారిని అమ్మమ్మా అని సంబోధించాను. రాఘవేంద్ర తాతయ్యతో సన్నిహితం పెంచుకున్నాను.

అయితే అనూరాధతో నా పెళ్ళి కుదురుతుందని మాత్రం ఊహించలేదు. కలవారి అమ్మాయి గనుక ఏ విదేశీ ఉద్యోగస్థుడినో అల్లుడుగా చేసుకుంటారని అనుకున్నాను. కాని అనూరాధ నన్నే కోరుకుంది. అది నేను అనుకోనిది. అనూరాధ అమ్మానాన్నల కోరిక కూడా అదేనని తరువాత తెలిసింది"

"ఏ విదేశీ అల్లుడైనా నీ సాటి రాగలడా విజయసారథిబాబూ! డబ్బు సంపాదించ

వచ్చు! సౌందర్యం, ఆత్మసౌందర్యం సంపాదించలేరు! అవి సంపాదించే వస్తువులు కావు!" అంది నాగరాణి.

★ ★ ★

విజయవాడ బస్ స్టేషన్‌లో వీరవరం వెళ్లే బస్‌కోసం నాగరాణి, ఉషాబాల ఎదురు చూస్తూ కూర్చున్నారు. వీరవరం నుండి తల్లి, కూతురు ఉదయం ఏడు గంటలకే బయలుదేరి ఫస్టు బస్‌లో విజయవాడ వచ్చారు.

బంగారు నగలషాపుల్లో, బట్టల షాపుల్లో కావలసినవి ఖరీదు చేసుకొని ఒకటిన్నరకి బస్‌స్టేషన్‌కి వచ్చారు. రెండు గంటలకి బస్ వీరవరానికి బయలుదేరుతుంది. బస్ ఇంకా రాలేదు.

ఆ వీరవరం బస్ పాయింటు దగ్గరే బెంచిమీద ఒక యువకుడు కూర్చొని వున్నాడు. ఒక సూట్‌కేసు, ఒక ఎయిర్ బేగ్‌తో వచ్చాడు. ఎయిర్‌బేగ్ నుండి ఒక నీళ్లబాటిల్ తీసి కొన్ని నీళ్లు తాగి మళ్లీ బాటిల్ బేగ్‌లో పెట్టాడు. ఒకసారి లేచి దగ్గరలో వున్న బోర్డుమీద టైంటేబుల్ చూసి వచ్చాడు.

పట్టుకుంటే మాసిపోయేలా వున్న మృదు శరీరంతో, మంచి రంగుతో అందంగా వున్నాడు ఆ యువకుడు.

కొత్తచోట ఎప్పుడూ ఎవరితోనూ ఎక్కువగా మాట్లాడకుండా మౌనంగా వుండే నాగరాణికి ఆ యువకుడి తీరు, సౌకుమార్యం ప్రత్యేకంగా వుండటంతో పలకరించాలనిపించింది.

"ఏ వూరు వెళ్లాలి బాబూ!"

"నేను వీరవరం వెళ్లాలండీ!"

వీరవరం వెళ్లాలనేసరికి నాగరాణి ఆసక్తిగా "ఎక్కణ్ణుంచి వస్తున్నావు? " అని అడిగింది.

"అమ్మా! ఆయన పసిఫిక్ మహాసముద్రం పక్కనున్న భూగోళంమీదనుండి, వినువీధికెగిసి, బంగాళాఖాతం పక్కనున్న భూమ్మీద దిగి విజయవాడ వచ్చారు" అంది ఉషాబాల చిరునవ్వుతో.

"ఏమిటా మాటలు పాపా? ఎవరో తెలియకుండా వేళాకోళమా? " అంది నాగరాణి కూతురువైపు చిరుకోపంతో చూసి.

"వేళాకోళం కాదమ్మా! ఆయన అన్నది నేను విన్నది అదే!"

"ఆయన అన్నదెప్పుడు? నువ్వు విన్నదెప్పుడు? ఆయన తెలుసా నీకు? "

"మనిషి తెలియదు! మాట తెలుసు!"

"ఇది మరీ బాగుంది పాపా! నాకేం అర్థంకావటంలేదు"

"మీ అమ్మాయి అన్నది నిజమేనండీ! ఆ మాటలు నేనే అన్నాను. మనిషి తెలియక పోవటం, మాట తెలియటం రెండూ నిజమే!"

ఇలా అంటూవుండగానే అనూరాధ అక్కడికి వచ్చింది.

"విజయానందా! ఎంత సేపయిందిరా వచ్చి! నాకు ఫోన్ చెయ్యలేదేం? "

"బస్‌లో వచ్చి నిన్ను ఆశ్చర్యంలో ముంచుదామనుకున్నాను. నేను బస్ స్టేషన్‌లో వుంటానని నీకెవరు చెప్పారక్కా? "

"నాగార్జున నాకు ఫోన్‌చేసి ఈ టైములో బస్‌స్టేషన్‌లో వుంటావని చెప్పాడు. వెంటనే కారు తీసుకొని బయలుదేరాను" అని నాగరాణివైపు చూసి, "పిన్నీ మీరు విజయవాడ వచ్చే పనివుంటే నాకు చెప్పలేదేం? ముగ్గురం కారులో వచ్చేవాళ్లంగదా"

"మన వూరికి బస్సు సౌకర్యం కొత్తగా వచ్చిందిగదా! ఒకసారి దాన్ని వినియోగించుకోవాలనిపించింది. బస్సులో వచ్చాం!"

"పిన్నీ! వీడు మా మామయ్య కొడుకు విజయానంద" అని పరిచయం చేస్తూవుండగానే విజయానంద నాగరాణికి నమస్కారం చేశాడు.

అనూరాధ ఉషాబాలని పరిచయం చేయబోయింది.

"తెలుసు! ఉషాబాల!" అన్నాడు నవ్వుతూ

విజయానంద.

"అక్కా! నేనే ముందు గుర్తుపట్టాను. ఆయన సూట్‌కేసుమీద అడ్రసు వుంది. పేరు నాకు తెలుసు గదా! ఆరోజు ఫోన్లో ఆయనన్న మాటలు గుర్తుపెట్టుకున్నాను. అవే మాటలు ఇంతకుముందు అప్పజె ప్పాను. ఆయనకీ నేనెవరో తెలిసిపో యింది. అమ్మకి మాత్రం అంతా చిత్రంగా వుంది. ఇంతలో నువ్వు వచ్చావు!" అంది ఉషాబాల.

"సారీ ఉషాబాలా! ఫోన్లో నీ గొంతు మరీ సన్నగా వినిపించింది. ఎవరో చిన్నమ్మాయి ఫోను తీసిందనుకున్నాను. జోక్‌గా అలా అన్నాను"

"సారీ చెప్పటం ఎందుకులెండి! జోక్‌గా అన్నదేగా!"

"పిన్నీ! కారులో వెళ్దాం రండి! రోడ్డు పక్కన వుంది"

అందరూ వచ్చి కారులో కూర్చున్నారు. డ్రైవరు కారు స్టార్టు చేశాడు.

★ ★ ★

భార్గవ, రేణుకల పెళ్లికోసం హైద్రాబాదు లోని వనస్థలిపురం కమ్యూనిటీహాలులో, అందంగా వివాహవేదిక నిర్మించారు.

హైద్రాబాదులోని రేణుక కొలీగ్స్‌కి, క్లాసు మేట్సుకి, అక్కడి బంధువులకి, మిత్రులకి అందుబాటుగా వుంటుందని పెళ్లి హైద్రాబా దులోనే ఏర్పాటు చేశారు.

ఉభయుల బంధుమిత్రుల సమక్షంలో, సంస్కరణ పద్ధతిలో, స్వసంఘ పౌరోహి త్యంతో, అట్టహాసాలకు, ఆర్భాటాలకు పోకుండా, బాజాభజంత్రీల హోరులేకుండా, ఆదర్శంగా, నిరాడంబరంగా భార్గవ, రేణు కల పెండ్లి జరిగింది.

వివేకానంద కాలేజీ మిత్రుడు మహర్షి ధర్మపాల వివాహానికి ఆచార్యుడుగా వుండి, త్రిపురనేని రామస్వామిగారు రచించిన తెలుగు ప్రమాణాలను వధూవరులతో చేయించి, చివరలో 'సప్తపది' ప్రమాణాలతో ఏడడుగులు వేయించి, వివాహ కార్యక్రమం పూర్తిచేయించారు.

పెళ్లికి వచ్చిన పెద్దలు ముఖ్యమంత్రి, ఎస్.పి. భరత్‌కుమార్, రాఘవేంద్రస్వామి గారు, రాజ్యలక్ష్మీదేవిగారు, నారాయణరావు గారు వధూవరుల్ని ఆశీర్వదిస్తూ ప్రసం గాలు చేశారు.

వీరవరం పోలీసుస్టేషను పరిధిలోని గ్రామాలన్నిటినీ అక్రమ కార్యకలాపాల నుండి విముక్తిజేసి, అరాచకశక్తుల్ని కట్టడి చేసి, ప్రశాంతత నెలకొల్పినందుకు ముఖ్య మంత్రి భార్గవని అభినందించాడు.

వివేకానంద ముఖ్యమిత్రుడు దయాసాగ ర్‌కి నాగార్జున ఒక్కడే కొడుకు. ఆడపిల్లలు లేరు. వివేకానంద కూతురునే తన కూతు రుగా భావించి, వధూవరులకి ఒక కారు బహూకరించాడు.

ఈడూ జోడుగా వున్న ఆ వధూవరులకి బంధువులు, మిత్రులు ఆశీస్సులు, అభినంద నలు అందజేశారు.

★ ★ ★

దేవనగరంలో సావిత్రి తన యింటి వసా రాలో వుంది. తల్లి కోటమ్మ రామయ్యగారిం టికి వెళ్లింది.

"సావిత్రీ! నీ తమ్ముడి చదువు ఖర్చుల కోసం బ్రహ్మానాయుడుగారు ఈ డబ్బు నీకి వ్వమన్నారు" అని కానిస్టేబుల్ రవీంద్ర సావిత్రికి మూడువందల రూపాయలు అందించాడు.

"బాబాయిగారి రుణం ఎలా తీర్చుకో వాలో" అంది సావిత్రి.

"ఆయన నీకు రుణంగా ఇవ్వటంలేదు సావిత్రీ! మానవతా దృష్టితో యిస్తున్నారు. సునందకి అలానే చదువు చెప్పించారట"

"సునంద అదృష్టవంతురాలండీ! సాహ సంతో నిర్ణయం తీసుకొని మంచి భర్తని ఎంచుకుంది" అని సావిత్రి "రవీంద్రగారూ కూర్చోండి! మిమ్మల్ని నిలబెట్టే మాట్లాడుతు న్నాను. నాది మర్యాదకాదు. ఈ మంచం

మీద కూర్చోండి! మా ఇంట్లో కుర్చీలు లేవని మా అమ్మ ఇదివరకే మీకు చెప్పిందిగా!"

"ఫరావాలేదులే! ఆరోజు మా భార్గవ కూడా అరుగుమీదనే కూర్చున్నాడుగా! అరుగే బాగుంది" అని అరుగుమీద కూర్చున్నాడు.

"సునందని అదృష్టవంతురాలంటున్నావుగా సావిత్రీ! నీకు మాత్రం వయసు మించిపోయిందా? నువ్వూ పెళ్లిచేసుకోవచ్చుగా! నీ తమ్ముడి చదువు కూడా పూర్తికావచ్చిందిగదా! వాడికి ఉద్యోగం బ్రహ్మానాయుడుగారు, భార్గవ చూస్తారు"

"రవీంద్రగారూ 'పేదవాడి పెండ్లాం వాడకంతటికీ వదినె' అని సామెత ఒకటి వుంది. నేను పేదవాడి పెండ్లాన్ని కాకపోయినా, పేదవాడి కూతురిని! పెళ్లీ పెటాకులూ లేకుండా చెడిపోయినదాన్ని. నన్ను చేసుకోవటానికి ఎవరొస్తారండీ! మీరు ఎగతాళిగా అంటున్నారా? "

"సావిత్రీ! నేనుగాని, మా భార్గవగాని, నీలాంటి వాళ్లని ఎగతాళి చెయ్యం! భార్గవ మానవతావాది. వాడు స్త్రీలని ఎగతాళి చేసినా, అవమానకరంగా మాట్లాడినా సహించడు. వాడి బాట, నా బాట ఒకటే!"

"రవీంద్రగారూ! భార్గవగారిని మీరు 'వాడు' అంటున్నారు. ఆయన మీకు పై ఆఫీసరుగదా" అని సావిత్రి సందేహంగా అడిగింది.

"భార్గవ నా క్లాసుమేటు సావిత్రీ! ఇద్దరం ఒకేసారి బి.ఎస్.సి. పాసయ్యాం. వాడికి ఎస్.ఐ. ఉద్యోగం వచ్చింది. నాకు రాలేదు. కానిస్టేబుల్‌గా చేరాను. పోలీసుస్టేషన్‌లో వున్నంతసేపు భార్గవ నా పైఆఫీసరే! అక్కడ ఎస్సార్ అంటాను. ఇంటికి వచ్చాక ఏరా! అంటే ఏరా! అనుకుంటాం! మా యింట్లోనే వుంటాడు. మా అమ్మ భార్గవని కన్నకొడుకులాగే చూస్తుంది. మా స్నేహం బయట అందరికీ తెలియదు"

"రవీంద్రగారూ! మన్నించండి! మీ ఇద్దరి స్నేహం తెలియక అడిగాను"

"సావిత్రీ! నీ పెళ్లి విషయం నేను ఎగతాళిగా అనలేదు. అపార్థం చేసుకోవద్దు! నువ్వు పెళ్లి చేసుకోవటం తప్పులేదు"

"మీరు ఎగతాళిగా అనలేదేమోకాని సావిత్రిని చేసుకుంటావా? అని ఎవరినైనా అడిగితే అది ఎగతాళిగానే భావిస్తారు. నేను పదిమందికీ తెలిసిపోయిన పతితని. పాపపంకిలంలో పడి బయటికి వచ్చినదాన్ని"

"పాపపంకిలంలో కావాలని పడినదానివి కాదు. పడదోయబడినదానివి! బయటపడి ప్రక్షాళనం చేసుకున్నదానివి! అది అందరికీ తెలిసిన విషయమే సావిత్రీ! నిన్నెవరూ తప్పుపట్టలేరు"

"అయినా మచ్చపడినదాన్ని! అది మాయనిమచ్చ!"

"సావిత్రీ! చదువు, చక్కదనం, సంస్కారం వున్నదానివి. నీ గత జీవితాన్ని పరిగణించకుండా గతం గతః అని ఎవరైనా నిన్ను పరిణయమాడాలనుకుంటే ఏమంటావు? వద్దంటావా? "

"రవీంద్రగారూ! మీరడిగిన ప్రశ్న ఎలా వుందంటే భగవంతుడు అనేవాడు ఉండి, ప్రార్థించకుండానే ప్రత్యక్షమై, నీకు ఏం కావాలో కోరుకో అంటే నువ్వేమంటావు అన్నట్లుంది. అటువంటి ఊహాలోకంలో నేను విహరించలేనండీ!"

"ఆహా! ఎంత చక్కగా మాట్లాడావు సావిత్రీ! శాస్త్రిగారి చదువు నీకు వంటబట్టింది. ఆయన నీకు చదువు ఎంత బాగా చెప్పారో నీ మాటల్లో తెలిసింది. సరైన అవకాశం వుండి చదివిస్తే ఎంతో పైకొచ్చే దానివి. జరిగిందేదో జరిగింది. దాన్ని మర్చిపో! నేను, భార్గవ నీకు అండగా వుంటాం! నేను నీకు మంచి సంబంధం చూస్తాను. నీ గత జీవితాన్ని పరిగణనలోకి తీసుకోనివాడినే చూస్తాను. నేను, భార్గవ నీ పెళ్లి తప్పక జరిపిస్తాం!"

"దండాలు బాబుగారూ! బాగుండారా?

ఎంత సేపయింది వచ్చి? " అంటూ సావిత్రి తల్లి కోటమ్మ వచ్చింది.

"బాగానే వున్నాను కోటమ్మగారూ! బ్రహ్మనాయుడుగారు నీ కొడుకు చదువు ఖర్చులకోసం డబ్బు పంపారు. నన్ను ఇచ్చి రమ్మంటే వచ్చాను. వయసులో చిన్న వాణ్ణి. చేసే పోలీసు ఉద్యోగం కూడా చిన్నదే! పెద్దవారు నాకు దండాలెందుకు పెడతారండీ!"

"వయసులో సిన్నయినా మీది పెద్ద మనసు అయ్యగారూ! ఆ మొదనష్టపు కేసులో ఇరుక్కున్న సావిత్రిని మీ పోలీ సోరు ఎంత బాగా సూశారో నాకు తెలుస య్యగారూ! రవీంద్రగారు, యస్సైగారు ఎంతో మంచోరని మా పిల్ల జెప్పింది బాబు గారూ! మీకు సేతులెత్తి మొక్కితే తప్పేంటి? "

"కోటమ్మగారూ! మీకొక విషయం చెప్ప టానికి ఈ రోజు మీ ఇంటికి వచ్చాను. నేను వస్తుంటే చూసి బ్రహ్మనాయుడుగారు డబ్బు నా చేతికిచ్చారు. మీరు ఇంటిదగ్గరలేరు. సావిత్రితో మాట్లాడ్తూ కూర్చున్నాను"

"నేను రామయ్యగారింటికెళ్లాను బాబు గారూ! కబురు సేత్తే ఎంటనే వచ్చేదాన్నేగా! ఇప్పుడు జెప్పండి!"

"రేపు నా పుట్టినరోజు. సావిత్రిని తీసు కొని మీరు తప్పకుండా మా ఇంటికి రావాలి. భార్గవగారి పెళ్లి అయిన సంగతి మీకు తెలుసుగా! తెనాలి అత్తగారింటి దగ్గ రనుండి భార్గవగారు భార్యతో కలిసి వస్తారు. భార్గవగారు కూడా సావిత్రిని, మిమ్మల్ని తప్పకుండా పిలవమన్నారు. తప్పకుండా వస్తారుగదూ! పెద్దవారు మీకే చెప్పాలని ఇంతకుముందు సావిత్రికి చెప్ప లేదు"

"అంతగా మీరు, యస్సై బాబుగారు ఆద రంగా పిలిస్తే రాకుండా వుంటామా బాబు గారూ! అట్టాగే వత్తాం!"

"ఈ అభాగ్యులమీద మీరు, భార్గవగారు ఎంతో ఆదరణ చూపిస్తున్నారు. మేం అదృ ష్టవంతులం" అంది సావిత్రి.

"అభాగ్యుల్ని సభాగ్యులుగా మార్చటం లోనే నాకు, భార్గవకి ఆనందం వుంది. మీ అమ్మగారు, నువ్వు తప్పకుండా వస్తారు గదూ!"

"తప్పకుండా వస్తాం! భార్గవగారి భార్యని కూడా చూడొచ్చు! సాదరంగా ఆహ్వానించి నందుకు కృతజ్ఞతాభినందనాలు!"

★ ★ ★

"కళ్యాణం వచ్చినా, కక్కువచ్చినా ఆగదు" అని గ్రామీణ ప్రజల్లో ఒక సామెత వుంది. ఈ సామెత కొంచెం మొరటుగా వుందని పించవచ్చు! ఎందుకంటే కళ్యాణం శుభ కార్యం! కక్కు అనారోగ్యసూచకం!

కాని ఒక్కొక్కసారి ఊహించనంత వేగంగా కళ్యాణాలు జరుగుతాయి! వాటి పోలిక కక్కువచ్చిన విధంగా అనూహ్యంగా జరగటంవలన గ్రామీణులు అలా పోల్చి సామెత చెప్పారు.

బ్రహ్మనాయుడికి బద్ధవిరోధిగామారిన నాగరాణిలో మళ్లీ ఇంతమార్పు వస్తుందని ఎవరూహించారు? విజయసారథి మీద జరిగిన దాడివల్లనైతేనేం! విజయసారథి, భార్గవ ఆమెతో పెంచుకున్న సాన్నిహిత్యం వల్లనైతేనేం నాగరాణి ఆత్మపరిశీలన చేసు కుంది. అనుచిత మనుకున్న ద్వేషం తొల గించుకుంది. ఇది అనూహ్యంగా జరిగిందే! ఇంతకంటే అనూహ్యంగా ఉషాబాల పెండ్లి కుదిరింది. ఆ గ్రామీణుల సామెత నిజమ యింది.

భారతీదేవి, బ్రహ్మనాయుడు, నాగరాణి ఆవరణలోకి వచ్చారు. అనుకోకుండా ఆ దంపతులు తన ఇంటికి రావటంతో నాగ రాణి ఆనందసంభ్రమాలతో ఉక్కిరిబిక్కిరి అయింది.

"రండి బావా! అక్కయ్యా రా!" అంటూ సగౌరవంగా ఎదురేగి ఆహ్వానించింది. ఇద్దరూ హాల్లోకి వచ్చి సోఫాలో కూర్చు

న్నారు.

"నాగరాణీ! ఉషాబాల ఏదీ? " అన్నాడు బ్రహ్మానాయుడు.

"ఉదయమే అనూరాధ ఇక్కడికి వచ్చింది బావా! అక్కాచెల్లెలు కలిసి గ్రంథాలయానికి వెళ్లారు"

"ఈమధ్య ఇద్దరూ బాగా జంటగా తిరుగుతున్నారు నాగరాణీ! ఇద్దరిదీ ఒకేమాట, ఒకేబాట" అంది భారతీదేవి నవ్వుతూ.

"అవునక్కయ్యా! ఆ ఇద్దరినీ చూస్తుంటే ఆనందంగా వుంది. ఇంతకాలం అంత మూర్ఖంగా ఎందుకు ప్రవర్తించానా అనిపిస్తోంది."

"గతాన్ని వదిలేద్దాం నాగరాణీ! నీతో ఒక ముఖ్య విషయం మాట్లాడాలనివచ్చాం" అన్నాడు బ్రహ్మానాయుడు.

"ఆ విషయమేంటో చెప్పండి బావా!"

"వివేకానంద కొడుకు విజయానంద నీకు విజయవాడలో పరిచయమయ్యాడని అనూరాధ చెప్పింది. మన ఉషాబాలకి తగిన వరుడు! నీకు యిష్టమైతే, అనూరాధ పెళ్లితోపాటు ఉషాబాలని అతనికిచ్చి పెళ్లి చేద్దాం! ఆలోచించుకో"

"వివేకానందగారికి, విజయానందకి యిష్టమైతే నాకేం అభ్యంతరం లేదు బావా! మంచి సంబంధం. ఆరోజు విజయవాడలో చూడగానే నాకే ఉషాబాలకి తగిన వరుడు అనిపించింది. ఇప్పుడు మీ సూచన నాకు ఆనందం కల్గించింది బావా!"

"వివేకానందకి కూడా మనతో వియ్యమందటం ఆనందమే! వాళ్ల అంగీకారంతోనే నేను నిన్ను అడిగాను. ఉషాబాలకి కూడా ఇష్టమేనని అనూరాధ చెప్పింది. నాగరాణీ! 'శుభస్యశ్రీఘ్రం' అని పెద్దలన్నారు గనుక అనూరాధ పెండ్లితోపాటు అమరావతిలోనే చేద్దాం! వివేకానంద నా మాట జవదాటడు. ఏమంటావు? "

"ఇంత బాధ్యత తీసుకొని స్వంత కూతురుతోపాటు చేస్తానని మీరంటే ఇంకా నేనేమంటాను? మీరెలా చేసినా నాకిష్టమే!"

అప్పుడే ఉషాబాల, అనూరాధ గ్రంథాలయంనుండి వచ్చారు. కొండయ్య భార్య మణి సంభాషణంతా వింది. ఉషాబాల రాగానే "ఉషాబాలా! నీ పెళ్లి కుదిరింది. అబ్బాయి పేరు విజయానంద"

"మణీ! అది మాకు ముందే తెలుసు! ఇక మన ఉషాబాల, విజయానంద ఇండియా నుండి వినువీధికెగిసి, పసిఫిక్‌మహాసముద్రం పక్కనున్న భూగోళంమీద దిగుతారు" అంది అనూరాధ నవ్వుతూ.

★ ★ ★

రవీంద్ర పుట్టిన రోజు సందర్భంగా ఆ ఇంట్లో రేణుక, భార్గవ, అనూరాధ, ఉషాబాల, విజయసారథి వున్నారు. అద్దె ఇల్లు కొంచెం పెద్దదే! భార్గవ కూడా ఆ ఇంట్లోనే వుండేవాడు కనుక పెద్దదే తీసుకున్నాడు. అందరూ హాల్లో కూర్చున్నారు.

"అమ్మా! ఉన్న విషయం నీకు వివరంగా దాయకుండా చెప్పాం! అన్నిటికీ నువ్వు యిష్టపడితేనే అనుకున్నది చేసేస్తాం! నీకు యిష్టంలేకపోతే ఆ పని నేను చెయ్యను. కాని నాకు యిష్టంలేని పని కూడా నువ్వు కావాలన్నా చెయ్యను" అన్నాడు రవీంద్ర తన తల్లి రమాబాయితో.

"ఆంటీ! రవీంద్ర చెప్పిన అన్ని విషయాలు సత్యమే! ముందు నువ్వు ఆ అమ్మాయిని చూడు! నీకు నచ్చితే ఆ అమ్మాయితో రవీంద్ర పెళ్లి జరిపించే బాధ్యత నాది" అన్నాడు భార్గవ.

"ఆంటీ! మీరు పెద్దవారు. జీవితానుభవం వుంది. రవీంద్ర పెళ్లి విషయంలో పెద్ద మనసుతో ఆలోచించండి! అతను ఒక ఇంటివాడవుతాడు. మీకు తోడుగా మంచి కోడలు వస్తుంది" అన్నాడు విజయసారథి.

"బాబూ! నేను ఇల్లు వదిలి బయటికి వచ్చేదాన్ని కాదుగదా! అన్నీ మీరే ఆలోచించండి! నా కొడుకు ఇష్టాన్ని నేను కాదంటానా? జాగ్రత్తగా ఆలోచించమన్నాను.

ఒకసారి అమ్మాయిని చూడాలన్నాను. అంతే!"

"మీరన్నది సమంజసమే ఆంటీ! రవీంద్ర న్నయ్యా! మేమందరం చూడాలి. ఎలా చూపెడతారు? ఎప్పుడు చూపెడతారు?" అన్నది రేణుక.

"రేణుకా! అనుకున్నవి అన్నీ అనుకూలంగా జరిగి తీరుతాయమ్మా! చూస్తూ వుండు" అన్నాడు విజయసారథి.

మాటల్లోనే సావిత్రి, కోటమ్మ అక్కడికి వచ్చారు. సావిత్రి ఆ ఇంట్లో అడుగుపెడుతూనే, తనకు పరిచితులైన భార్గవకి, రవీంద్రకి, విజయసారథికి సవినయంగా నమస్కారాలు చేసింది.

తరువాత "రవీంద్రగారూ! మీకు జన్మదిన శుభాకాంక్షలు" అంది.

"థాంక్యూ సావిత్రీ!" అన్నాడు నవ్వుతూ.

"బాబులూ! మీ అందరికీ దండాలండీ!" అంది కోటమ్మ.

తరువాత భార్గవ సావిత్రిని రవీంద్రతల్లి రమాబాయికి పరిచయం చేశాడు. సావిత్రి ఆమెకి పాదాభివందనం చేసింది.

భార్గవ సావిత్రికి అనూరాధకి, రేణుకకి, ఉషాబాలకి పరిచయం చేశాడు.

సావిత్రిని చూశాక రమాబాయి ఇందుకే మావాడు అంతగా పట్టుబట్టి కలవాలనుకున్నాడు. మాట తీరు కూడా బాగుంది అనుకుంది.

ముందుగా రమాబాయి అందరికీ టీ తయారుచేయటానికి సిద్ధమైంది. సావిత్రి అది గమనించి వెంటనే చొరవగా వంటగదిలోకి ప్రవేశించి రమాబాయిని కూర్చోబెట్టి టీ తయారుచేసింది. రేణుక స్వీటు, హాటు అందరికీ అందజేసింది.

వచ్చిన కొద్దిసేపటికే పనిలో పాలుపంచుకున్న సావిత్రి చొరవకు రమాబాయి లోలోన మెచ్చుకుంది.

రవీంద్ర సావిత్రిని చేసుకోవాలనుకున్న నిర్ణయం సావిత్రికి తెలియదు. ఏదో సంబంధం తనకు చూస్తానన్నాడు అనుకుంది.

అందరూ టీ తాగిన తరువాత చర్చ ప్రారంభించారు.

"సావిత్రీ! నీ పెళ్లి విషయం చర్చించాను గదా! ఏమాలోచించావు? పెళ్లి చేసుకుంటావా? సంబంధం చూడమంటావా?" అన్నాడు రవీంద్ర.

"రవీంద్రగారూ! మీరు సహృదయులు గనుక నా మేలుగోరి సలహా చెప్పారు. కాని అది జరిగే పనేనా? మీ అందరి దయవల్ల ఇప్పుడు ప్రశాంతంగా బతుకుతున్నాను. ఇలా బతకనివ్వండి! ఆశల పల్లకిలో కూర్చొని ఊహాస్వర్గంలో ఊరేగలేనండీ! మీరు నాకు మంచి పెళ్లి సంబంధం చూస్తానన్నారు. కాని మీలాగా మంచి మనసుతో ఆలోచించే ఆదర్శపురుషుడు ఈ తెలుగునాడులో మీకు దొరకడు. ఇది కలి కాలం"

"ఎక్కడా దొరకడంటావేం అమ్మాయ్? నీ ఎదురుగానే వుంటేను! వాడే నిన్ను చేసుకునేది! రవీంద్ర అలాంటి ఆదర్శపురుషుడే! వాడికింకా పెళ్లి కాలేదు. వాణ్ణి చేసుకోవటం నీకిష్టమేనా?" అంది రమాబాయి.

సావిత్రి నివ్వెరపోయింది. నోటమాట పెగల్లేదు.

"సావిత్రీ! ఆంటీ అన్నది నిజమే! నిన్ను, ఆంటీని ఒప్పించగలమనే నమ్మకంతో మీకు చెప్పకుండానే నేను, విజయసారథిగారు, బ్రహ్మానాయుడుగారు పెళ్లి ఏర్పాట్లు గూడా జేశాం. హైస్కూల్లో వివాహవేదిక సిద్ధంగా వుంది. పూలదండల పెళ్లి జరిపిస్తాం! నిన్ను పెళ్లికూతుర్ని చేసే బాధ్యత రేణుక, అనూరాధ తీసుకుంటారు. ఇంకేం మాట్లాడకు" అన్నాడు భార్గవ.

"ఇదంతా నిజమేనా బాబుగారూ! నమ్మలేకపోతున్నా! మేం అంత పుణ్యం జేసుకున్నామా?" అంది కోటమ్మ.

"సావిత్రీ! మౌనంగా వున్నావేం? రవీంద్ర

గారితో పెళ్లి నీకిష్టమేనా? ఏమంటావు?" అన్నాడు విజయసారథి.

"కోరకుండానే వరాలిచ్చిన దేవుళ్లు మీరు" అని చేతులు జోడించింది.

ముందే సిద్ధంచేసి వుంచిన వివాహవేదికపై సావిత్రికి, రవీంద్రకి తెలుగు పండితుడు మురళీకృష్ణ తెలుగు పెళ్లి ప్రమాణాలు చేయించి, పూలదండలు వేయించాడు. సప్తపది ప్రమాణాలు చేయించి, మంగళగీతం పాడించాడు.

అసలైన ఆదర్శ వివాహం ఇదే! అన్నారు వీరవరం ప్రజలు.

★ ★ ★

అమరావతి ఆలయప్రాంగణంలో విజయసారథి, అనూరాధల వివాహానికి అందంగా వేదిక నిర్మించారు.

భార్గవ, రవీంద్ర ఒకరోజు ముందే అమరావతి వచ్చి అక్కడ తమ మిత్రుడు ఇనస్పెక్టర్ విక్రమ్ సహకారంతో పెళ్లి ఏర్పాట్లు చక్కగా సమకూర్చారు. భార్గవలాగే ఇనస్పెక్టర్ విక్రమ్‌కూడా నిజాయితీపరుడు, వినయశీలి. గూండాలపట్ల చండశాసనుడు. అమరావతి పట్టణంలో అరాచకశక్తుల్ని అదుపుచేసి, ప్రశాంతత నెలకొల్పి ప్రజల అభిమానం చూరగొన్నాడు.

వీరవరం నుండి బంధువులు, మిత్రులు అందరూ ప్రత్యేకంగా అలంకరించిన రెండు బస్సులలో ఆనందోత్సాహాలతో అమరావతి వచ్చారు.

అంధకపురం నుండి విజయసారథి చిన్న మేనమామ రమణారావు, ఆయన తల్లితండ్రులు అమరయ్య, గంగాభవాని, రమణారావు కొడుకు మనోహర్ అమరావతి వచ్చారు. మనోహర్‌కి హైద్రాబాదు అగ్రికల్చరల్ యూనివర్సిటీలో ఉద్యోగం వుంది.. కనుక రమణారావు కూడా ఎక్కువగా హైద్రాబాదులో వుండేవాడు. విజయసారథి ఎక్కువగా మేనమామ ఇంటికి వస్తూపోతూ అగ్రికల్చరల్ యూనివర్సిటీలో చదివాడు.

పెళ్లి వేదిక దగ్గర భార్గవ ఇనస్పెక్టర్ విక్రమ్‌కి విజయసారథిని, బ్రహ్మానాయుడు కుటుంబ సభ్యుల్ని పరిచయం చేశాడు.

అమరావతిలో పెళ్లి గనుక బంధుమిత్రులు పరిమితంగానే వచ్చారు. కొందరు పెద్దలు శుభాకాంక్ష సందేశాలు పంపారు. దూరాభారం కనుక-రావటానికి వీలుపడని వారు సందేశాలు పంపారు.

బ్రహ్మానాయుడి కాలేజి మిత్రుడు, తెలుగు లెక్చరరు, వక్త, కవి, మహర్షి ధర్మపాల వివాహాలకు ఆచార్యుడుగా వచ్చాడు. ధర్మపాల దయాసాగర్‌తో కలిసి కారులో వచ్చాడు.

మహర్షి ధర్మపాల ముందుగా విజయసారథి, అనూరాధల వివాహకార్యక్రమం ప్రారంభించాడు. ప్రథమంగా బ్రహ్మానాయుడు కన్యాదాతగా ప్రమాణం చేశాడు. సంస్కృతంలో నుండి తెలుగులోకి అనువాదం చేసిన మంత్రప్రమాణాలను ఆచార్యుడు శాస్త్రోక్తంగా వధూవరులతో ప్రమాణాలు చేయించాడు. అనంతరం సప్తపది. అది చివరిది. వధూవరులు జంటగా ఏడడుగులు నడుస్తూ ప్రమాణాలు చేస్తారు. అలా చేయించి మంగళగీతం ఆలపించి వివాహకార్యక్రమం ముగించాడు ఆచార్యుడు ధర్మపాల.

తరువాత ఉషాబాలకి, విజయానందకి అదే పద్ధతిలో వివాహం జరిపించాడు. ఉషాబాల పెళ్లికి బ్రహ్మానాయుడే కన్యాదాతగా ప్రమాణం చేశాడు. సప్తపదితో ఆ వివాహ ప్రమాణాలు చేయించి మంగళగీతంతో ముగించాడు.

వివాహాల అనంతరం మహర్షి ధర్మపాల తన ప్రసంగంలో భారతీయ వివాహాల్లో ప్రమాణాల గురించి సప్తపది ప్రాముఖ్యం గురించి వివరించాడు.

ఈ వివాహాలకు వచ్చిన పెద్దలందరికి నా వందనాలు.

మానవ జీవితంలో వివాహం మహోత్కృష్టమైనదని కవిరాజు త్రిపురనేని రామస్వామి అన్నారు.

పెళ్లి సమయంలో వధూవరులతో చేయించే ప్రమాణాలు వారికి తెలిసిన మాతృభాషలో వుంటే వారి భావి జీవితంలో పెళ్లి రోజున చేసుకున్న ప్రమాణాలు గుర్తు చేసుకోవటానికి ఉపయోగపడతాయి. ప్రమాణాలు ఏ భాషలో వున్నా వాటి పవిత్రతకి, ప్రాముఖ్యతకి భంగం కలగదు. అర్థం మారదు.

మనకు తెలిసినా తెలియకపోయినా సంస్కృతంలోనే ప్రమాణాలు చేయించాలనటం మన మాతృభాషని కించపరుచుకోవటమే!

భారతీయ సాంప్రదాయం ప్రకారం వివాహం పవిత్రబంధం

"పెండ్లి అంటే నూరేండ్లపంట" అని పెద్దలు అన్నారు. అది ఎంతో అనుభవంతో చెప్పిన తెలుగు సూక్తి. గుర్తుంచుకోవాల్సిన మంచి మాట.

భార్యాభర్తలు పరస్పరం ప్రేమానురాగాలతో జీవితయాత్ర సాగిస్తూ భావితరాల దంపతులకు మార్గదర్శకులు కావాలి. ఆ మంచి నడవడి తరువాత తరం వారికి పరంపరగా కొనసాగాలి. అది మన భారతీయ సంస్కృతి.

'అర్థాంగి' అనే పదం భార్యకి పర్యాయపదంగా వుంది. అది భార్యాభర్తల అన్యోన్యతకి, సమానత్వానికి, సమానబాధ్యతలకి నిదర్శనంగా వుంది. ఆ పేరులోని సార్థకతని గుర్తించి దంపతులు జీవితయాత్ర సాగిస్తే అది యెంతో ఆనందమయంగా సాగుతుంది.

'ఆదిదేవుడు' అని భారతీయులు పూజించే శంకరుడు అర్థశరీరాన్ని పార్వతీదేవికి ఇచ్చి అర్థాంగిని చేశాడని పురాణాల్లో వుంది. అర్థాంగి అనే పదం అలా వచ్చిందే! వివాహబంధం దంపతులకు పవిత్రమైన అనుబంధంగా కలకాలం సాగాలనే, ఆ ఆది దంపతుల పురాణ కథ మనకు సందేశాన్ని అందిస్తుంది.

ఆ పురాణ కథల్లోని అతిశయోక్తుల్ని, అద్భుత కల్పనల్ని, పక్కనబెట్టి అందులోని సందేశాన్ని గమనించాలి,

"పురాణాలు చరిత్రలు కావు. కాని అవి చారిత్రక సత్యాల్ని ప్రతిబింబిస్తాయి" అని భారతీయ మేధావులు భావిస్తున్నారు.

వివాహంలో సప్తపదికి విశేష ప్రాముఖ్యం వుంది.

బ్రహ్మచర్యం వీడి గృహస్థాశ్రమం స్వీకరించిన నవదంపతుల జీవితయాత్ర తొలి అడుగులు సప్తపది. ప్రమాణాలు చేస్తూ నడిచే ఏడడుగులు.

ఆహారం కోసం మొదటి అడుగు, ఆరోగ్యకరమైన బలంకోసం రెండవ అడుగు, ఆర్థికపుష్టికోసం మూడవ అడుగు, ఆనందకరమైన సుఖజీవనం కోసం నాలుగవ అడుగు, అయిదవ అడుగు సంతానంకోసం, ఆరవ అడుగు రుజువర్తనకోసం, అన్యోన్యతకోసం ఏడవ అడుగు. శాస్త్రోక్తంగా ప్రమాణాలు చేయిస్తూ నేను వధూవరులతో వేయించటం మీరందరూ తిలకించారు.

పెండ్లి ప్రమాణాలలోని విశిష్టతని, సప్తపది ప్రాముఖ్యతని ఈ వధూవరులు గుర్తించి ఆచరిస్తారని ఆశిస్తూ వీరి జీవితం ఆనందమయంగా సాగాలని ఆశీర్వదిస్తున్నాను అని ధర్మపాల తన ప్రసంగాన్ని ముగించాడు

అంతటితో వివాహ కార్యక్రమాలు పూర్తి అయ్యాయి.

★ ★ ★

విజయానంద, ఉషాబాల, ఆరువారాల తర్వాత ఇండియానుండి అమెరికాకి బయలుదేరారు. హైదరాబాదు బేగంపేట విమానాశ్రయానికి వచ్చారు.

వీడ్కోలు చెప్పటానికి ముఖ్యబంధువులం

దరూ విమానాశ్రయానికి వచ్చారు. గంట ముందే చెకింగు చెయించుకుని లగేజీలు అప్పగించి బయట కూర్చుని మాట్లాడుకుం టున్నారు.

"ఇద్దరూ ఇండియాని మర్చిపోకండి" అన్నాడు మహర్షి ధర్మపాల నవ్వుతూ.

"'జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ' అన్నసూక్తిని మేము మర్చిపోము మహర్షి మామయ్యా" అన్నాడు విజయానంద.

"బ్రహ్మానాయుడు మామయ్యా! ఈసారి మేము ఇండియా వచ్చేసరికి మీరు మన నియోజకవర్గానికి శాసన సభ్యులుగా పోటీ చేసి గెలిచి ఈ రాష్ట్రానికి వ్యవసాయమంత్రిగా వుండాలని మా కోరిక" అన్నాడు విజయానంద.

"విజయానందా! చాలా పెద్ద కోరికే వుందిరా నీకు"

"అది పెద్దకోరికేం కాదు మామయ్యా. ఈ మంత్రులుగా వున్నవాళ్లంతా మీకన్నా గొప్పవాళ్లా? మీకు చదువుంది. నిజాయితీ వుంది. వ్యవసాయానుభవం వుంది. ఈ ప్రాంతపు ప్రజల అభిమానం వుంది. మీరు ఇండిపెండెంటుగా పోటీ చెయ్యండి. అభ్యుదయ భావాలుగలవారంతా మిమ్మల్ని బలపరుస్తారు. మీరు తప్పక గెలుస్తారు" అన్నాడు విజయానంద.

"నేను అధికారపార్టీవాణ్ణి కాదుగదరా ఇండిపెండెంటుగా గెలిస్తే మాత్రం మంత్రి పదవి ఎందుకిస్తారు? "

"మామయ్యా! ఇప్పుడు ముఖ్యమంత్రిగా వున్న వ్యక్తి మంచి నిజాయితీపరుడు. పరిపాలనాదక్షుడు. మళ్లీ ఆయనే ముఖ్యమంత్రి అవుతాడు. సమర్థతవున్న వారైతే, నిజాయితీ వున్నవారైతే ఇండిపెండెంటుగా గెలిచినవారికైనా ఆయన పిలిచి పదవి ఇస్తాడు. ఇప్పుడున్న విద్యాశాఖామాత్యుడు ఇండిపెండెంటుగా గెలిచినవాడే కదా మీరు గెలిస్తే 'కర్షకబ్రహ్మ' అని కీర్తించబడుతున్న మిమ్మల్ని తప్పకుండా వ్యవసాయశాఖకు మంత్రిని చేస్తాడు" అన్నాడు విజయసారథి.

"అదే జరిగితే ఈ రాష్ట్రంలో అన్నదాతలకి ఇక సమస్యలే వుండవు. సంపూర్ణ జల వనరులతో, విద్యుత్ యంత్రాల వెలుగుతో, ఈ తెలుగునాడు సస్యశ్యామలం అవుతుంది. పాడిపంటలతో ప్రతిగ్రామం భాగ్యసీమ అవుతుంది. అలా జరగాలని మా కోరిక మామయ్యా" అన్నాడు విజయానంద.

ఇలా మాట్లాడుకుంటూ వుండగానే విమానం బయలుదేరే టైమైంది. నాగరాణి, రత్నప్రభ ఉషాబాలకి సజల నయనాలతో వీడ్కోలు చెప్పారు. అనూరాధ ఉషాబాలని కౌగిలించుకుని కంటతడి పెట్టింది. తాత, నాయనమ్మలు, కుటుంబసభ్యులు అందరూ వీడ్కోలు చెప్పారు. పెద్దలందరికీ నమస్కారాలు చేసి ఇద్దరూ లోపలికి వెళ్లిపోయారు.

కొంతసేపటికి విమానం వినువీధికెగసి వెళ్లిపోయింది.

మహర్షి ధర్మపాల ఒక పాకెట్ బ్రహ్మానాయుడి చేతిలో పెట్టి "ఆదర్శవంతుడైన కర్షకబ్రహ్మకి అనుంగు మిత్రుడి కానుక" అన్నాడు.

బ్రహ్మానాయుడు పాకెట్ విప్పాడు. అది పుస్తకం. చేతితో చక్కగా రాసిన 'కర్షకబ్రహ్మ' అనే అక్షరాలతో వుంది.

"బ్రహ్మానాయుడూ! నేను కవిని, పండితుణ్ణి, రచయితని. అమరావతినుండి వెళ్లిన తర్వాత ఆరు వారాల్లో మొన్నటివరకు నీ జీవితకథని తీసుకుని నవలగా రచించాను. సమాచారమంతా మురళీకృష్ణ ద్వారా, వివేకానంద ద్వారా సమగ్రంగా సేకరించాను.

ప్రతి కర్షకుడికీ నీ జీవితం ఆదర్శం కావాలి. ప్రతి యువకుడూ విజయసారథి లాగా, భార్గవలాగా నిజాయితీతో దీక్షాపరులై ఉద్యోగ విధులు నిర్వహించాలి. వీరులై విజృంభించి అరాచకాన్ని అణగదొక్కాలి"

# ఏరినముత్యాలు

* అందాన్ని వెదుకుతూ మనం ప్రపంచ ప్రదక్షిణ చేసినా, అది మన అంతర్యంలో లేనపుడు ఎక్కడా కనిపించదు.

– ఎమర్సన్

* మనం టన్నుల కొద్దీ ఉపదేశాలిస్తాము, మణుగులకొద్దీ వింటాము, కానీ గ్రహించేది మాత్రం అణుమాత్రమే.

– అల్జర్

* మంచి స్వభావం ఎప్పుడూ సౌందర్యం తాలూకు లోటును భర్తీ చేస్తుంది. కానీ సౌందర్యం మంచి స్వభావమనే లోటును భర్తీ చేయలేదు.

– ఎడిసన్

* బల్లదుల దోషం పొరబాటులగును, దుర్బలుల పొరపాట్లు దోషములగును.

– చిలకమర్తి

* తొంభైతొమ్మిది మంది ధర్మవర్తనులను చూసినప్పటికంటే, పశ్చాత్తప్తుడైన ఒక పాపిని చూసినపుడు దేవతలకు ఎక్కువ ఆనందం కలుగుతుంది.

– మేరీ కారెలీ

* దూషణ ఆకాశంవైపు విసిరిన రాయిలాంటిది. అది విసిరినవాని నెత్తిమీద పడటం సంభవం.

– వాల్టర్ స్కాట్

* మానవునికి తెలిసిన అన్ని రోగాల్లోనూ చికిత్సకి లొంగనిది అహంభావం.

– హెన్రీవార్డ్ బీచర్

* చీకటిని చూసి భయపడిన పిల్లవాణ్ణి సులభంగా క్షమించవచ్చు. అసలు బాధంతా వెలుగును చూసి భయపడే మనుషులతోనే.

– ప్లాటో

* సహాయపడగల హృదయమున్న వాడికి విమర్శించే హక్కు ఎప్పుడూ ఉంటుంది.

– లింకన్

* నువ్వు కోపంతో ఉన్న ప్రతి నిముషంలోనూ అరవై సెకండ్ల ఆనందాన్ని కోల్పోతున్నావన్నమాట.

– ఇర్వింగ్ హాఫ్‌మాన్

* తనమీద తనకే జాలి కలిగినవాడికి వేరే శత్రువులంటూ ఉండనక్కర్లేదు. అలాంటివాళ్లు ఈ ప్రపంచంలో పనికొచ్చే పని ఏదీ చేయలేరు.

– హెలెన్ కెల్లర్

* పాండిత్యం కాదు, దాన్ని ఉపయోగించే కళే జ్ఞానం.

– స్టీల్

* ఎవరు అకుంఠిత దీక్షాపరులో వారినే విజయం వరిస్తుంది. ఎవరు భీరువులో వారిని జీవితం హరిస్తుంది.

– నెహ్రూ

సేకరణ: జిల్లేళ్ళ బాలాజీ

# చతుర ప్రపంచం

## పెంచిన ప్రేమ

కన్న ప్రేమకన్నా పెంచిన ప్రేమ గొప్పదంటారు. ఈ విషయం జంతువులకి కూడా ఆపాదించి చూస్తే చాలామంది కుక్కల్ని, పక్షుల్నీ పెంచేవారు, అవి పోతే బెంగపెట్టుకుని తల్లడిల్లేవారు కూడా వుంటారని చెప్పొచ్చు అందులోనూ మనుషులకన్నా అవి విశ్వాసంగా వుండడం, కొట్టినా, తిట్టినా




నోరు మూసుకుని పడి వుండడం కూడా కొంతకారణం కావచ్చు వాటి పట్ల మనం చూపే ప్రేమకు. ఉదయపూర్ గ్రామంలో పనిపాటలు చేసుకుంటూ సమిత దాస్ నివశిస్తోంది. ఆమెకు ఇద్దరు పిల్లలు. అయినా తనకు ముగ్గురుపిల్లలు అని చెబుతుంది. మూడవపిల్లగా తాను ప్రేమతో పెంచుతున్న కోతిపిల్లని చూపుతుంది. అంతవరకూ బాగానే వుంది. కానీ మరింత విచిత్రమైన విషయమేమంటే ఆమె తన పిల్లలతో పాటు ఆ కోతికి కూడా తనవద్ద పాలు ఇస్తుంది.

ఆమె ఒళ్ళో కూర్చుని ఆ వానరం పాలు తాగుతుంటే గ్రామస్థులంతా ఆశ్చర్యానందాలకి లోనవుతున్నారు. సమిత పేరు ఊరంతా మారుమోగుతోంది. ఆ చిన్నారి కోతి కథను ఆమె ఇలా చెప్పింది.

"మూడు నెలల కిందట హఠాత్తుగా మా గ్రామంపై కోతులమూక దాడిచేసింది. గ్రామస్థులంతా కలిసి వాటిని తరిమికొట్టారు. అప్పుడే కోతిపిల్ల తల్లిదగ్గరనుండి జారిపడిపోయింది మా దోడ్లో దానిని ఇంట్లోపెట్టాను. కోతులకు ఓ కఠినమైన కట్టుబాటు వుంది. ఏ కోతి అయినా పొరపాటున మనుషులకు చిక్కిన సందర్భాలలో అటుపై ఆ కోతులన్నీ దానిని వెలివేస్తాయి. అటుపై తల్లికి దూరంగా దాని బతుకు అది బతకవలసిందే"

అప్పటినుంచీ సమిత ఆ వానరాన్ని కన్న బిడ్డలా చూస్తూ దానికి 'ఓల్డీ' అనే పేరు పెట్టింది. దాని స్వంతానికి చక్కటి

దుస్తులున్నాయి. పౌడరువంటి సౌందర్య సాధనాలు సహితం సమిత దానికిచ్చింది. ప్రస్తుతం ఆ కోతిపిల్ల తన పెంపుడు తల్లి చెప్పిన ప్రకారం నడుచుకుంటూ ఆ కుటుంబంలో ఓ సభ్యురాలుగా కలిసిపోయింది. ఇంట్లోవారు చెప్పే మాటలన్నీ అది అర్థం చేసుకుంటుంది.

## వైస్రాయ్ లాడ్జ్

ఢిల్లీలోని రాష్ట్రపతి భవనంగా పేరుపొందిన భవంతిని బ్రిటిష్‌వారి కాలంలో వైస్రాయ్‌లాడ్జి అనేవారు. అప్పట్లో దీనిలో బ్రిటిష్ వైస్రాయ్ నివశించేవాడు. ఆ అందమైన భవనం రైసినా కొండపై ఉంది. ఇండియాగేట్‌ను గంభీరంగా నిలబడి చూస్తున్నట్లు ఉంటుంది. తొలి ప్రపంచయుద్ధంలో మరణించిన భారతీయ సైనికుల జ్ఞాపకార్థం ఇండియాగేట్ నిర్మించబడింది.

1929లో అద్భుతంగా రూపకల్పన చేసి నిర్మించబడిన భవనం రాష్ట్రపతి భవనం. మన రాజధాని అప్పట్లో కలకత్తాలో ఉండేది. పిమ్మట రాజధానిని ఢిల్లీకి మార్చడం జరిగింది. తదాది రాష్ట్రపతి భవనం రాష్ట్రపతి అధికార గృహమైంది. అప్పట్లో ఆ భవనం నిర్మాణానికి అయిన ఖర్చు 12,53,000 డాలర్లు. ఇండియా, ఇస్లాం, యూరోపియన్ పద్ధతులను రంగరించి చక్కగా రూపుదిద్దుకొన్న సుందరమైన భవనం.

130 హెక్టార్ల విస్తీర్ణంలో 340 గదులతో రూపొందించబడింది. ఆంగ్లేయుల కాలంలో ఆ భవనంలో 2 వేలమంది సేవకులు భవనం నిర్వహణకొరకు పనిచేసేవారు. దానికి పడమరగా నేత్రోత్సవం చేసే మొఘల్ ఉద్యానవనం ఉంది. చివర ఇంగ్లీషు వైస్రాయ్ అయిన లార్డ్ మౌంట్‌బాటెన్ 418 మంది తోటమాలులను, సేవకులను ఆ ఉద్యానవనాన్ని తీర్చిదిద్దడానికి నియమించాడు. వారిలో 50 మంది బాలురు కూడా ఉన్నారు. ఆ పూలవనంలోని చెట్లపై వాలే పక్షులను పారదోలడమే వారి ఉద్యోగం. అత్యంత సుందరమైన గులాబీలకు ఆ వనం పెట్టింది పేరు. అతి అరుదైన నల్లగులాబీ సహితం ఆ రోజావనంలో విలసిల్లుతోంది.



# పలినముత్యాలు

* కోపం వచ్చిన వానికి కొంచెంసేపు దూరంగా ఉండు. అసూయాపరునకు మాత్రం ఎల్లప్పుడూ దూరంగా ఉండు.

  – ఒక సామెత

* నీ శత్రువును జాగ్రత్తగా గమనిస్తుండు, ఎందుకంటే నీలోని లోపాలను ప్రథమంగా గుర్తించేది వారే.

  – యాంటిస్ థీమిస్

* చీకటిలోనే తారలు కనిపిస్తాయి. అలాగే విచారంలోనే సత్యాలు కనిపిస్తాయి.

  – వెయివ

* మనం భోగభాగ్యాలతో ఉన్నప్పుడు మనల్ని మిత్రులు గుర్తిస్తారు. మనం కష్టాల్లో ఉన్నప్పుడు మనం మిత్రుల్ని గుర్తిస్తాం.

  – చరణ్ కొలిన్స్

* తెలివితక్కువగా ప్రవర్తించినందుకు సిగ్గుపడనక్కర్లేదు. ఆ ప్రవర్తనను త్వరగా ముగించనందుకే సిగ్గుపడాలి.

  – హోరేస్

* నవ్వులాంటి గొప్ప వరానికి దూరమయ్యేటంతటి తెలివిగలవాడివి కావద్దు.

  – ఎడిసన్

* స్వార్థపరునిలోని మంచి గుణాలు సముద్రంలో కలిసిన నదుల్లా తమ ఉనికిని కోల్పోతాయి.

  – రో

* పుట్టే ప్రతిబిడ్డా భగవంతుడింకా మానవుని పట్ల నిరాశ చెందలేదనే సందేశం తీసుకువస్తాడు.

  – ఠాగూర్

* అందచందాలు చూపులను ఆకర్షిస్తాయి. కానీ ప్రతిభ ఆత్మను కైవసం చేసుకుంటుంది.

  – అలెగ్జాండర్ పోప్

* స్వశక్తిని నమ్ముకున్నవారే దేన్నైనా సాధించగలరు.

  – వర్జిల్

* భగవంతుడు ఒక గొప్ప కళాకారుడుగా ఈ ప్రపంచాన్ని నిర్మించాడు. అందుచేత కళాకారులనుండే ప్రపంచం ఎంతైనా నేర్చుకోవల్సింది ఉంది.

  – జార్జ్ బెర్నార్డ్ షా

* మనసు, బుద్ధి, హృదయం ఈ మూడూ కలిసిందే లలితకళ.

  – జాన్ రస్కిన్

* మానవ జీవితంలో ప్రవర్తన అనేదే ప్రధాన పాత్ర వహిస్తుంది.

  – మాథ్యూఆర్నాల్డ్

సేకరణ: జిల్లేళ్ళ బాలాజీ

# 'ఆరోజెప్పుడు?' పై సమీక్షలు

డిసెంబర్ చతురలో ప్రచురితమైన కల్లూరి శైలబాల నవల 'ఆరోజెప్పుడు?' పై మాకందిన ఉత్తమ సమీక్షలు

## హెచ్చరిక

*(మొదటి బహుమతి రూ.100/- పొందిన సమీక్ష)*



వ్యాపారస్తులమధ్య ఎత్తులు, పైఎత్తులు, కక్షలు కార్పణ్యాలు, నిరంతరం సంఘర్షణ, ఒకరినొకరు అధిగమించేందుకు ఎటువంటి కుయుక్తులకైనా సిద్ధపడే తత్వం, మధ్యదళారీల అవకాశవాదం, శత్రువులు మిత్రులుగా, స్నేహితులే శత్రువులుగా మారే పరిస్థితులు - వీటన్నింటికీ అతీతంగా తల్లీబిడ్డల ప్రేమానుబంధాలు, మమకారం కసాయివాడికైనా అంతర్లీనంగా వుండే మానవత్వం ఇవన్నీ హృద్యంగా మలచబడి, ఎప్పటికైనా కుటుంబసంబంధాలే ప్రామాణికమని, కుల, మత, వర్గ, జాతి వివక్షలు ప్రేమ, మానవత్వం ముందు బలాదూర్ అని చాటి చెప్పిన - కల్లూరి శైలబాల 'ఆరోజెప్పుడు?' నవల ఎంతో బాగుంది. ఇటీవలికాలంలో రియల్ ఎస్టేట్ బిజినెస్‌లో రాజకీయ ధోరణులు, గూండా మనస్తత్వాలు, అమాయకులు బలైపోతున్న విధానం, రౌడీయిజం పైచేయి, అపార్ట్‌మెంట్ కల్చర్, సామాన్య మానవుడు సొంత ఇంటిని సమకూర్చుకోవాలన్న తపనతో, తొందరపాటుతనంతో చెప్పుడు మాటలు విని, మధ్యదళారీల చేతుల్లో మోసపోతున్న వైనం చూస్తూనే వున్నాం. పత్రికల్లో చదువుతూనే వున్నాం. తెరవెనుక వ్యాపారం ఎలా వుంటుందో, ఎన్నెన్ని చీకటి కోణాలుంటాయో విజేష్, నీరవ్‌షాల పాత్రల ద్వారా రచయిత్రి కళ్లకు కట్టినట్లు చెప్పారు. గుజరాత్ భూకంపం నేపథ్యంగా శారదమ్మ, రాఘవయ్యల కలయిక, ఘోర విపత్తులు సంభవించినపుడు ప్రాణాలు కాపాడుకోవడానికి ప్రతీ మానవుడూ పడే తపన, ధనిక, పేద వర్గాలకతీతంగా తమ ఆత్మీయులకోసం ఆరాటం, బాధ అందరికీ ఒకటేనని తెలియజెప్పిన తీరు, క్షతగాత్రుల సహాయక శిబిరాల్లో విభిన్న మనస్తత్వాల మేళవింపు, చక్కని కథాసంవిధానంతో రాయబడిన ఈ రచనలో ప్రతి పాత్రా సజీవమై కళ్లముందు కదలాడింది. ఇద్దరు బిల్డర్లమధ్య ఆర్కిటెక్ట్‌లు, ఇంజనీర్లు ఏవిధంగా బ్లాక్‌మెయిల్‌కు గురికాబడతారో వారి కుటుంబాలపై ఎలా ప్రభావం చూపుతుందో ఆనందస్వరూప్ పాత్ర చదువుతుంటే ఎవరికైనా కళ్లు చెమరు

స్తాయి. సుశీల, అహ్మద్‌ల టీనేజ్ ప్రేమ చివరకు నీరవ్‌షా, విజేష్ అన్నదమ్ములేనని తెలియడం, శాంతి నీరవ్‌షా కూతురు కావడం, దినేష్‌తో అమెరికాలో ప్రేమ, బ్లడ్ గ్రూపులు ఒకటే కావడం సినిమాటిక్‌గా సాగినా, నవల ఆద్యంతమూ ఉత్కంఠభరితంగా సాగి వసంత్‌లాంటి చీడపురుగుల వల్ల మంచివాళ్లు సైతం శత్రువుల్లా ఎందుకు మారతారో, వారిపట్ల జాగరూకత వహించమని రచయిత్రి హెచ్చరిస్తూ కుల, మత, విచక్షణకన్నా ప్రేమ, వాత్సల్యం, అనురాగం, మానవత్వమే చివరకు గెలుస్తుందన్న నీతిని చెబుతూ సర్వమానవ సౌభ్రాతృత్వం సాధించే 'ఆరోజెప్పుడు' వస్తుందోనని రచయిత్రి పడ్డ తపనకు, చక్కని సందేశాన్నిచ్చి మంచి అనుభూతిని మిగిల్చిన రచనకు, ప్రచురించిన మీకు హృదయపూర్వక అభినందనలు.

– *పి.వి. సోమశేఖర్*
కాకినాడ - *533 003*

## సందేశాత్మకం

*(రెండవ బహుమతి రూ.75/– పొందిన సమీక్ష)*

కొన్ని కొన్ని సంఘటనలు, దృశ్యాలు చూస్తే, వింటే లేదా అనుభవమైనప్పుడు స్పందించి సందేశాత్మకంగా రాస్తే ఆ నవల ఆపకుండా చదివింపచేస్తుందనడానికి ఒక ఉదాహరణ 'ఆరోజెప్పుడు?' గుజరాత్ భూకంపం మూలంతో, రియల్ ఎస్టేటు బిజినెస్ మోసాలు, కుతంత్రాలతో ఎన్నో మలుపులున్న ఒక సాధారణ ఇతివృత్తాన్ని పాత్రల ఉదాత్త వ్యక్తిత్వాలతో, సంఘటనల బిగువుతో పదాల పరుగుతో అక్కడక్కడా ఆగి తరిచి ఆలోచింపజేసే జీవితసత్యాలతో (మతాలన్నీ ఒకటేనని అనుకుని నమ్మి ఆచరించడానికి మధ్య చాలా తేడా వుంది) సరైన న్యాయం చేసి సమాజానికి "డబ్బుపిచ్చితో పోగేసిందంతా ప్రకృతి విలయతాండవానికి సర్వస్వం కోల్పోయినపుడు కులమతాలకి స్వస్తి చెప్పి సర్వమత సమానత్వంతో అంతా ఒకటేనన్న మానవతతో మెలిగినట్లు ఎప్పుడూ కలసిమెలసి కష్టసుఖాలు పంచుకోవాలన్న" మంచి సందేశాన్నిస్తూ రచయిత్రి పరితల్ని ఆలోచింపచేశారు. ఎన్నుకున్న నవలా వస్తువుపై రచయిత్రికి ఎనలేని విశ్వాసం, నమ్మకం వుండబట్టే ఉత్కంఠ నింపుకున్న కథాకథనం, నాటకీయ సన్నివేశ చిత్రణ, పాత్రల ప్రవర్తన, పరుగులుతీసే శైలి అలరించాయి. అంతేకాదు, సాహిత్యం నిర్మించేటప్పుడు ఏంరాయాలి? ఎందుకు రాయాలి? ఎవరికోసం రాయాలి? అనుకుని రాసిన నవల ఇది. అందుకే మంచి, మానవత్వం కూడబెట్టండి. ఆస్తిసంపద కాదు అంటూ ఉద్బోధించే మాతృమూర్తిలోని తీపి మనసుని శారదమ్మ పాత్రలో నిర్వచించారు. కాబట్టే శిలలో చెమ్మ వున్నట్టుండే గూండా బిల్లరైన షాలోని మానవత్వం పూర్తిగా వికసించింది. అందుకు రక్త సంబంధం సహకరించింది. అలాగే విజేష్ కూడా. ఈ ప్రపంచంలో మానవుల్లోని భావాలు, ప్రభావాలు పసిగట్టి తీర్చిదిద్దే మానవాతీతశక్తి ఒక్క అమ్మకే స్వంతం అన్నది నవల్లో అంతర్లీనంగా సాగింది. ప్రేమికుడైన అహ్మద్ చేతల మనిషి గాబట్టి ప్రేయసిని పొందగల్గాడు. ఇక మిగతావి నవల నడకకి బాగా తోడ్పడ్డాయి. ఈమధ్య కాలంలో చతురలో వెలువడ్డ నవలల్లో 'ఆరోజెప్పుడు' ఒక ఉత్తమ నవల.

– **చందు తులసి**
చిలకపాలెం

## సమయోచితం

*(మూడవ బహుమతి రూ.50/– పొందిన సమీక్ష)*

మంచితనం, మానవత్వం ప్రాతిపదికగా

నడచిన కొన్ని జీవితాల కథ ఈ నవల. మత రాజకీయాలతో అల్లకల్లోలం అయిపోతున్న నేటి మన సమాజ వాతావరణంలో మంచి ఆలోచనలనూ, ఆదర్శజీవనశైలినీ కలిగిస్తూ సమయోచిత కథా నేపథ్యంతో వచ్చిన ఈ ప్రయత్నం ప్రశంసనీయం. పాత్రలచుట్టూ అల్లిన సందర్భాలూ, సంఘటనలూ కొంత సినిమాటిక్‌గా వున్నా మంచి సందేశం వుండటం వలన రాణించింది.

వసంత్‌కుమార్ వంటి విలన్లు ఇప్పుడు ప్రతీచోటా ఎదురవుతున్నారు. నిజంగా మంచితనంతో నడిచేవారికి రక్షణ లేనే లేదు. దుర్మార్గులకే కాలం అనుకూలిస్తున్నది. అయినప్పటికీ ఇందులోని రాఘవయ్యా, శారదమ్మ, నీరవ్, విజేష్, సుశీల ఇలా అన్ని పాత్రల ద్వారా మనకు ఒక ఆశావాద దృష్టిని కలిగించింది ఈ నవల. ఇది చాలా గొప్ప అవసరం.

ఎవరికైనా ఏదైనా చేయగలిగితే మనం కేవలం మంచే చేయాలి. మంచే ఆలోచించాలి. మంచే మాట్లాడాలి అన్న రాఘవయ్యగారి సిద్ధాంతం చాలా గొప్పది. గాంధీజీవంటి ఎందరో మహానుభావులు సమాజానికి ఇటువంటి ఆదర్శాలను అందించారు. 'ఆరోజెప్పుడు? ' నవలాంశానికి ఈ సిద్ధాంతమే ప్రాతిపదిక.

ఒక ఛలోక్తి ఏమంటే మంచి వాతావరణాన్ని కలిగించిన ఈ నవల గురించి విమర్శగాగానీ చెడుగాగానీ ఏమీ అనాలనిపించడంలేదు.

— వి.లక్ష్మి
హైదరాబాదు - *500 076*

## ఆశావహ దృక్పథం

*(నాలుగవ బహుమతి రూ.50/–
పొందిన సమీక్ష)*

"ప్రస్తుతం సమాజంలో ప్రబలంగా వున్న సమస్యల్లో ఒకటైన రియల్ ఎస్టేట్ బిజినెస్‌నీ, గుజరాత్‌లోని భూకంపం తాలూకు విషాదాన్నీ బ్యాక్‌గ్రౌండ్‌గా తీసుకుని ప్రపంచంలో అరుదుగా కనిపించే మానవత్వ పరిమళాల్ని అద్ది చతుర నవలగా అందించారు కల్లూరి శైలబాల.

'ఆరోజెప్పుడు' నవలలో మనల్ని ఆకట్టుకునే ముఖ్యపాత్రలు రాఘవయ్యా, శారదమ్మలవి. విజేష్, నీరవ్‌షా పాత్రలు ల్యాండ్ మాఫియాగా దుర్మార్గులేమో అని ముందుగా అనిపించినా వసంత్ క్యారెక్టర్‌ని అసలైన విలన్‌గా చూపించి కథనంలో బిగి సడలనీకుండా చిత్రించారు రచయిత్రి.

సుశీల, అహ్మద్, విజేష్, శాంతి, మధు జైన్ వగైరా పాత్రలన్నీ చక్కని వ్యక్తిత్వంతో మనసుని హత్తుకుంటాయి. కేశూభాయ్ ఖత్రీ పాత్రనెందుకు పెట్టారబ్బా? అని మొదట్లో అనిపించినా కథ ముగింపులో ఆ పాత్రనే కీలకంగా చేయడంలో రచయిత్రి నేర్పుని చూపించినా ఆ పాత్రని మరికాస్త ముందుగా ప్రవేశపెట్టి ఆ పాత్ర నిడివిని కాస్త పెంచివుంటే ఆ పాత్రని కావాలని ప్రవేశపెట్టినట్టుగా కాకుండా ఆ నవలలోని మిగతా అన్ని పాత్రల్లో చక్కగా విలీనమయ్యేది. ఇంజినీర్ ఆనంద్, అతని భార్య పాత్రల్ని మర్చిపోలేము.

వర్ధన్, రాంభాయ్‌లాంటి నమ్మకస్తులైన అనుచరుల్నీ, వసంత్‌వంటి నమ్మకద్రోహినీ చిత్రించడంలో చక్కని పరిజ్ఞానాన్ని చూపించారు రచయిత్రి.

ఈ నవల మొదట్లోనే ఆవేశంగావున్న విజేష్‌తో శారదమ్మ, "నీ ఆవేశం చూస్తుంటే భయం వేసింది. నా మనసులో మాట చెప్పాలన్పించింది. నా కొడుకు మనుషల ప్రాణాలు తీసే దుర్మార్గుడు కాదని నాకు తెలుసును. అయినాసరే తల్లినికదా. మనసు ఆగలేదు. ఆవేశంలో నా బిడ్డ ఎక్కడ పొరపాటు పని చేస్తాడోనని భయం. అలాంటి పరిస్థితిలో తల్లి

మాటలు గుర్తుకువచ్చి అవి ముందుకాళ్లకి బంధాలైనా ఆవేశానికి పగ్గం వేస్తాయని చిన్న ఆశ అంతే. క్షేమంగా వెళ్లిరా" అన్న డైలాగ్స్‌కి హ్యాట్సాఫ్ చెప్పాలన్పించింది.

ఆ తర్వాత చివర్లో రాసిన ప్రతి పదమూ అభినందనీయంగా వుండటమే కాకుండా ఆశావహదృక్పథంతో ఆ మంచిరోజుకోసం ఎదురు చూడాలనిపించే భావనని కలిగించడం మెచ్చుకోవలసిన విషయం.

ఈ ప్రపంచంలో దుర్మార్గులెందరున్నా మహనీయులు కూడా ఎందరో ఉన్నారన్న విషయం మనందరికీ తెలిసిందే. అయినా ఆ మానవీయ దృక్పథంతో రాసిన ఈ నవల ద్వారా ఆ భావనకి మరింత బలం చేకూరి, ఆనందాన్ని కలిగిస్తుందీ నవల.

– జ్యోతిర్మయి

హైదరాబాదు - 500 073

## లక్ష్యసాధన

*(ఐదవ బహుమతి రూ.50/– పొందిన సమీక్ష)*

ఏ వ్యాపారమైనా పోటీ అనివార్యం. ఒకే రంగంలోని ఇద్దరు పోటీదారులమధ్య రేగిన స్పర్థలు, విభేదాలు, తమ బలాబలాలను తేల్చుకునేందుకు వారు చేసే యుక్తి-కుయుక్తులు నేపథ్యంగా సాగే ఆసక్తికర గాథే 'ఆరోజెప్పుడు' నవల.

మానవతా విలువలకు ఈ నవలలో ఎంతో ప్రాధాన్యాన్నిచ్చారు రచయిత్రి. షా, విజేష్‌ల మధ్య పోటీ కథ వేగంగా సాగటానికి, పాఠకుల్లో ఆసక్తిని రేకెత్తించటానికి పనిచేస్తే ఆదర్శప్రాయమైన ప్రేమకు, మానవసేవా తత్పరతకు, కులమతాతీతకు తను సృష్టించిన అనేక పాత్రల ద్వారా రచయిత్రి కల్పించిన భాగస్వామ్యం పాఠకుల దృక్పథంలో మంచి నవలగా నిలుపుతుంది.

కల్మషంలేని ఇద్దరు వ్యక్తుల మధ్య వసంత్‌వంటి దుర్మార్గుడు ఎంతటి వివాదాల విషాన్ని చిమ్ముతాడో, భూకంపంవంటి విపత్కర పరిస్థితుల్లో సైతం మానవ మృగంలో కామం ఎంతటి దారుణానికి ఒడిగడుతుందో శారద పాత్ర ద్వారా ఓ జీవితంలో ఎన్ని అనూహ్యమైన మలుపులు తిరుగుతాయో కళ్లకు కట్టినట్టు చిత్రించారు ఈ నవలలో.

కులమతాలు, అంతస్థులవంటి ఎన్ని అవాంతరాలెదురైనా ప్రేమకు మాత్రం విజయం తథ్యమంటూ అహ్మద్, సుశీలల పాత్రలను కలుపుతూ కుల మత రహిత సమాజంకోసం ఆశావహ దృక్పథంతో నవలను ముగించటం అభినందనీయం. సమాజంలో సమానత్వం వచ్చే 'ఆరోజెప్పుడు' అని చివరిలో ప్రశ్నార్థకాన్నే పాఠకుల ముందుంచినా నిజమే కదా అని ఏ పాఠకుడూ అనుకోకుండా వుండడు. ఓ మంచి నవలకు అంతకన్నా లక్ష్యసాధన ఇంకేం వుంటుంది? !

– వై. రాజేష్

విశాఖపట్నం -531 173

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 23730328, Office Address: CHATURA, Telugu Monthly, Eenadu Complex, Somajiguda, Hyderabad. Tel: 23318181, 23398787; Visakhapatnam: 2552211; Vijayawada: 2476685; Tirupati: 275757; Anantapur: 273444; Karimnagar: 223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 220901; Kurnool: 252813; Cuddapah: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 277438; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 22819557; Chennai: 28232390;
Bangalore: 25583804.

CHATURA Telugu Monthly Hyderabad-500 082 Regd. No. H/HD/965- RN1/32186/78